

ఈ సంచికలో...



ముఖచిత్రం వలచిందా వకుళమాల-అలిగిందా అగ్నిమాల

చిత్రకారుడు **వడ్డాది పాపయ్య**


యువ సాలుచందా రూ 36-00

దీపావళి సంచికతో రూ 42-00

యువ హైదరాబాదు-500001



కోడూరివారి 'దివ్యదీపావళి' ఈ మాసపు యువకే హైలైట్. ఇకపోతే 'మంత్రపు సంచి' చాలా బ్రహ్మాండంగా ఉంది. ఇక 'సావిత్రి గ్రహించిన సత్యం' 'చీకటి', 'ఇంటిదీపం', 'మాట', 'గయ్యాళి', 'మార్పు' కథలు చాలా బావున్నాయి. 'ఇద్దరు మిత్రులు' కథలో శంకర్రావు కృతఘ్నతను, విజయ్ మొనగుణమును రచయిత కళ్యాణతేజ గారు బహుచక్కగా చిత్రించారు. అభినందనీయులు.

—పి. ప్రభాకరరెడ్డి,
కుదేరు.

ఆగస్టు నెల 'యువ' ఎంతో బాగుంది. ఈ నెల 'యువ'కి 'దివ్యదీపావళి' నవలిక హైలైట్‌గా వుంది. ఎన్నో కథలతోపాటు ఎంతో వెరైటీగా కూడా వుంది ఈ నెల యువ. కథలన్నింటిలోకి 'దేవుడిగది', 'ఇంటిదీపం', 'మహాఇల్లాలు', గయ్యాళి' కథలు బాగున్నాయి. 'చక్రపాణి' సీరియల్ చాలా బాగుంది.

—కొండూరి భార్గవి,
హైదరాబాదు—47.

ఆగస్టు యువ ముఖచిత్రం 'వకుళ మనసున వలపు దోబూచు' ఆకర్షణీయముగా ఉంది. గయ్యాళి, దేవుడిగది కథలు చాలా బాగున్నాయి. జోక్స్ కడుపుబ్బనవ్వు పుట్టిస్తున్నాయి.

—సయ్యద్ హుసేన్,
దేవరకొండ.

## చందాదారులకు ఉచితం

సెప్టెంబరులోగా యువకు చందాదారులుగా చేరువారికి దీపావళి సంచిక ఉచితంగా పంపబడును. అనగా దీపావళిసంచికతో యువ చందా 36-00 రూపాయలు మాత్రమే. దీపావళి సంచిక రిజిష్టరులో పంపగోరువారు అదనంగా రు. 1-50 పంపవలెను.

యువ రెండు సంవత్సరముల చందా 70 రూపాయలు. దీపావళి సంచికలు మా ఖర్చులతోనే రిజిష్టరుచేసి పంపెదము. చందాదారులు ఈ అవకాశం ఉపయోగించుకోవలెనని మనవి.

ఇట్లు,
సర్క్యులేషన్ మేనేజరు,
యువ




# బాధ నివారణ కోసం అయొడెక్స్ రుద్దటం అవసరం

ఇతర ఆయింట్‌మెంట్స్
మీకు బాధనుంచి ఉపశాంతిని
ఇయ్యవచ్చు. అయొడెక్స్
ఉపశాంతిని యిస్తూ, బాధను
నివారిస్తుంది. దీనిలో
అయొడిన్ ఉంది గనక.

కండరాల నొప్పులకూ,
కీళ్ళ నొప్పులకూ ఒకే ఒక
ఆయింట్‌మెంట్-అయొడెక్స్.




**అయొడెక్స్-మిమ్మల్ని మళ్ళీ చురుకుగా పనిచేసేలా చేస్తుంది.**

లింటాస్-IODEX.3-75 TL

ఈ (ఆగస్టు) మాసములో వెల్వడిన యువ సర్వాంగసుందరముగా వున్నది. దివ్యదీపావళి చాలా బాగున్నది. కథలలో సావిత్రి గ్రహించిన సత్యం, ఆఖరిరేఖ, యువకే హైలైట్. ఇక మంత్రపు సంచి పెద్దలను, పిల్లలను ఎంతో ఆకర్షించినది.

—కోదాటి శ్యామసుందర్ రావు,
సర్వవరం.

ఆగస్టు నెల సంచిక చాల బాగుంది. ఈ సంచికలోని కథలు కూడా చాలా బావున్నాయి. 'రావికొండలరావు' వ్రాసిన "గయ్యాళి" అనె కథను చదువుతుంటే "పొట్టచెక్కలయ్యేలా" నవ్వాము అంటే నమ్మండి. "వడ్డాది పాపయ్యగారి" ఈ నెల ముఖచిత్రం మమ్మల్నెంతో ఆకర్షించింది. ఇలాగ మమ్మల్ని ఆకర్షించే ముఖచిత్రాలు, మనస్సును ఆనందపరిచే నవలలు, కథలు, హాస్యాలు యువలో ప్రచురించుచున్నందుకు మేము మీకు కృతజ్ఞతలు ఎలా చెప్పాలో అర్థం కావడంలేదు.

—జి. జగదీశ్వర్ రెడ్డి
వనపర్తి.


AMRUTANJAN
Pain Balm
Amrutanjan Ltd.
14 15 Luz Church Road
Madras-4
తలనొప్పి
తక్షణం తగ్గిపోయింది!
అమృతాంజనం
AM/7571
తలనొప్పి, జలుబు, ఇతర బాధలను నిరపాయంగా చప్పున పోగొడుతుంది
తలనొప్పి, వళ్లునొప్పి, కండరాల నొప్పి, బెణుకులు, జలుబులు—చప్పున తగ్గాలంటే అమృతాంజనం వాడండి. బాధగా వున్నచోట అమృతాంజనం రాయండి. తక్షణం బాధ మాయమవుతుంది. అమృతాంజనం చిన్న సీసాలలోనూ, ఆదాచేసే పెద్ద సీసాలలోనూ, తక్కువ ధరకి లభించే చిన్న డబ్బాలలోనూకూడా దొరుకుతోంది.
అమృతాంజనం 10 ఔషధాలు కలిసినది.
అమృతాంజన్ లిమిటెడ్

# యువ ప్రచురణలు

| | | | | |
|---|---|---|---|---|
| 1 | అరుణోదయం | (నవల) | కొ. కుటుంబరావు | 2-00 |
| 2 | మారుపేర్లు | | ,, | 2-00 |
| 3 | కులంలేని మనిషి | | | 2-00 |
| 4 | గడ్డు రోజులు | | ,, | 2-50 |
| 5 | నీకేం కావాలి | | | 2-00 |
| 6 | నిలవ నీరు | (కథలు) | ,, | 2-00 |
| 7 | కాలభైరవుడు | | | 2-00 |
| 8 | వరప్రసాదం | | | 2-00 |
| 9 | మొండివాడు | | ,, | 2-00 |
| 10 | శిథిలాలయం | (నవల) | గోపీచంద్ | 2-50 |
| 11 | అర్థమున్న కథలు | (కథలు) | అవసరాల రామకృష్ణరావు | 2-50 |
| 12 | కరుణ | (నవల) | రవీంద్రనాథ్ ఠాకూర్ | 2-00 |
| 13 | వీరఛత్రసాల్ | (సంక్షిప్త నవల) | | 2-50 |
| 14 | మాధవీ కంకణం | | | 2-50 |
| 15 | రాజసింహ | | | 2-50 |

| | | |
|---|---|---|
| 16 | కుంకుమభరిణ (సంక్షిప్త నవల) | 2-50 |
| 17. | ఆనంద మఠం ,, | 2-50 |
| 18 | కపాల కుండల ,, | 2-50 |
| 19. | గోరా , | 3-00 |
| 20 | మాయావి ,, | 3-00 |
| 21 | సీతారామ్ , | 2-50 |

పది కాపీలకు తక్కువ కాకుండా సొమ్ము ముందుగా పంపినవారికి ఖర్చులు మేమే భరించి పుస్తకాలు పంపుతాము యువ ఏజంట్లకు 30% కమీషన్ ఇవ్వబడుతుంది కావలసిన కాపీలకు కమీషన్ మినహాయించుకొని డబ్బు ముందుగా పంపవలసినదిగా ఏజంట్లను కోరుతున్నాము

**యువ పబ్లికేషన్స్,**
హైదరాబాద్ - 500 001

# యువ

## దీపావళి ప్రత్యేక సంచిక

ఎప్పటివలె ఈ రాక్షసనామ దీపావళికి వెలువడే ప్రత్యేక సంచికలో ప్రచురణార్థం - రచయితలు రచయిత్రులు, చిత్రకారులు తమ రచనలను, కార్టూన్లను మా కార్యాలయానికి ఆగస్టు నెలాఖరులోగా పంపగోర్తాము క్రింది అంశాలను గమనించ ప్రార్థన

1 రచన ఫుల్‌స్కేప్ సైజులో 10 పేజీలకు మించరాదు

2 కాగితానికి ఒక పక్కనే వ్రాయాలి

3 కవరుమీద దీపావళి సంచిక కోసం' అని వ్రాయాలి

4 ప్రచురణకు అంగీకరించబడనివాటిని త్రిప్పి పంపగోరేవారు తగు పోస్టేజీగల స్వంత చిరునామా వున్న కవరును జతపర్చి పంపాలి

5 రచన తమ సొంతమేననీ, దేనికీ అనుకరణ, అనువాదం కాదనీ హామీ పత్రం వ్రాయాలి

6 దీపావళి సంచికకోసం పంపినా స్థలాభావంవల్ల అందులో ప్రచురించకపోతే, తరువాతి సంచికలలో ప్రచురించే హక్కు మాకు ఉన్నది

— సంపాదకుడు, యువ

# యువ

సచిత్ర మాసపత్రిక

సంపాదకుడు చక్రపాణి

సంపుటి 32 | సెప్టెంబరు, 1975 | సంచిక 3

అక్టోబరు నెల

## భావపరిచయ పోటీ

బహుమానం రూ. 10.00



ఈ కార్టూనుకు హాస్యయుత వ్యాఖ్య (Caption) కావాలి.

# భావపరిచయ పోటీ

ఆగస్టు నెల

**బహుమతి పొందిన వ్యాఖ్య**



ఆ వె॥ నీరుతోడ నాతి నీటి చుక్క రాక
వరదలగుచు చెమట పార దొడగె
భూమిలోని నీరు 'గంగలో కలిసెనా?'
సురులు నగవు విడిచి చెప్పరేల?

—ఎం. పద్మావతి,
సికింద్రాబాదు-25




రమణారావు చాలా చిత్రమైన మనిషి! అతనితో నాకు మూడేళ్ళ పరిచయం ఉంది. ఈ మూడేళ్ళలోనూ అతని మనస్తత్వం గురించి నాకు తెలిసింది కొంచెం కూడా లేదు. రమణారావు ఎప్పుడు ఎలా ప్రవర్తిస్తాడో ఎవ్వరూ చెప్పలేరు. ఎప్పుడూ ఏదో సీరియస్‌గా ఆలోచిస్తున్నట్లు ఉంటాడు అప్పుడప్పుడూ చాల సరదాగా కూడా ఉంటాడు-కాని అది ఎంతోసేపు ఉండదు నవ్వుతూ మాట్లాడుతూ ఉన్నట్లుండి ముఖం తీవ్రంగా మార్చేస్తాడు అతనితో జోక్ చెయ్యాలన్నా నాకు భయం...ఒక్కోసారి జోక్‌ని చాల తేలిగ్గా తీసుకుంటాడు గానీ ఒక్కోసారి ముఖం చాల సీరియస్‌గా పెడ్తాడు అతను ఎక్కువ ఎవ్వరితోనూ కలవడు కూడా!...అతనికి నేనొక్కడినే స్నేహితుడినేమో!!...

మొదటిసారి రమణారావు ప్రేమలేఖలు చూపించినప్పుడు నేను చాల ఆశ్చర్యపోయాను. అవి ఎవరో ఇద్దరు అమ్మాయిలు అతనికి రాసిన ప్రేమలేఖలు.

"మీరు నాకు స్నేహితులు గా ఉండి మీ

దగ్గర ఏమీ దాచకూడదు...అందుకనే మీకు అంతా చెప్పేస్తున్నాను...ఇదిగో ...ఈ లేఖలు చదవండి...మీకే తెలుస్తుంది" అంటూ ఇవ్వబోయాడు.

"అబ్బే ... ఎందుకులెండి... మీరు చెప్పండి చాలు" అంటే అతను వినలేదు. ఏమైనా సరే...నేనా ఉత్తరాలు చదవాల్సిందేనని పట్టుబట్టాడు.

ఆ ఉత్తరాలన్నీ ఓపిగ్గా చదివాను. ఆ ఉత్తరాలబట్టి అవి రాసిన అమ్మాయిలు ఎవరో రమణారావును గాఢంగా కాంక్షిస్తున్నారని తెలుస్తూంది. "నువ్వంటే పడిచస్తాను...నువ్వు లేందే బ్రతకలేను..." అంటూ రాశారు వాళ్ళిద్దరూ. నాకు చాల ఆశ్చర్యం వేసింది.

ఒకమ్మాయి ఒకబ్బాయిని ప్రేమించినా ఒకబ్బాయి ఒకమ్మాయిని ప్రేమించినా అంత ఆశ్చర్యపడాల్సిన అవసరం లేదు. కాని నేను ఆశ్చర్యపడడానికి మాత్రం కారణం ఉంది. అది రమణారావు రూపమే ...

రమణారావు కలల్లోకి వచ్చేంత అందగాడు కాదు కానీ అతన్ని పగలు చూస్తే రాత్రి కలలోకి తప్పకుండా వస్తాడు. మనిషికూడా ఏమంత ఆరోగ్యవంతుడు కాడు. పోనీ ఏ విషయంలోనైనా పేరు ప్రఖ్యాతులున్నవాడా అంటే అదీ లేదు ...మరి ఆ అమ్మాయిలు ఏం చూసి ఇతన్ని ప్రేమిస్తున్నట్టు?...ఆ మెల్లకళ్ల సుబ్బారాఘను పిల్లికళ్ళ శారద, నల్ల కమలని తెల్ల గోపాలం ప్రేమించడం లేదూ?...అట్లానే ఇది కూడా అని సరిపెట్టుకున్నాను.

ఒకరోజు, నేను శంకరం మాట్లాడుతుంటే ఎట్లానో మధ్యలో రమణారావు గురించి ఏదో విషయం వచ్చింది.

"ఏమిటీ? ... రమణారావా?? ... పాపం!...పూర్ ఫెలో!!..." అన్నాడు శంకరం.

నేను ఆశ్చర్యపోయాను.

"రమణారావు నీకు తెలుసా?"

"అతని గురించి తెలియకపోవడం ఏమిటి గురూ...అతను ఆఫీసులో మా సెక్షనులో ఒక సంవత్సరంపాటు పని చేశాడు. ఇప్పుడు వేరే సెక్షనుకు మారిపోయాడు."

రమణారావు గురించి శంకరం చెప్పిన విషయాలు చాల ఉత్సుకత కలిగించేవిగా ఉన్నాయి.

రమణారావే వాళ్ళింట్లో అందరికంటే పెద్దపిల్లవాడు. రమణారావు తరువాత మరో అబ్బాయి ఇంకో అమ్మాయి ఉన్నారు. ఇంట్లో అందరికీ, వాళ్ళ అమ్మకూ, నాన్నకూ, తాతయ్యకూ, నాయనమ్మకూ అందరికీ రమణారావు తమ్ముడంటేనే ఎంతో ముద్దు!... వాడు చాల అందంగా కూడా ఉంటాడు. రమణారావుతో ఇంట్లో అందరూ పరాయిపిల్లవాడిలా ప్రవర్తించేవారు. రమణారావు ఏదైనా తప్పుపని చేస్తే

వాళ్ళమ్మ కయ్యమని పైకి లేచేది! వాళ్ళ నాన్న అతన్ని పట్టుకుని చితక బాదే వాడు. అదే తప్పుగనక అతని తమ్ముడు చేస్తే పోనీలెద్దూ...పాపం కుర్ర వెధవ వాడికేం తెలుసు అని ఊరుకునేవారు. రమణారావుకు అతని తమ్ముడికి వయసులో రెండేళ్ళు మాత్రమే తేడా!!

ఆ విధంగా అందరికీ దూరంగా ఉండే తత్వం రమణారావులో ఏర్పడింది. అతను కాలేజీలో చదువుతూ ఉండగా ఒక అమ్మాయిని ప్రేమించాడుకూడా. ఒకనాడు ధైర్యంచేసి ఆఅమ్మాయికి తన ప్రేమను తెలియజేసి పెళ్ళిచేసుకుంటాను అని చెప్పాడు.

ఆమె గట్టిగా నవ్వి "నేను...నిన్ను పెళ్ళి చేసుకుంటానని ఎలా అనుకున్నావ్?" అంది.

రమణారావు జీవితంలో మొదటిసారి ప్రేమించిన మనిషి ఆమె!...పాపం... అందుకనే అతను అప్పట్లో చాల కృంగిపోయాడు. కాలేజీ చదువులయిపోయిన తరువాత ఓ చిన్న ఉద్యోగంలో దూరాడు.

ఒకసారి రమణారావుకు పెళ్ళి సంబంధం వస్తే ఇతను వెళ్ళి అమ్మాయిని చూచి నచ్చినట్లు చెప్పాడు. ఇంట్లో అందరికీ అమ్మాయి నచ్చింది...వాళ్ళు కూడా రమణారావు సంబంధం చెయ్యడానికి యిష్టపడ్డారు. కట్నకానుకల దగ్గరకూడా పేచీ ఏమీరాలేదు. సంబంధం కుదిరినట్లే అని అందరు అనుకున్నారు... కాని ఈ సంబంధం తనకు యిష్టం లేదనీ తన మాట వినకుండా తనకి పెళ్ళిచేస్తే ఉరోసుకుని చస్తానని ఆ అమ్మాయి గోల చెయ్యడంతో ఆ సంబంధం తప్పిపోయింది. అప్పటినుండీ రమణారావు మళ్ళీ పెళ్ళి చూపులకంటూ వెళ్ళలేదు.

"అతను ప్రేమకోసం మొహం వాచిపోయి ఉన్నాడు... అందుకనే పాపం అతను అదోమాదిరిగా ఉంటాడు" అన్నాడు శంకరం నిట్టూరుస్తూ.

"ఇప్పుడు అతనికి అవసరమైనప్రేమ లభ్యమైందిలే!..." అంటూ రమణారావుకు అమ్మాయిల దగ్గరనుండి వచ్చే ప్రేమలేఖల విషయం చెప్పాను.

నేను చెప్పిన విషయం విని శంకరం ఆశ్చర్యపోయాడు. నేను స్వయంగా అతనికి వచ్చిన ప్రేమలేఖలు చూశానని చెప్పేవరకూ శంకరం ఒకపట్టాన నమ్మలేదు.

రమణారావు అప్పుడప్పుడూ నన్ను కలుస్తూ తనకువచ్చే ప్రేమలేఖలు గురించి చెపుతూనే ఉన్నాడు. మొదట నాకు చెప్పిన అమ్మాయిలేకాక ఇప్పుడు ఇంకా ఎవరెవరి దగ్గరనుండో కూడా ఉత్తరాలు వస్తున్నట్లు చెపుతున్నాడు. అతను చెప్పే విషయాలు నేను నమ్మకపోయి ఉండేవాడినే... కాని ఒకరోజు నేను వాళ్లింటి దగ్గర ఉన్నప్పుడు పోస్టులో ఒక ప్రేమ

లేఖ రావడమూ దాన్ని నేను చూడటమూ జరిగింది. ఇక నమ్మకుండా ఎలా ఉండగలను?...నాకీమధ్య రమణారావు వశీకరణ శక్తిలాంటిది ఏదైనా సాధించాడేమోనని ఒక అనుమానం మనసులో పీకుతూ ఉంది.

ఆరోజు ఆదివారం! ఇంటిదగ్గర ఏమీ తోచక రమణారావు యింటికి బయలు దేరాను. నేను వెళ్ళేసరికి రమణారావు ఏదో ఉత్తరం రాసి కవరుమీద అడ్రసు రాస్తున్నాడు నన్ను చూడగానే కవరు చటుక్కున టేబులు సొరుగుతీసి అందులో పడేసి

"హలో... రావుగారా?... రండి రండి" అంటూ ఆహ్వానించాడు.

ఇద్దరం కొంచెంసేపు కూర్చుని ఆమాటా ఈమాటా చెప్పుకున్నాం.

"ఏదైనా పిక్చర్‌కి వెళ్దామండీ... బోర్ కొడుతుంది" అన్నాను నేను.

"అవును...నాక్కూడా అలా బయటికి ఎక్కడికైనా వెళ్దామని ఇందాకటి నుండీ అనిపిస్తుంది... ఒక్క నిముషం ఆగండి .. ముఖం కడుక్కుని బట్టలు మార్చుకుని వచ్చేస్తాను" అంటూ లోపలికి వెళ్ళాడు.

ఇందాకటినుండీ నా మనసంతా అతను నేను వచ్చినప్పుడు రాస్తున్న ఉత్తరం మీదనే ఉంది. నేను వచ్చినప్పుడు అతను టేబులు సొరుగు తెరిచి తొట్రుపాటుతో ఉత్తరాన్ని అందులో పడెయ్యడమే నాకుతూహలానికి కారణం.

అది తప్పకుండా ప్రేమలేఖ అయి ఉండాలి!... రమణారావు ఇంతకీ ఏ అమ్మాయికి ఉత్తరం' వ్రాస్తున్నాడో తెలుసుకోవాలని నాకు అనిపించింది. తనకు ఉత్తరాలు వ్రాస్తున్న అమ్మాయిల్లో అతను ఏ అమ్మాయిని ఎన్నుకున్నట్టు?...

నా కుతూహలాన్ని అణుచుకోలేకపోయాను... ఆ కవరుమీది చిరునామా చూసినంతమాత్రాన తప్పేమీలేదుగా?...

చటుక్కున సొరుగు తీసి రమణారావు వ్రాసిన ఉత్తరం తీశాను. కవరు మీద అతని అడ్రసే ఉంది. నా ఆశ్చర్యానికి అంతులేదు.

కవరు అంటించి లేదు!... తప్పే అయినా కుతూహలం అణుచుకోలేక కవరులోని కాగితం చూశాను. అందులో రమణారావుకు ఎవరో అమ్మాయి ప్రేమలేఖ రాసినట్టుఉంది. ఇదివరకు రమణారావు చూపించిన ప్రేమలేఖలో ఇటువంటి చేతివ్రాత ఉన్నవి రెండు మూడు చూశాను. ఆ టేబులు సొరుగులో ఇంకా రెండుమూడు రకాల చేతివ్రాతల్లో అమ్మాయిల పేర్లతో ప్రేమలేఖలు ఉన్నాయి.

అన్నీ ఇంకా పోస్టుచెయ్యాల్సినవి!...

అన్నీ రమణారావుకు అందాల్సినవి!!...

---

అన్నీ కాలదోషం పట్టిపోతున్నాయి!" మా అమ్మ నాలుక ముందుకు సాగింది. పైపెచ్చు ఆ నాలుకపై యింత కారంకూడా చల్లబడింది.

ఆవిడ ఎప్పుడూ నన్ను నిందించే అవకాశాలకోసమే ఎదురుచూస్తూంటూంది. ఆ అవకాశం వొచ్చినప్పుడల్లా నోరువిప్పి, నాలుకసాచి, మనస్సులోవున్న ఉక్రోషాన్నంతా వెళ్ళగ్రక్కుతుంది. నిజానికి ఆవిడ మా ఇంట్లో నిభాయించుకో దగ్గ వ్యక్తి కాదు. నేనూ, మా నాన్నగారూ ఈనాటి నాగరికతనూ ఫ్యాషన్లనూ, పద్ధతులనూ, అభిరుచులనూ అలవాటుచేసికొని, వాటిప్రకారం సంఘంలో హోదాగా, యెత్తుగా, ప్రత్యేకంగా బ్రతకాలనేవాళ్ళం. మా అమ్మ అందుకు పూర్తిగా భిన్నం. ఆవిడకు తాతలనాటి సంప్రదాయాలూ, ఆచారాలూ, కట్టు బాటులూ, ఆనాటి సాంఘిక మర్యాదలూ సూత్రాలూ అంటే ప్రాణం. వాటినే ఇంటికి పట్టిన పాత బూజులా పట్టుకుని వ్రేలాడుతుంది. ఒంటెద్దు బండిలో ప్రయాణించాలంటే, ఉదయం చల్దిఅన్నం తినాలంటే, కాలేజీలో ఆడపిల్ల చదవ రాదంటే, పెళ్ళికిముందు మగపిల్లలతో మాట్లాడకూడదంటే, ముక్కుకు వుడకా, కాళ్ళకు వెండి పట్టాలూ, చెవులకు లోలాకులూ, నడుంకు వడ్డాణమూ పెట్టుకోవా లంటే; మోచేతులకూ, నడుంవరకూ దిగే జాకెట్టూ, మందపాటి చీరెలూ ధరించా లంటే—ఈ రోజుల్లో నాలోటివాళ్లకు సరిపడుతుందా? ఆవిడ చాదస్తం ఆవిడదే అనుకుంటూ వుంటాం నేనూ, మా నాన్నగారూ.

నేను మాటలాడకపోవటం చూసి, మళ్ళీ అందుకుంది మా అమ్మ.

"ఇంతకీ ఈ సందెవేళ జామచెట్టు యెందుకెక్కావే!"

"దాని కొమ్మల్లో గాలిపటం యిరుక్కుంది; తీసేందుకు యెక్కాను అన్నాను నేను తలదించుకొని ఆవిడ యెంత ఉద్ధృతంగా మాటలాడినా భరించ టానికి సిద్ధపడి.

"మా అమ్మ విడ్డూరంగా నోటికి అడ్డంగా చేయిపెట్టుకొని, "అవ్వ! ఆడ ముండకు నీకు గాలిపటాలేమిటే! వాటికోసం చెట్టెక్కడమేమిటీ! పెళ్ళిగావాల్సిన పిల్లకుండాల్సిన లక్షణాలేనా యివి!" అన్నది.

"నీకు కొడుకునైనా, కూతుర్ని అయినా నేనే గదమ్మా! ఈ యీడులోవున్న కొడుకైతే యీ తరుణంలో తప్పకుండా గాలిపటాలెగురవేసేవాడు కదూ! అందుకే ఆ ముచ్చటను నేను తీర్చటానికి ప్రయత్నించాను" అన్నాను నేను ముసిముసి నవ్వులు నవ్వుతూ.

మా అమ్మకు యెక్కడ మండాలో అక్కడ మండింది. ఆ వంతున నాపై పఠాన్ టాంకువలె విరుచుకుపడింది.

"ఎన్ని వేషాలూ, వగళ్లూ నేర్చావే! మీ నాన్న అండచూసికొని నన్ను మరీ అరిచేతిలో ఉసిరికాయలాగ ఆడిస్తున్నావు. ఎంతకాలంలే యీ మిడిసిపాటు! ఆ మూడుముళ్లూ పడితే, ఆ వచ్చేవాడే నీ నుదుటపొడిచిన పొద్దును అస్తమింప జేస్తాడు! నేను నోరు పారవేసుకొని ప్రయోజనమేమిటి?"

రాములు ఇంట్లోనుంచి యూకలిప్టస్ ఆయిల్ తెచ్చాడు, మోచేతులకూ, మోకాళ్లకూ వ్రాసికోమని, నొప్పులు తగ్గుతాయని.

"వొద్దులేరా. నా కసలు దెబ్బలు తగలందే. ఇంకా నొప్పులెక్కడా?" అని త్రోసిపారేశాను.

మా అమ్మ నాకేసి చురకత్తిలా చురచుర చూస్తూ 'లాన్' దగ్గరకు వెళ్ళింది చేతిలో వారపత్రికతో. రాములు కూడా తన పనిలోకి తను తప్పుకున్నాడు.

ఎంత దెబ్బ తగిలినా వొంటిమీద వాలిన ఈగను పారద్రోలినట్టు, అన్నీ త్రోసేసి, ఉషారుగా తిరిగే వయస్సులో ఉన్నాను. జామచెట్టు మీదనుంచి పడిన దెబ్బలకు జాగ్రత్త తీసుకోవాల్సిన అగత్యం నాకేమీ కనబడలేదు. ఆ రాత్రి నాన్నగారు అడిగినప్పుడు కూడా, 'ప్చ్! వెరీ సింపుల్ డాడీ! నో, అయామ్ ఆల్‌రైట్' అన్నాను. నాన్నగారు సంతృప్తి చెందారు.

ఆ తర్వాత నేను మామూలుగా కాలేజీకి వెళ్ళసాగాను. ఉదయంపూట 'స్విమ్మింగ్ క్లబ్'కు కూడా వెళుతూ ఉన్నాను. డైవింగ్ బెంచిమీదనుంచి అన్ని రకాల పోజుల్లో 'స్విమ్మింగ్ పూల్'లోకి దూకుతున్నాను. 'బటర్‌ఫ్లై', 'బ్యాక్‌స్ట్రోక్' మొదలైన రకాల ఈతల్ని మామూలుగా ఈదుతున్నాను. స్నేహితులూ, శ్రేయోభిలాషులూ, నాన్నగారూ, నా ఫ్యాన్సూ—అందరూ యథాలాపంగానే అభినందిస్తున్నారు.

—కాని నెలరోజులు గడిచేసరికి నన్ను కబళించడానికి సిద్ధంగావున్న దుర్విధి కన్ను తెరిచి కరాళ దంష్ట్రిగ్నుల్ని కురిపించింది. అడుగు ముందుకు వేయకుండా కట్టిపడవేసి, పెద్దహాస్పటల్‌కి దారి చూపింది మరి నేను చేసుకున్న పాపమేమిటో!

## 2

ఇంతవరకు నా జీవితంలో పద్దెనిమిది వసంతాలు గడిచాయి. పంథొమ్మిదో వసంతం గడుస్తుందో, లేదో! చెప్పలేనంత దుస్థితికి హఠాత్తుగా దిగజారింది నా

నేను వేసుకెళుతూ వుంటాను. నాన్నగారు వియట్ పాడుతూ ఉంటారు. కార్లపై నాకు గల మోజు ఆయనకు లేదు.

మా ఇల్లు ఇంద్రభవనం లాగుంటుందంటే వీసమెత్తు ఆశ్చర్యపడాల్సింది లేదు అత్యాధునిక పద్ధతుల్లో మూడేళ్ళక్రితమే నిర్మించబడింది. మూడున్నర లక్షలైందని ఓ రోజు నాన్నగారు చెప్పారు. అందులోకి తెచ్చిన ఫర్నిచరు ఖరీదు లక్ష. రకరకాలైన తొమ్మిది సోఫాసెట్లు. ఓ డజను 'డన్‌లప్' పరుపులు. ఓ వంద ఆయిల్ పెయింటింగ్స్ అన్నీ ప్రకృతి దృశ్యాలకు సంబంధించినవే. నాకు ల్యాండ్‌స్కేప్ ఆర్టంటే అభిమానం జాస్తి. వాటర్ కలర్స్‌తో అప్పు డప్పుడూ ల్యాండ్ స్కేప్ దృశ్యాన్ని చిత్రిస్తూ వుంటాను. ఆ ఆర్టుమీద యెన్నో జపానూ, చైనా పుస్తకాలు తెప్పించాను. సేన్, సంజీవదేవ్ చిత్రాలంటే నాకు మహా యిష్టం. మా యింటి గ్రంథాలయం కూడా చాల గొప్పదే దాదాపు ఇరవై అయిదువేల రూపాయలు ఖరీదుచేసే పుస్తకాలున్నాయి. ఈ రోజుల్లో ఇంట్లో యెంత గొప్ప లైబ్రరీవుంటే ఇంటికి అంత గొప్ప అందం; అందులోవుండే మనుష్యులకు అంత గొప్ప హోదా. తనకి మంచి పుస్తకమని తోచిందల్లా మా నాన్నగారు కొనుక్కొస్తారు ఎంత ఖరీదైనా. ఒకటి రెండు పేజీలు చదివి భద్రంగా అద్దాల బీరువాలలో అమరుస్తారు. మరి ఆయనకు చదివే తీరికా, ఓపికా ఉండొద్దూ. నేనూ ఆర్టు, ఫోటోగ్రఫీ స్పోర్ట్సు, విజ్ఞానం మీద యెన్నో పుస్తకాలు తెప్పించాను. వాస్తవానికి చదివేందుకు నాకూ తీరికా, ఓపికా లేవు. కాని ముందుముందు చదువుదామనే ఆలోచనా, అభిలాషా దండిగా ఉన్నాయి. మళ్ళీ అప్పుడప్పుడూ భయం వేస్తూంటుంది, మా యింట్లోవున్న పుస్తకాలన్నిటినీ చదవడానికి నా జీవితకాలం సరిపోతుందో లేదోనని. ఇంకా మా యింటిని గురించి చెప్పాలంటే అది అయిదెకరాల విస్తీర్ణంగల చదునైన ప్రదేశం మధ్యలో వుంది. చుట్టూ బ్రహ్మాండమైన గార్డెన్. ఫౌంటెన్ చుట్టూ ఓ అరయెకరం మేరకు లాన్. దాని ప్రక్కనే అర్ధగజం యెత్తులో మూడు గజాలు పొడుగూ, వెడల్పాగల అక్వేరియం పెట్టించాను. అందులో వివిధరకాలైన చేపల్ని తెప్పించి లోపల పెట్టించాను. మా యింటికొచ్చే అతిథులంతా కేవలం మా యింటిని చూడటంలోనే వో గంటసేపు కాలక్షేపం చేస్తూంటారు. మా గార్డెన్‌లో వున్న చెట్లపేర్లనూ పూలమొక్కల పేర్లనూ జాబితా రూపంలో యివ్వాలంటే ఆ జాబితా కొండవీటి చాంతాడంత అవుతుంది.

నేనెంత గొప్పగా, హోదాగా, గర్వంగా, స్వేచ్ఛగా, హడావుడిగా బ్రతుకు

తున్నానో మీరు తేలిగ్గా ఊహించుకోవచ్చు. ఆస్తీ, అందమూ, చదువూ, అవ కాశాలూ-అన్నీ ఉన్నాయి. అట్లాంటి నా బ్రతుకులో దుర్విధి చంద్రనిప్పుల్ని దోసిళ్ళతో యెత్తిపోసిందంటే-ఆ దారుణానికి నేనెట్లా తట్టుకోగలను?

ఆ రోజు సాయంకాలం నాన్నగారు నన్ను పెద్దహాస్పిటల్‌కు తీసికెళ్ళారు. డాక్టర్ రామన్‌చేత నా కుడికాలును ఎక్స్-రే తీయించారు. దావుకబుర్ను ఆయన మరునాడు మెల్లగా చెప్పాడు, కుడికాలు మోకాలిక్రింద క్యాన్సర్ వ్యాధి ప్రవేశించిందని

నేను మొదలు నరికిన చెట్టులా కూలిపోయాను.

మా నాన్నగారు రెండుకాళ్ళ మధ్యా తలపెట్టుకొని బావురుమని ఏడ్చారు.

క్యాన్సర్ వ్యాధీ, దారుణమైన మరణమూ—యీ మాటలు నా బ్రతుక్కు చాల కొత్తవి. ఎప్పుడూ ఊహాలోకంలో చొరబడనటువంటివి. ప్రపంచమంతా 'గోల్డెన్ ఏపిల్'గా భావించే నాకు యీ ఘోరమైన జబ్బు పట్టుకోవడమేమిటి? నాకు మల్లేనే అతనూ భరించలేడు. మా యిద్దరివీ తమలపాకు కంటె పేలవ మైన, పలుచని హృదయాలు. ఏ గాలి తాకిడికీ తట్టుకోలేవు!

సాగర్‌ను నేను మహాపిచ్చిగా ప్రేమించాను. అతను నా క్లాస్‌మేట్ కాదు. క్లబ్బు ఫ్రెండ్. అతనూ 'స్విమ్మింగ్'లో ఆరితేరిన ఘటమే. నాతో ఒకటి రెండుసార్లు ఓడిపోయినా, అతని సామర్థ్యాన్ని నిర్లక్ష్యం చేయడానికిలేదు. బి.ఇ ఫోర్త్ ఇయర్ చదువుతున్నాడు ఇంజనీరింగ్ కాలేజీలో. మా యిద్దరికీ స్విమ్మింగ్ క్లబ్బులోనే తొలిగా పరిచయమైంది. ఆ క్లబ్బులోనే ఆ పరిచయం ప్రేమగా అంకురించి, ఓ సంవత్సరంలోనే పరిణయమాడేందుకు నిర్ణయం తీసి కొనేవరకూ అభివృద్ధిచెందింది. అతను చాలా అందమైన యువకుడు. ప్రథమ వీక్షణంలోనే అతని మెరిసే సౌందర్యం నా మనస్సుపై చెరగని ముద్రవేసింది. వసిమివన్నె మేని ఛాయ. ఆరడుగుల పొడవూ, అందుకు తగ్గ లావూ గలిగి మాంచి ఆరోగ్యంగా, ఆహ్లాదంగా ఉంటాడు ఎముకపుష్టి మెండు. కొంచెం సోగ మొహం. ముక్కూ, కళ్ళూ తీర్చిదిద్దినట్లుంటాయి. పొడవు మెడ, మైదానం లాంటి వక్షస్థలం, చక్కని ఉంగరాల జుత్తు. మొత్తంమీద హృదయంలో పది కాలాలపాటు నిలిచే ఫిగర్. ఆయన తండ్రికి గవర్నమెంటులో నాలుగంకెల జీతంలో వున్న పెద్ద ఉద్యోగం

మా ప్రేమల్ని ఒకరికొకరం పరస్పరం తెలియబర్చుకున్నాక-విచ్చలవిడిగా విహరించసాగాం. క్లబ్బులూ, సినిమాలూ, షికార్లూ, పార్టీలూ ఒకటేమిటి

స్వేచ్ఛగా తిరిగాం. అతను బర్త్‌డేకి 'క్వాలిటీ'లో పార్టీ యిస్తే; నా బర్త్‌డేకి 'త్రీ ఏసెస్'లో పార్టీ యిచ్చాను. మా యిరువురికీ త్వరలోనే వివాహం జరుగుతుందనీ, మా జీవితాలు ఆదర్శ దాంపత్యంతో సుఖంగా వెలుగొందుతాయనీ అందరూ అనుకొంటూండేవాళ్ళు. నేనూ, సాగర్ కూడా ఆ విధంగానే భావించాం.

వ్యాధి నిర్ణయమైనాక, ఏంచేయాలి? అన్న ప్రశ్న వొచ్చింది. "ఎంత త్వరగా అపరేషన్ చేస్తే అంత మంచిది" అన్నాడు డాక్టర్ రామన్.

"అంటే—" అన్నారు నాన్నగారు నోరు తెరిచి.

డాక్టర్ రామన్ ఓ నిమిషంపాటు మౌనం వహించాడు. ఎట్లా చెప్పాలా అని బాధపడుతున్నట్టున్నాడు. ఆయన మొహంలో వ్యథని గ్రహించి నేను విచలితయైనాను.

"ఆ కాలు శాశ్వతంగా మోకాలివరకు తొలిపించవల్సి ఉంటుంది. లేదా ప్రాణానికే అపాయం!" అన్నాడు డాక్టర్ రామన్ మెల్లగా.

నా నెత్తిపై ఇనుపదూలం అకస్మాత్తుగా పడినట్లయింది. హతాశురాలినయ్యాను.

మా నాన్న అచేతనుడై నిలబడ్డాడు.

మా అమ్మ బావురుమని ఏడ్చింది.

"అంతకంటె గత్యంతరంలేదు. భగవంతుని చైదానికి తలయొగ్గవల్సిన విధి మానవునిది" అన్నాడు డాక్టర్ రామన్ వేదాంత ధోరణిలో. ఆయన పాతిక సంవత్సరాల ప్రాక్టీసులో యిలాంటి కేసుల్ని యెన్నో చూసివుంటాడు. నిశ్చేష్టత జెందే అగత్యం ఆయనకు లేదు.

## 3

రేపటి దినాన నన్ను హాస్పిటల్లో చేర్చుతారనగా, ఆ రోజు సాయంకాలం సాగర్ మా యింటికొచ్చేడు నేను గార్డెన్‌లో కూర్చుని అందమైన పువ్వులకేసి చూస్తూ కన్నీరు కారుస్తున్నాను. నేను కుంటిదాన్నయితే—ఈ గార్డెనూ, మేడా, స్విమ్మింగ్‌పూల్, రంగురంగుల ప్రపంచమూ యేంకాను? ఈ ప్రపంచాన్ని నేనెట్లా ఉపయోగించుకోను? భవిష్యత్తూ, జీవితమూ, అనుభూతులూ—ఇవన్నీ చీకట్లోకి నిష్క్రమిస్తాయిగదా! ఇంకా నేను బ్రతికి ప్రయోజనమేమిటి?

"డార్లింగ్! నీ విషయం విని నిలువెల్లా క్రుంగిపోయేను. కాలూ చేయీ



ఆదక ఇట్లా పరుగెత్తుకొచ్చాను. ఆపరేషన్ లేకుండా జబ్బు నయంకాదా?"
అన్నాడు సాగర్ నాచెంత కూర్చుని కుడికాలును సవరిస్తూ.

నా కళ్లల్లో నీళ్ళు గుండ్రంగా తిరిగాయి. కడుపులో దుఃఖం వుండగట్టింది.
ఏం మాటలు పెగలక ఏడ్చాను.

నన్ను తన వొళ్లోకి తీసికొని, ఓదార్చటానికి ప్రయత్నించసాగాడు సాగర్.

"సరితా! దుఃఖించకు! నేనున్నాను నీ కష్టాల్లో, సుఖాల్లో సరిసమానంగా
పాలు పంచుకొనే యువకుణ్ణి. ఏడ్వకు. మనపట్ల భగవంతుడున్నాడు. మన
ప్రేమను గుర్తించాడు. మనకు అన్యాయం చేయడు. ఆపరేషను విజయవంత
మౌతుంది. వచ్చే స్విమ్మింగ్ టోర్నమెంట్సులో యిద్దరమూ పాల్గొందాం.
ధైర్యం తెచ్చుకో! దిగులుపడకు."

కాని ఆ మాటల్లో నాకు రవ్వంత ధైర్యం చేకూరలేదు. పైపెచ్చు అతను
కేవలం నా కళ్లనీళ్లు తుడవడానికి అలా అంటున్నట్టు కనబడింది. నా కాలు

తొలగించడం ఖాయమని డాక్టరుగారు చెబుతున్నారు. ఆయనకంటె సాగర్‌కు యెక్కువ తెలుసా? నాకు ధైర్యాన్ని యివ్వడానికి కృత్రిమంగా మాట్లాడుతున్నాడు. అతని ప్రేమకూడా కృత్రిమమైందేనేమో! రేపు నా కాలు తొలగిస్తే శాశ్వతంగా కుంటిదాన్నయితే సాగర్ నన్ను ప్రేమించదేమో! నన్ను వొదిలివేసి, మరో యువతిని పెళ్ళిచేసుకుంటాడేమో! ఎట్లా? ఎట్లా? ఆ భావాన్ని భరించడం! ఆ భావాన్ని భరిస్తూ బ్రతకడమెట్లా?

"ఒకవేళ నా కాలు తొలగించడం తప్పనిసరియైతే!..." అన్నాను దుఃఖం పెల్లుబకగా.

సాగర్ మృదువుగా చిరునవ్వు నవ్వాడు.

"అదెన్నటికీ జరగదు. ఆ ఏడుకొండలవాడు నిన్ను రక్షిస్తాడు. కనీసం నా కోసమైనా!"

"రక్షించేవాడైతే—యిట్లా యెందుకు శిక్షిస్తాడు. నా విషయంలో ఆస్తిమితానికి తావులేదు. ఒకవేళ యేదైనా జరిగితే..." ఆ పైన యేం మాట్లాడలేక అతని హృదయంలో తల దూర్చాను నేను

"నీకు యేం జరిగినా నా హృదయాన్ని అడ్డువేస్తాను. నేను అహర్నిశమూ నీవాణ్ణే సరితా! నిన్ను తప్పకుండా నా జీవిత భాగస్వామినిగా చేసుకుంటాను. మన ప్రేమ అమరత్వసిద్ధి పొందినట్టిది దానికి వొడుదుడుకులూ, జరామరణాలు లేవు. అశరీరమైంది" అన్నాడు సాగర్ నా తల వెంట్రుకల్నీ, నుదురునూ, చెంపల్నీ, పెదవులనూ, కంఠాన్నీ మృదువుగా, మెత్తగా స్పృశిస్తూ.

"గాఢంగా విశ్వసించవచ్చా?" అన్నాను రాబోయే కీడును దృష్టిలో పెట్టుకొని.

"అనుమానమా?" అంటూ నన్ను హృదయానికి గాఢంగా హత్తుకున్నాడు. ఆ పరిష్వంగపు సుఖంలో కొన్ని క్షణాలపాటు నన్ను నేనే మర్చిపోయాను.

ఆ రాత్రి నా కంటిమీద కునుకులేదు బలిపీఠానికి గొనిపోబడుతూన్న బలిపశువు స్థితిలో ఉన్నాను. రేపు పెద్దహాస్పిటల్‌కు తీసికెళతారు. ఆపరేషన్ చేస్తారు. ఒక కాలు తీసివేస్తారు. శాశ్వతంగా కుంటిదాన్ని అవుతాను. స్విమ్మింగ్ చేయలేను. బాల్‌రూమ్ డ్యాన్సు చేయలేను. నడవలేను. ఏ పనీ చేయలేను. ఇంట్లోనే కుమిలిపోవాలి. కృశించిపోవాలి సినిమాలు చూడటానికి లేదు. పార్టీలకు వెళ్ళలేను నలుగురు స్నేహితుల మధ్య తిరగలేను. షాపింగ్‌కు వెళ్ళలేను. జీవితాంతమూ యింట్లో జైలు జీవితాన్ని అనుభవించడమెలా?

తొమ్మిది గంటలకు నాన్న వచ్చాడు నా గదిలోకి, నన్ను పరామర్శించేం దుకూ, తగిన ధైర్యాన్ని చెప్పేందుకూ. ఆయన వెంటే అమ్మగూడా వచ్చింది.

నేను మంచంమీద కూర్చుని శూన్యంలోకి గంభీరంగా చూస్తున్నాను.

మా నాన్న వెంటనే నోరు తెరిచి మాట్లాడలేకపోయాడు. కొన్ని క్షణాల పాటు నాకేసి దిగాలుపడి చూస్తూ కూర్చున్నాడు కుర్చీలో.

"క్రిందటి జన్మలో మనం యేంపాపం చేశామో, యీ జన్మలో యింత ఆస్తీ, డబ్బూ వున్నా కష్టాలు తప్పలేదు. అమ్మాయికి యీ ఆపద రావడ మేమిటి-కర్మ గాకపోతే!" అన్నది మా అమ్మ దుఃఖాన్ని దిగమ్రింగుతూ.

"ఇప్పుడేం చేస్తాం! డాక్టరుగారి మాటప్రకారం ఆపరేషను జరిగితీర వల్సిందే! సరూ! నువ్వేమీ అధైర్యపడకు. ఏం జరిగినా నీ బ్రతుకులో-సుఖానికీ ప్రశాంతతకూ, వెలుగుకీ నిన్ను అమితంగా ప్రేమించే నేనున్నాను. నేనున్నంత కాలమూ నీకు ఏ లోటూ రానివ్వను. రవ్వంత దిగులుపెట్టుకోకు. ఆత్మస్థైర్యమే అన్ని జబ్బులకూ మందు" అన్నాడు నాన్నగారు.

కాని ఆ మాటలు నన్నేమాత్రం వూరడిస్తాయి!

తెల్లవార్లూ నిద్రకు వెలియై, పిచ్చిపిచ్చిగా ఆలోచిస్తూనే ఉన్నాను—ఏమైతే అయిందని. ఇంకా కొంతసేపు భగవంతుణ్ణి ప్రార్థించాను—నా భవిష్యత్తును అంధకారం చేయవద్దని. ఆ రాత్రి ఎడతో సుదీర్ఘంగా తోచింది. ఆ రాత్రి తెల్ల వారకపోతే ఎంతో బావుణ్ణు అనుకున్నాను. కాని తెల్లవారకుండా వుంటుందా?

## 4

ఉదయిస్తోన్న సూర్యుడు నెత్తురుముద్దవలె ఉన్నాడు. ప్రకృతంతా యెర్రని దుస్తులు ధరించినట్లుంది. గార్డెన్‌లోంచి సువాసనా సంకలితమైన గాలి కులాసాగా వీస్తోంది. మానవుని కష్టసుఖాలతో ప్రకృతికి సంబంధంలేదు. దాని ధర్మాన్ని క్రమం తప్పకుండా పాలిస్తోనే వుంటుంది. మానవుడు దుఃఖంతో విలపిస్తూంటే-సూర్యుడు ఉదయించకుండా వుండడు; పువ్వులు వికసించకుండా వుండవు; గాలి వీచకుండా వుండదు. మానవుడు సంతోషంతో గంతులేస్తూన్నా ప్రకృతిలో మార్పు వుండదు. తమ చేష్టలకూ, సుఖాలకూ, దుఃఖాలకూ, ఆలోచనలకూ, ఆవేశాలకూ, ఆవేదనలకూ ప్రకృతివైపరీత్యాలను అన్వయించుకొని కొంత మంది సంతృప్తిపడుతుంటారు. నేను కిటికీ దగ్గర కుర్చీలో కూర్చుని ఆలో చించసాగాను. కొద్ది నిముషాల్లోనే హాస్పిటల్‌కు తరలివెళ్ళవల్సివుంది. క్రింద అమ్మా, నాన్నా ఆ ప్రయత్నాలలో మునిగివున్నారు.

డ్రైవరు చెవర్లెట్ కారును గారేజినుంచి బయటకు తీశాడు.

నా గుండెలో పలుచని చీకటి అలముకొంది.

అయిదునిముషాల్లో నాన్నగారూ, అమ్మా మేడపైకి వచ్చారు నన్ను తీసికెళ్ల డానికి.

"ధైర్యంగా, ఉత్సాహంగా వుండమ్మా! మేజర్ అపరేషనేమీ కాదు." అన్నాడు నాన్న భుజంమీద తడుతూ. నాకు ధైర్యాన్ని చెప్పడానికి ఆయన అబద్ధమాడుతున్నాడని సులభంగా గ్రహించాను. క్యాన్సర్ వ్యాధికి గురైన ఓ కాలును తీసివేయడం మేజర్ ఆపరేషను కాకపోతే మరేమిటి?

మా అమ్మ కంటతడి పెట్టుకుంది. ఆ ఏడుకొండలస్వామికి ఎన్నో మొక్కులు మొక్కుకుంది. ఇంకా తను ఆరాధిస్తూన్న దేవుళ్ళందరికీ పేరు పేరునా మొక్కుకుంది.

నేను బరువుగా నిట్టూర్పువిడిచి, క్రిందకెళ్ళి కారులో కూర్చున్నాను. ఇంద్ర భవనంలాంటి యింటినీ, భూతలస్వర్గంలాంటి గార్డెన్‌నూ ఒక్కసారి కలియ జూశాను. అమ్మా, నాన్నా ఎక్కి కూర్చున్నాక, కారు బయలుదేరింది.

మేం క్యాన్సర్ హాస్పటల్‌కు వెళ్ళగానే డాక్టర్ రామన్ ఎదురైనాడు.

"అరేంజిమెంట్సన్నీ రెడీ! మీకోసమే ఎదురుచూస్తున్నాం" అన్నా డాయన.

డాక్టర్ రామన్ మా నాన్నగారికి గత పదిహేనేళ్ళుగా స్నేహితుడు.

నన్ను సత్వరం ఆపరేషను థియేటరులోకి తీసికెళ్ళి, టేబుల్‌పైన పడుకో బెట్టారు. నర్సువొచ్చి ఇంజెక్షన్ ఇచ్చింది. ఇద్దరు నర్సులు ఆపరేషన్‌కు కావా ల్సిన పరికరాలన్నింటినీ టేబుల్‌దగ్గర అమరుస్తున్నారు. మరుగుతూన్న నీళ్ల ల్లోంచి బయటకు తీస్తూన్న తళతళ మెరిసే కత్తుల్ని చూసి మూర్ఛపోయినంత పనైంది నాకు. ఒక్క కాలును శస్త్రచికిత్స చేయడానికి అన్నిరకాలైన కత్తులు కావాలా?

ఆపరేషనుచేసే దుస్తుల్లో ఉన్న డాక్టర్ రామన్‌ను గుర్తించలేకపోయాను. నా పాలిట రాక్షసునివలె గోచరించాడాయన. మా అమ్మా నాన్నా థియేటర్ బయట కూర్చున్నారు.

లైట్లు వేశారు.

డాక్టర్ రామన్, అయన అసిస్టెంటూ, ముగ్గురు నర్సులూ, ఓ మేల్ నర్సూ —అంతా టేబుల్‌చుట్టూ చేరారు, కుక్కపిల్లన్ని ఓ జీవిని కబళించడానికి సిద్ధపడ్డట్టు.




—ఆ తర్వాతేమైందో నాకు తెలీదు.

మరుసటిరోజు ఉదయం నాకు స్పృహ వొచ్చింది. వొళ్ళంతా విపరీతమైన నొప్పులు. భరించలేకుండా ఉన్నాను. ఏడ్చాను. నా బెడ్ దగ్గర అమ్మా, నాన్నా కూర్చున్నారు.

అంత నొప్పుల్లోనూ బ్యాండేజులు వేసివున్న కాలును తడిమి చూసుకున్నాను. ఒక్క గావుకేక పెట్టాను. "నా కాలేదీ!"

మా నాన్నగారు ముఖాన్ని క్రిందికి దించుకున్నారు.

మా అమ్మ కళ్ళవెంట నీళ్ళు అకస్మాత్తుగా క్రిందికి జారాయి.

నేను కదలటానికి ప్రయత్నించాను. కాని నడుం క్రిందభాగమంతా, బ్యాండేజిల మధ్య నొప్పితో మండిపోతున్నట్టుంది. ఏదో అపాయం జరిగింది. నా బ్రతుకులో శాశ్వతంగా వైకల్యమేర్పడింది. నేనెందుకూ పనికిరాకుండా తయారు చేయబడ్డాను, అనుకుంటూ తలపైకెత్తేందుకు విశ్వప్రయత్నం చేశాను. కాని బరువైన బలహీనతతో వీలుపడలేదు.

మా నాన్నగారు నా మీదకువొంగి, "సరూ! కదలకు! కావాలంటే నర్సును పిలుస్తాను'' అన్నారు ఆయన గొంతు కొంచెంగా బొంగురుపోయింది—ఎంతో కాలంనుంచీ మనస్సులో కుమిలి కుమిలి ఏడుస్తూన్నట్టు.

దిగ్భ్రమచెందుతూ, అలానే మెల్లగా క్యాన్సర్ వ్యాధికి గురైన కాలును, గుడ్డలు దిట్టంగాకట్టి ఉన్నప్పటికీ తడిమిచూసుకున్నాను. ఎడంకాలు వున్నంత పొడవుగా లేదది. మోకాలిక్రిందంతా శూన్యజగత్తే! అంధమైన భయం నన్ను ఆవరించింది.

"నాన్నా! నా కాలేదీ! ఏమైంది!" అన్నాను దుఃఖోద్విగ్నతతో.

"కాలును తీసివేశారమ్మా! తప్పలేదు" అన్నాడు నాన్న జేబురుమాలుతో కళ్లు అద్దుకుంటూ.

మా అమ్మ భీకరంగా ఏడుస్తూ కుర్చీలో కూలబడింది.

ఓ నర్సువొచ్చి నా కుడిభుజంక్రింద ఓ సూదితో మందు శరీరంలోకి పంపించి వెళ్ళిపోయింది. నా బాధనూ, ఆవేదననూ, నా బ్రతుకులో అలుము కున్న చీకటినీ—ఈ యింజక్షన్లూ, మందులూ అంత మొందిస్తాయా? పిచ్చిభ్రమ కాకపోతే!

"నీ మోకాలిక్రింద లేచింది క్యాన్సర్ కురుపమ్మా. నీ జీవితాన్ని రక్షించడా నికి కాలు అంతవరకు తీసివేయాల్సి వచ్చింది. డాక్టర్‌గారు బాగా ఆలోచించే చేశారమ్మా! చూస్తూ చూస్తూ జీవితాన్ని నాశనం చేసికోడమెలా" అన్నారు నాన్నగారు.

పిచ్చి నవ్వు నవ్వుకున్నాను.

"అక్కడే పొరబాటు డాడీ! ఈ అవిటి బ్రతుకుతో జీవితాంతమూ కుళ్ళి కుమిలి కృశించేకంటె మరణమే అన్నివిధాలా మేలు. ఇహ నేను బ్రతికిమటుకు ప్రయోజనమేమిటి? ఏం సాధించగలను? జీవితంలో ఏ కోర్కెల్ని తీర్చుకో గలను? ఏం అనుభవాన్ని మిగుల్చుకోగలను? పద్దెనిమిదేళ్ళు నిండిన నా బ్రతుకు ముందంతా అంధకారమేగదా!" అన్నాను ఆవేశంగా.

"నిజమే తల్లీ! అయినా మనం చేసేదేముంది? భగవంతుడు మిగిల్చిన కాలం లోనే, జీవితంలోనే—బ్రతుకును సౌఖ్యవంతం చేసికోవడానికి ప్రయత్నించాలి. అంతకంటె గత్యంతరమేముంది? నీ బ్రతుకు నువ్వనుకుంటూన్నంత అంధ కారమయం కాదు. నేనూ, మీ అమ్మా ఉన్నంతకాలమూ—నీ సుఖంకంటె, నిన్ను సంతోషపర్చడంకంటె, నీ బ్రతుక్కి చీకూ చింతా లేకుండా గడవడం కంటె మాకు ముఖ్యమైందిలేదు. చింతించకమ్మా!" అన్నాడు నాన్నగారు వాత్సల్యపూరితమైన గంభీరతతో.

ఇహ నా బ్రతుకు అయినవాళ్ళ, కానివాళ్ళ, స్నేహితుల, శ్రేయోభిలాషుల ఓదార్పులతోనూ, సానుభూతి వాక్యాలతోనూ వెళ్లమారవల్సి వుంది. నడవ లేను. డ్యాన్సు చేయలేను. స్విమ్మింగే చేయలేను. ఇంకా బ్రతికిమటుకు లాభ మేముంది? వచ్చేనెలలో స్విమ్మింగ్ టోర్నమెంట్సు ఉన్నాయి. నేనెట్లా పాల్గొనగలను? ఆ టోర్నమెంట్సులో ఫస్టురావాలనీ, బంగారు పతకాన్ని గెల్చు

కోవాలనీ యెన్నో ఆశలు పెట్టుకున్నాను. ఇప్పుడవన్నీ నీటిమీద వ్రాత లయ్యాయి...

కాలేజీ బ్యూటీగా, సౌందర్యాధి దేవతగా నాకు గొప్ప పేరుండేది కాలేజీ లోనూ బయటనూ. ఇప్పుడికాలు లేకపోవడంతో ఆ అందమంతా అడవిగాచిన వెన్నెలే! మొహం ఎంత గొప్ప సౌందర్యంలో వెలిగిపోతూండేనూ, కళ్ళు యెంత మనోజ్ఞంగా మెరిసిపోతుండేనూ, జుత్తు యెంత ఆకర్షణీయంగా ఉండేనూ— ఏం లాభం? అవిటిదాన్ని. ఆ అంగవైకల్యమే నా సౌందర్యాన్నీ, నా సర్వ స్వాన్నీ హరించివేసింది. ఎందుకూ కొరగాని దానివలె తయారైనాను...

నా ఆనన సౌందర్యానికీ, నా శరీర లావణ్యానికీ అమితంగా మురిసిపోయే, 'స్విమ్మింగ్'లో నా ప్రావీణ్యానికి పొందిన ఖ్యాతికి గర్వపడే—సాగర్ ఇప్పుడే మంటాడు? "నువ్వు తప్ప నాకు లోకంలో మరో ప్రాణిలేదు సరితా! నిన్ను ఎంత గాఢంగా ప్రేమిస్తున్నానో చెప్పడానికి భాషచాలదు. జన్మజన్మలకి నువ్వే నా జీవితేశ్వరివి." అన్న సాగర్ ఇప్పుడు నన్ను స్వీకరించడానికి సిద్ధంగా ఉంటాడా?...ఏమో! ఈనాటి ప్రేమలకు ఆకర్షణశక్తి యిరుసులాంటిది. ఆ ఇరుసు బలంగా వున్నంతకాలమూ ప్రేమలూ, అభిమానాలూ రంగులరాట్నం వలె తిరుగుతూ వుంటాయి.ఆ ఇరుసు విరిగిపోతే, రాట్నం తిరిగేదిదు. ప్రేమలూ అభిమానాలూకూడా తమ చలనశక్తిని గోల్పోతాయి. ఈ రకపు భౌతిక ప్రేమాభిమానాలకు సాగర్ అతీతుడా?...భగవాన్! సాగర్ నన్ను అహర్ని శమూ పవిత్రంగా, నిర్మలంగా ప్రేమించేట్టు చేయి. అతనిలోనే నా యీ జన్మ ముడివడి వుంది. భగవంతుణ్ణి ప్రార్థించాను. ఇంతవరకెప్పుడూ జీవితంలో భగవంతుని ఉనికిని గురించే ఎప్పుడూ ఆలోచనరాలేదు.

ఆ రోజు మధ్యాహ్నం అమ్మ చెప్పింది. సాగర్ మూడుసార్లు ఫోన్‌చేశాడట నన్నుగురించి వాకబుచేస్తూ. ఇప్పుడు నా పరిస్థితి ఎట్లావున్నదని; తను వచ్చి చూడవచ్చునా అని.

నా గుండెలో పొరలు విచ్చుకున్నాయి. నే నీ స్థితిలో వుండగా సాగర్ నన్ను చూడటమా? అప్రతిభుడై పోడూ! అతని మొహంలోని మార్పుల్నిచూసి నేను భరించగలనా?

కాని సాగర్‌కు మొహం చూపెట్టకుండా వుండటమెలా? సాధ్యంకాదు.

డాక్టర్ రామన్ ఓరోజు ఉదయం చెప్పాడు నాన్నగారితో. "అమ్మాయిని బంధువులుగానీ, స్నేహితులుగానీ ఎవరైనా యిప్పుడు చూడవచ్చు కాని అదే

వనిగా ఆమెను మాటల్లో పెట్టి చీకాకుపర్చి, విశ్రాంతి లేకుండా చేయరాదు. ఆమె కింకా మరి కొన్నాళ్ళపాటు బాగా విశ్రాంతి కావాలి."

వెంటనే మా అమ్మతో చెప్పాను.

"అమ్మా! సాగర్‌కు ఫోన్‌చేసి ఈ సాయంత్రం ఒక్కట్టే రమ్మని చెప్పు."

## 5

ఆ సాయంత్రం యెంతో ప్రశాంతంగా ఉంది. కిటికీ దగ్గరే బెడ్‌పై కూర్చు న్నాను. అమ్మా, నాన్నా యిద్దరూ లేరు ఇంటికి వెళ్ళారు. ఓ అరగంటలో వాళ్ల రావొచ్చు.

అస్తమిస్తోన్న సూర్యుని అంతిమ కిరణాలు హాస్పటల్ గార్డెన్‌పై అందంగా పడుతూ ప్రకృతి శోభను యినుమడింపజేస్తున్నాయి. ప్రొద్దు తిరుగుడూ, ధాలియా, ఎరుపూ, తెలుపూ, పసుపుపచ్చా గులాబీలూ, మెట్టతామరా, మందార, మొదలైన పూలపై సంధ్యాకాంతి మనోహరంగా మెరుస్తోంది హాస్పటల్ ఆవరణ లోని నిద్రగన్నేరు చెట్లనుంచి చల్లనిగాలి కులాసాగా వీస్తోంది.

—దూరాన్నుంచి ఈ ప్రకృతి శోభను తిలకించవల్సిందేగానీ, ఆ ప్రకృతిలో ఆడుతూ పాడుతూ గంతులేస్తూ తిరిగి అనుభవించే యోగం నాకు లేదుగదూ, స్నేహితులతో క్లబ్బులకూ, షికార్లకూ, సినిమాలకూ తిరగటమంటే నాకు మహ చెడ్డ సరదా! కొత్త కొత్త వ్యక్తుల్ని పరిచయం చేసుకోవడం, కొత్త కొత్త ప్రదేశాల్ని సందర్శించడం, పిక్‌నిక్స్ ఏర్పాటుచేయడం, గ్రాంఫోనురికార్డుల సంగీతంతో, కులాసాయైన కబుర్లతో కాలక్షేపం చేయడం-ఆ రకమైన బ్రతుక్కి-ఇహ ఫుల్‌స్టాప్! కారును నడపలేను. ఎవరో కారు డ్రైవ్ చేస్తోంటే, అందులో నేను కూర్చోలేను. భగవాన్! నేనేం పాపం చేశాను? ఎందుకు నాకీశిక్ష విధించావు.

నర్సు ఏవో టేబ్‌లెట్స్ రెండు యిచ్చి, గ్లాసుతో నీళ్ళుతెచ్చి యిచ్చింది.

"ఎందుకు" అన్నాను. ఈ మందులతో రోజు రోజూ విసిగిపోతున్నాను. పూర్వజన్మలో చేసిన పాపాలకు హాస్పటల్ జీవితం ఓ రకమైన ప్రాయశ్చిత్తమే.

నర్సు దొరగా చిరునవ్వు నవ్వుతూ—"అదేటంమ్మగారూ! అట్లా గంటారు. ఆరోగ్యం కోసమేగా మందులు వాడేది. ఆపరేషన్‌తో తమరు బలాన్ని కోల్పో యారు. ఆ బలాన్ని పుంజుకోవాలంటే నిశ్యమూ టేబ్‌లెట్స్, టానిక్కులూ వాడాల్సిందే" అన్నది.

నాకు మహచెడ్డ చిరాకేసింది. చేతిలోని గ్లాసు నీళ్ళు ఆ నర్సు మొహాన విసిరిపోద్దామనుకున్నాను. కాని అది కేవలం అవివేకమని సత్వరం గ్రహించాను.



నాకు పట్టిన ఖర్మకు మరొకళ్ళపై కోపాన్ని ప్రదర్శిస్తే వారిగేదేముంది? గబు క్కున రెండు టేబ్‌లెట్స్ వేసుకొని, గ్లాసెడు మంచినీళ్ళు త్రాగాను.

తర్వాత అయిదునిముషాలకు ఇంకో నర్సు సాగర్‌ను వెంటబెట్టుకు వచ్చింది. అమెరికన్ బ్రైపు గ్రే సూట్‌లో అతను ముగ్ధమోహనంగా ఉన్నాడు.

నాలో దుఃఖం ఒక్కుమ్మడిగా కట్టలు త్రెంచుకుంది. కన్నీటి ప్రవాహం ఆగలేదు. మొహానికి రెండు చేతులూ అడ్డుగా పెట్టుకున్నాను సాగర్‌పై దృష్టి నిల్పి చూడలేక.

నా కోసం ప్రేమగా తెచ్చిన గులాబీపూలగుత్తిని టేబుల్‌పైపెట్టి నా దగ్గరకు వచ్చాడు సాగర్.

"సరితా! ఏమిటది? ఎందుకేడుస్తున్నావు! ఏమైంది? ఆపరేషన్ సక్సెస్ అయిందిగదా!"

నేనేం మాట్లాడలేదు.

నా బెడ్‌పై కూర్చుని, నన్ను దగ్గరకు తీసికొని, వొళ్ళంతా తడిమి చూశాడు. కుడికాలు సగంవరకే కట్టుకట్టి వుండటాన్ని చూశాడు.

నేను పసిపిల్లలా ఎక్కి ఎక్కి ఏడ్చాను.

"డోంట్ వర్రీ, డియర్! జరిగిన దానికి మనం చేసేదేముంది? దేవుడు కరుణిస్తాడని ఆశపడ్డాం. మనపట్ల నిర్దయ వహించాడు అయినా దుఃఖించకు సరితా? ఎప్పటికీ నేను నీవాణ్ణే! నీపట్ల నా ప్రేమాభిమానాల్లో రవ్వంత మార్పు జరగదు. నీ శరీర సౌందర్యాన్ని చూసికాదు నేను ప్రేమించింది. నీ ఆత్మసౌందర్యాన్నే నేను ఆరాధిస్తున్నాను. క్యాన్సర్ వల్ల నువ్వొక కాలును పోగొట్టుకున్నా, రెండు కాళ్ళూ వున్నట్టుగానే, నీ అందంలో మార్పేమీ లేనట్టుగానే భావించి ప్రేమిస్తాను డార్లింగ్!" అన్నాడు సాగర్ ప్రజ్వలమైన విశ్వాసంతో నిండిన చూపులతో.

అంత దుఃఖంలోనూ నా మనస్సుపై విశ్వాసపు పిల్లవాయువులు వీచినాయి. నిజంగా ఇంకా సాగర్ నన్ను ప్రేమిస్తున్నాడు. నన్నే పెళ్ళిజేసికుంటాడు. నా బ్రతుకు ఊహించినంత దుర్భరంకాదు. కాని...కాని...నేను సాగర్‌కు భార్యగా తగినదాన్నా? నన్ను యింకా ప్రేమించమనీ, పెళ్ళిచేసుకోమనీ, నా బ్రతుకును తేనెసోనగా చేయమనీ—నేనతన్ని అర్థించడం న్యాయమేనా? సాగర్ ముగ్ధ మనోహర సౌందర్యమూర్తి. చదువుకున్నవాడు. ఐశ్వర్యవంతుడు. స్విమ్మింగ్‌లో సమర్థుడు. కాలేజీలో ఫుట్‌బాల్ ఛాంపియన్. ఎంతో ఉజ్జ్వలమైన భవిష్యత్తున్నది. జీవితంలో సౌఖ్యాన్ని గురించి, ప్రశాంతతను గురించి, సాధించే విజయాలను గురించి ఎన్నో ఆశలున్నాయి. అట్లాంటి సాగర్‌ను కుంటిదాన్నియైన నేను పెళ్ళిజేసికోవడం సమంజసమేనా? అతని అభివృద్ధికి, సౌఖ్యానికీ, ఆదర్శాలకూ, ప్రశాంతంగా బ్రతకడానికీ, విజయాలకూ నేను అడ్డుగా రానూ...ఏమైనా భూత భవిష్యద్వర్తమానాల్లో అతనే నా ప్రేమికుడు. అతనే నా ప్రపంచం. అతను లేకుండా నేను బ్రతకలేను, ముమ్మాటికీ.

"నీ ప్రేమకు నేను అర్హురాల్ని కాదు సాగర్! నన్ను పెళ్ళిచేసికొని నువ్వు పొందే సుఖమేముంటుంది. ఈ అవిటిదాన్ని కట్టుకొని, జీవితాంతమూ నువ్వు అవిటి బ్రతుకునే బ్రతకాలి." అన్నాను అతని ప్రేమాభిమానాల గట్టిదనాన్ని పరీక్షించే ఉద్దేశంతో.

"సరితా! చాలా పొరబడుతున్నావు. నా మనస్సు చంచలంగాదు. నేను బాహ్య సౌందర్యోపాసకుణ్ణి కాదు. నేను గాఢంగా నిన్ను ప్రేమించాను. ఈ జన్మకు ఆ ప్రేమలో మార్పువుండదు. భగవంతుడు నీకు అన్యాయం చేసినా నేను చేయను. మనిద్దరమూ ఈ యేడాదే వివాహం చేసుకుందాం. మా నాన్న గారితో మాట్లాడతాను."

అక్కడే సాగర్ బలహీనత బయటపడినట్టుగా నాకు తోచి, నా గుండెలో

చిన్న అడుగుపడింది. నిర్మలమైన ప్రేమకు తల్లిదండ్రుల అనుమతి అక్కర్లేదు, సమాజంముద్ర వేయనవసరంలేదు.

"మీ నాన్నగారు ఒప్పుకోకపోతే," అన్నాను నేత్రాలు సాగదీస్తూ.

సాగర్ మొహంలో కలవరపాటును స్పష్టంగా గుర్తించాను. ఆ కలవరపాటు వెనుక ఏదో అంతరార్థం లేకపోలేదు.

"ఎందుకొప్పుకోరూ. తప్పకుండా ఒప్పుకుంటారు. నా ప్రేమను ఆయన గుర్తించి, పెళ్ళికి అనుమతిస్తారు" పిరికిగా అన్నాడు సాగర్.

"నిజంచెప్పు సాగర్. మొహమాటాని కిది సమయంకాదు. దుఃఖిస్తోన్న ఓ హృదయాన్ని ఓదార్చటానికి నువ్వు అబద్ధాలాడనవసరంలేదు. నువ్వు కాదన్నా నేను బాధపడను. విధి యింతకంటె నా బ్రతుకును నరకం చేయలేదు" అన్నాను సీరియస్‌గా.

సాగర్ నా మొహంకేసి కొన్ని క్షణాలపాటు దిగాలుగా అయోమయంగా, నిర్లిప్తంగా చూశాడు. అతని మనోభావాల్ని సూక్ష్మంగా గ్రహించలేకపోయాను. నాకు సమాధానం చెప్పడానికి అతను రెండు నిముషాలకాలాన్ని తీసుకున్నాడు.

"నా మనస్సులో ఉన్నదంతా అరచేయిచాచి చెప్పాను. నా మాటలపై నీకు విశ్వాసం కలగలేదంటే—ఇంకా నిన్నెట్లా నమ్మించాలో నా కర్థంగావడంలేదు. నా ప్రేమపై నీకు విశ్వాసం చిక్కకపోవడం నా దురదృష్టం. మన వివాహానికి మా తల్లిదండ్రులు ఒప్పుకోకపోయినా, వాళ్ళ నెదిరించి, నిన్ను పెళ్ళాడతాను. ఇదే వాగ్దానం చేస్తున్నాను" అంటూ నా చేయిని తీసికొని తన చేతిలో పెట్టుకున్నాడు సాగర్.

ఆనందంతో నా హృదయం ఉక్కిరి బిక్కిరైంది. నా శరీరంలోని ప్రతి అణువూ సంతోషంతో రెండింతలైంది. గాఢంధకారమైన భవిష్యత్తులో, జీవితంతో కొట్టుమిట్టుకులాడే నాకు ఆ వాగ్దానంకంటె కావాల్సిందేముంది? నా కళ్ళల్లో ఆనందబాష్పాలు కదులాడినై. అమాంతంగా అతని కోటులో తలదాచుకున్నాను.

"సాగర్! నిజంగా నువ్వు నా పాలిట దేవుడివి. నిన్ను ఆవేశంలో అపార్థం చేసుకున్నందుకు నన్ను క్షమించు. నీ మనస్సు నాకు తెలుసు. అది కల్మషం లేనిది. నీ హృదయం నాకు తెలుసు. అది దయార్ద్రమైనది. నీ ఆత్మ నాకు తెలుసు. అది పవిత్రమైనది" అన్నాను సంతోషాధిక్యతతో.

సూర్యుడు సాంతం క్రిందికి దిగిపోయాడు. చంద్రుడు కన్ను తెరువగా మునిమాపు పలుచనైపోయింది.

హాస్పటల్ గార్డెన్ సుమనోహరంగా వుంది—సువాసనల్ని రోగుల దస్సిన మనస్సుల్లోకి రవాణా చేస్తూ.

మా నాన్నగారూ, అమ్మా వొచ్చారు కారులో. అప్పటికే సాగర్ వెళ్ళాడు.

నేను సంతోషంగా, ఉషారుగా, వెండికొండపై వెన్నెలపడి మెరుస్తోన్నట్టుగా వుండటాన్నిచూసి మా అమ్మా, నాన్నా ఆశ్చర్యచకితులైనారు.

"ఏమిటి విశేషం సరూ!" అన్నారు నాన్నగారు.

ముసి ముసి నవ్వులు నా పెదవులపై మెత్తగా దొర్లాడాయి.

ఆ నవ్వుల వెనుక రహస్యాన్ని మా అమ్మ గ్రహించినట్లుంది, నాకేసి క్రింది పెదవి విరిచి ఓరగా చూసింది.

ఏమైనా నా మొహంలో వెన్నెల వెలుగులాంటి సంతోషాన్నిచూసి మా నాన్నగారు సంతృప్తిపడ్డారు.

## 6

హాస్పటల్లో ఉన్నంతకాలమూ రోజూ ఎవ్వరో ఒకళ్ళు స్నేహితులుగానీ, బంధువులగానీ, శ్రేయోభిలాషులుగానీ, నాన్నగారికి తెలిసిన వాళ్ళుగానీ విరివిగా వచ్చి, నన్ను చూసిపోతూనే ఉన్నారు. రమారమి నాకు ఆలోచించుకోవడానికి తీరిక చిక్కడంలేదు। నన్ను చూడడానికి ఆపేక్షగా వచ్చేవాళ్ళతో అంతో యింతో మాట్లాడకుండా ఎట్లావుండను? మా అమ్మ పోరుపెడుతూనే వుండేది "దానికి తగిన విశ్రాంతి కావాలి. అట్టే మాట్లాడించరాదు. డాక్టరుగారు కూడా అదే చెప్పారు.'' కాని ఆవిడ మాటలను యెవరు పట్టించుకుంటారు? ఒక్కొక్కసారి ఈ వచ్చేపోయే జనంతో తగని చిరాకు వేసేది—వాళ్ళు వేసే యక్ష ప్రశ్నలకు సమాధానాలు చెప్పలేకనూ, వాళ్ళు కనబర్చే సానుభూతిని భరించ లేకనూ. 'అయ్యో! పాపం! బంగారు బొమ్మలాంటి పిల్ల. ముద్దు ముచ్చట్లేమీ తీరకమునుపే భగవంతుడే రాత రాశాడు.' 'ఎన్నో ఈతపందాల్లో బహుమతులు గెల్చుకుంది. ఎంతో గొప్పపేరును గడించుకుంది. భగవంతుడు ఓర్వలేకపోయాడు.' 'ఆడదానికి అవిటి బ్రతుకుకంటే జన్మలో ఘోర నరకముండదు అట్లాంటి వాక్యాలు నా గుండెల్లో గునపాలవలె గుచ్చుకొనేవి.

హాస్పటల్లో దాదాపు మూడువారాలపాటు ముళ్ళపై బ్రతుకును దొర్లించాక



– ఓ రోజు సాయంకాలం డాక్టర్ రామన్ అన్నాడు. 'సరితా! రేపు ఉదయం నిన్ను మీ ఇంటికి పంపిస్తున్నాను.'

నేను రెండుచేతులూ ఎత్తి మనస్సులో ఆయనగారికి నమస్కారం చేశాను.

"మీకు ఎంతో ఋణపడి ఉన్నాను డాక్టరుగారూ!"

డాక్టర్ రామన్ విషాదంగా ఆమెకేసి చూశాడు.

"మా ధర్మాన్ని మేము సక్రమంగా నిర్వర్తించడంవరకే మా ఉద్యోగాలకు న్యాయాన్ని చేకూర్చుతాము. నీ బ్రతుక్కంటే నీ ప్రాణాన్ని మేము దృష్టిలో పెట్టుకుని–జీవితాంతమూ అవిటి బ్రతుకును బ్రతుకమని శాసించవల్సి వొచ్చిందమ్మా! ఒక్కొక్కసారి డాక్టర్ల కర్తవ్యం చాలా కఠినంగా కర్కశంగా, కరుణారహితంగా వుంటుంది. అయినప్పటికీ రోగి శ్రేయస్సు దృష్ట్యా ఆ కర్తవ్యాన్ని పాలించక తప్పదు. మూడేళ్ళక్రితం ఓ కేసువచ్చింది. ఈ హాస్పటల్ లోనే అడ్మిట్ చేశాం. అతనికి పాతిక సంవత్సరాలకంటె వుండవు. ఇంజనీరింగ్ ఫైనల్ యియర్ చదువుతున్నాడు. బాగా డబ్బుకూడా వున్న కుటుంబంలోనివాడే. అతనికి మోచేయిక్రింద యెముకలో క్యాన్సర్ వొచ్చింది. నేను యెక్స్‌రే తీయించి, డయాగ్నస్‌చేసి, క్యాన్సర్ అని తేల్చాను. వెంటనే ఆపరేషనుచేసి, చేయి అంతవరకు తీసివేయాలి. లేదా ప్రాణానికి ఆపద వొస్తుందని గట్టిగాచెప్పాను.

ఆ పిల్లవాని తండ్రి నన్ను బ్రతిమలాడాడు; ఓ రెండు నెలలు ఆపరేషన్ ఆపుచేయించ వల్సిందనీ; ఎవరైనావచ్చి అడిగితే – ఇది క్యాన్సర్ కాదని చెప్పవల్సిందనీ. నేను ఆశ్చర్యపోయాను. విషయమేమిటన్నాను. ఆయన చెప్పుకొచ్చాడు. వాళ్ళబ్బాయికి పెళ్ళి కుదిరిందట. కట్నం రెండు లక్షల రూపాయలట. పెళ్ళికిముందు యీ వార్త వాళ్ళకు తెలిస్తే

పెళ్ళి తప్పిపోతుందట. అందుచేత వొక అబద్ధమాడి పెళ్ళి నిరాటంకంగా జరి పించాలట. నాకు పదివేల రూపాయలు లంచంకూడా యిస్తానన్నాడు. నేను వొప్పుకోలేదు? "మీ అబ్బాయి క్షేమాన్ని కోరితే, అతను బ్రతకాలని మీకుంటే వెంటనే ఆపరేషను చేయించండి" అని గట్టిగా చెప్పాను. ఆ తండ్రి రెండు రోజులు తటపటాయించి, మూడోరోజు కుర్రవాణ్ణి హాస్పిటల్‌నుంచి తీసి కెళ్ళాడు. ఆ రోజే అతనికి పిల్లనిచ్చే మామగారు నా దగ్గరకొచ్చి-కుర్రవాని జబ్బును గురించి వాకబుచేశాడు. నేను ఉన్నదున్నట్టు నిర్మొహమాటంగా చెప్పాను. వాళ్లు నాకు చేతులెత్తి దణ్ణంపెట్టి వెళ్ళిపోయారు. ఆ పెళ్ళి చెడిపోయి నట్లుంది. రెండురోజుల తర్వాత ఆ కుర్రవాడు మళ్ళీ హాస్పిటల్లో చేరాడు. వాళ్ళ తండ్రి నా దగ్గరకొచ్చి చెంపలు వేసికొని, క్షమించమని వేడుకొని, "మా వాడికి వెంటనే ఆపరేషను చేయండి సార్. బుద్ధి గడ్డితిన్నది" అన్నాడు. నేను నవ్వుకొని, ఆ కుర్రవానికి ఆపరేషను చేశాను. విచిత్రమేమిటంటే—తర్వాత ఆరు మాసాలకు ఆ యువకుడు ఆ పిల్లనే పెళ్ళిచేసికున్నాడు. ఆ పిల్లే పట్టుదల వహించి. 'ఆ కుర్రవాణ్ని తప్ప జన్మలో మరో యువకుణ్ణి పెళ్ళిచేసికోను' అని తండ్రి దగ్గర శపథంపట్టి, వివాహమాడిందట. అతను పరీక్ష ప్యాసైనాడు. ఇప్పుడు నాగార్జునసాగర్ ప్రాజెక్టులో జూనియర్ ఇంజనీరు చేస్తున్నాడు. వాళ్ళకో అబ్బాయి కలిగాడు. ఆ దంపతులు చాల అన్యోన్యంగా జీవిస్తున్నారు. ఆ మధ్య నా దగ్గరకొచ్చి, కనబడి వెళ్ళాడు. నేనెంతో ఆనందించాను. ఒకచేయి లేకపోయినా ఆ యువకుడు జీవితాన్ని గురించీ, భవిష్యత్తును గురించీ నిరాశ పడి నిస్పృహ చెందలేదు. అకుంఠితమైన ఆత్మవిశ్వాసంతో చదివి, ఉద్యోగం సంపాదించాడు. పెద్దలు నిర్ణయించిన వరుణ్ణి యీ జన్మకు భర్తగా యెంచుకొని, విధి కల్పించిన వైకల్యానికి తండ్రి యెదురుతిరగ్గా, పోరాడి, ఆయన్ను వొప్పించి, ఆమె అతన్ని పెళ్ళిజేసికుంది. ఆమె ఆదర్శబుద్ధిని కొనియాడాలి. ఇంతకూ చెప్పవచ్చిందేమిటంటే - ఆకస్మాత్తుగా అంగవైకల్య మేర్పడినప్ప టికీ, బ్రతుకు నాశనమైందని బాధపడటం తప్పు. సంకల్పబలంతో, మనో ధైర్యంతో ముందుకు సాగితే—బ్రతుకు బాట సుగమం కాక తప్పదు. ఇంత కంటె నేను నీకిచ్చే సలహా మరొకటి లేదమ్మా!"

డాక్టరుగారి సలహా నాకు కారుచీకటిలో కాంతిరేఖవలె తోచింది. మొండి ధైర్యంతో ఎట్లాంటి పరిస్థితులనైనా ఎదుర్కొని జీవించేవాళ్ళకు జీవితం ఎంతైనా వుంది. లోకంలో కుంటివాళ్ళూ, గ్రుడ్డివాళ్ళూ, చెవిటివాళ్ళూ, కుష్ఠురోగులూ

దీర్ఘవ్యాధిగ్రస్తులూ—ఎంతమంది బ్రతకటంలేదు. వాళ్ళ బ్రతుకులు బండ రాళ్ళు గాదు వాళ్ళ జీవితాలు అడుగున రాలిపోయే పొరలుగాదు. డబ్బు పుష్కలంగా వున్నప్పుడు, ఆత్మవిశ్వాసం మెండుగా గలిగినప్పుడు, భవిష్యత్తును భగవంతుని చేతుల్లోకి వొదిలినప్పుడు - ఎట్లాంటి అంగవైకల్యం వ్యక్తియైనా జీవితాన్ని సాఫీగా చేసికొనేందుకు ప్రయత్నించవచ్చు. విజయాన్ని పొందవచ్చు. సాగర్ గట్టిగా వాగ్దానం చేశాక - ఇంక నాకు బ్రతుకుపై భయం దేనికి?

మరునాడు ఉదయం అంబ్యులెన్సు కారులో నన్ను యింటికి తీసికొచ్చారు. అటెండర్లు నన్ను జాగ్రత్తగా పట్టుకొని మేడపైకి నా గదిలోకి తీసికెళ్ళారు. నా గదిని యెంతో పరిశుభ్రంగా, అందంగా తయారు చేయించారు నాన్నగారు గోడలకు రంగులు వేయించాడు కొత్తగా. టేబుల్‌పైన దేశంలోవున్న అన్ని రకాల మ్యాగజీన్లను తెచ్చిపెట్టాడు. కొత్త ట్రాన్సిస్టర్ రేడియో, స్నేహితుల వస్తే మాట్లాడటానికి దగ్గర్లో ఓ కొత్త సోఫాసెట్టు. నా దగ్గర ప్రత్యేకంగా ఓ నర్సు, ఓ పనిమనిషీ. నేను కూర్చుని కులాసాగా చదువుకోవటానికీ, వ్రాసికోవటానికీ ఒక చిన్న టేబుల్. చెస్, పిన్‌బోర్డు, ప్లేయింగ్ కార్డ్సు మొదలైన ఇండోర్ గేమ్స్ ఆడుకోవటానికి అవసరమైన సరంజామా. ఎవరితోనైనా మాట్లాడటానికి ఫోనూ.

"నీ గది వుండటానికి బాల సౌఖ్యవంతంగానూ, ఆకర్షణీయంగానూ తయారుచేశాం. మేడపైన నువ్వు వుండే బావుంటుందని అనుకున్నాం. ఎందుకంటే మాటిమాటికి వచ్చేపోయే జనం నీకేసి చూడటమూ, నిన్ను గురించి వాకబుచేయడమూ — ఈ న్యూసెన్సు వుండదు. నువ్వు ప్రశాంతంగా వుండొచ్చు. నీకు దగ్గిర స్నేహితుల్నే పైకి రప్పించుకోవచ్చు. పైపెచ్చు మేడపైన వుండి చుట్టూ ప్రపంచాన్ని వీక్షిస్తూ వుండవచ్చు" అన్నది మా అమ్మ.

కాని మా అమ్మ అభిప్రాయం నాకు నచ్చలేదు. నన్ను యెవ్వరికీ కనపడనీయకుండా రహస్యంగా వుంచాలని ఆవిడ తలంపు. ఆవిడకు నేనొక్కతెనే కూతుర్నయినప్పటికీ మొదట్నుంచీ నాపై ఆవిడకు మంచి అభిప్రాయంలేదు. మాతృత్వపు విలువలూ, ప్రేమాభిమానాలూ, వాత్సల్యమూ, ఆప్యాయతా వున్నప్పటికీ—నన్ను దగ్గరగా హృదయానికి చేర్చుకోలేకపోయింది. చిన్నతనం నుంచీ నా ఆటలూ, పాటలూ వేషభాషలూ, పోకడలూ ఆవిడకు నచ్చలేదు. ఎప్పుడూ విమర్శిస్తూనే వుండేది. 'స్విమ్మింగ్'లో నేను సాధించిన విజయాలకూ,

తెచ్చుకున్న బహుమతులకూ అట్టే సంతోషించేదికాదు; గర్వపడేదికాదు ఉదా సీనత, తూష్ణీభావాన్ని కనబర్చేది. ఇప్పుడీ అవిటి బ్రతుకును నాకుగా నేను తెచ్చిపెట్టుకున్నదనే ఆవిడ ఉద్దేశ్యం. మగపిల్లవాడిలా జామచెట్టు ఎక్కడం దేనికి, పడింతర్వాత ఏడ్వడం దేనికి? అది క్యాన్సర్‌కి దారితీయగా బ్రతుకంతా దుఃఖమయమేగదా! అంటూ వుంటుంది. ఇప్పుడు నాపై ఆవిడ శ్రద్ధ తగ్గింది. నా ఖర్మకు నన్ను వొదిలేసినట్టుగా వుంది. మేడపైకి యెక్కువ రావడంలేదు. నాకు పరిచర్యలు చేయడానికి యిద్దర్ని నియమించింది. వాళ్ళే నా బాగోగులు చూస్తారనుకుంటోంది.

## 7

రోజులు బరువుగా, నిస్సారంగా దొర్లిపోతున్నాయి. జీవితం కార్యక్రమం ప్రకారం గడిచిపోతూన్నది. ఉదయం లేవడంతోనే నర్సూ, పనిమనిషీ ప్రత్యక్షం. వాళ్ళ మొహాలు చూడటంలోనే తెల్లవారుతుంది. ఆ తర్వాతే సూర్య భగవానుని దర్శించడం. మొహం కడుక్కోవటానికి బేసిన్‌తో సీళ్ళు, బ్రష్, పేస్టూ, టంగ్‌క్లీనర్ పెడతారు. మొహం కడుక్కోగానే టర్కీటవల్ అంది స్తారు. తర్వాత టిఫిన్, కాఫీ. కాలకృత్యాల పిమ్మట ఆనాటి దినపత్రికల్ని యిస్తారు. ఓ గంటసేపు వాటితో కాలక్షేపం పన్నెండు గంటలకు భోజనం నాలుగు గంటలకు మళ్ళీ టిఫిన్, కాఫీ. రాత్రికి భోజనమూ, నిద్రా. ఈ లోపల యెవరైనా వస్తే మాట్లాడటం. లేనప్పుడు కిటికీలోంచి బయటికి చూస్తూ ఆలో చించుకోవడం. ఆ ఆలోచనలకు మొదలూ చివరా వుండవు. స్వేచ్ఛగా, మన స్సుకు ఆహ్లాదం కలిగేట్లు ఆలోచించుకోవడమే. మరీ తోచకపోతే పుస్తకాలూ, నవలలూ, కథలూ చదువుకోవడం. ఇదే నా నిత్య కార్యక్రమం. ఈ కార్య క్రమంలో నా బ్రతుకు గానుగెద్దులాగ నడుస్తోంది. ఒక ఉత్సాహం, కులాసా. సంఘటనా, అనుభవమూ – యివేమీ లేవు. ఎంతకాలం అట్లా బ్రతకడం?

నేను యింటికి వచ్చాక సాగర్ రాలేదు. మూడు రోజులు వరుసాగ్గా ఫోను చేయగా 'బెంగుళూరు వెళ్ళినాడనీ, యెప్పుడొచ్చేదీ తెలియదనీ సమాధానం వొచ్చింది. ఎందుకెళ్ళాడు బెంగుళూరు? ఏం పనిమీద వెళ్ళాడు? వెళతానని నాతో చెప్పలేదే! వాళ్ళ నాన్నగారితోపాటు వెళ్ళాడట. ఏదైనా పెళ్ళిసంబంధం చూడటానికి కాదుగదా!...ఛీ.ఛీ. ఒకటే పిచ్చి ఆలోచనలూ, అనుమానాలూ. మనిషిలో ఏదో లోపం, బలహీనతా వున్నప్పుడే మనస్సు పల్చనై, అనుమా నాలూ, కుశంకలూ తలెత్తుతాయి కామోసు! కుంటిదాన్ని కావడంతో నా మనస్సు



దుర్బలమైంది. లేనిపోని ఆలోచనలు విచ్చలవిడిగా సంచరిస్తున్నాయి. వాటిని అదుపులో పెట్టుకొనే శక్తి, బలమూ నాకు లేవు. ఏంచేసేది? రోజంతా యేవో ఆలోచనలు నన్ను తినివేస్తూనే వుంటాయి. ఒక కాలు తీసివేయడంతో క్యాన్సర్ పోయిందని అందరూ అనుకుంటున్నారు. డాక్టర్ రామన్ కూడా అల్లానే భావిస్తున్నాడు. కాని యెట్లా చెప్పడం? నా దురదృష్టం యింతటితో ఆగిపోయినట్లేనా? ఇంకా క్యాన్సర్ వ్యాధి లక్షణాలు నాలో వుండి, మిగతా శరీర భాగాలకు ప్రాకితే-అప్పుడేం చేయాలి? ఏ భాగానికి క్యాన్సర్ ప్రాకితే ఆ భాగం ఆపరేషన్ చేసి తీసివేస్తారా? అప్పుడు నా మొండెమే మిగులుతుంది.

దురాలోచనలు మాని ధైర్యంగా, దృఢంగా, నిర్విచారంగా వుండాలని అప్పుడప్పుడూ తీవ్రంగా అనుకుంటూ వుంటాను. నా స్నేహితుల ఎదుట సంతోషంగా వున్నట్టే, ఈ అవిటి బ్రతుకు అలవాటుపడినట్లే, అందులోనే జీవిత సౌఖ్యాన్ని పొందేందుకు ప్రయత్నిస్తూన్నట్టు కనపడుతూంటాను. కానిఏకాంతంగా వున్నప్పుడు - పిరికి ఆలోచనలతో నన్ను నేనే హింసించుకుంటూ వుంటాను.

ఓ రోజు మధ్యాహ్నం నా క్లాస్‌మేట్ సరళ వొచ్చింది. ఆమెవెంట మరి కొందరు విద్యార్థినులుకూడా ఉన్నారు వాళ్లూ నా క్లాసులోనివాళ్ళే. నా స్థితికి వాళ్ల ముందుగా విచారాన్ని, సానుభూతినీ వ్యక్తపర్చారు.

పనిమనిషి వాళ్లకి కూల్‌డ్రింక్స్ తెచ్చియిచ్చింది.

"ఈ సంవత్సరంకూడా నువ్వు స్విమ్మింగ్ టోర్నమెంట్సులో ఫస్టున వొచ్చి కాలేజీకి గొప్పపేరును తీసికొస్తావని మేమంతా ఆశించాం. కాని విధి చిన్నచూపు చూసింది" అన్నది సరళ చేతిరుమాలుతో కళ్ళు అద్దుకుంటూ.

"నువ్వు కాలేజీ మానేశాక, మాకు కూడా ఏమిటో 'యిది'గా వుంది. కాలేజీ అంతా బావురుమంటోంది" అన్నది నిర్మల మొహం చిన్నపుచ్చుకొని.

"ఎంత ఉషారుగా, కులాసాగా వుండేదానివి. నీ క్లాస్‌మేట్స్ కావడం మాకు గర్వకారణంగా వుండేది" అన్నది ఉషారాణి కనుబొమలు ఎత్తుతూ.

నేను ఆలకించి వూరుకున్నాను

కొన్ని క్షణాలు నిశ్శబ్దంలో గడిచాయి.

సరళ హాండ్‌బ్యాగ్ తెరిచి తన పెండ్లి శుభలేఖ యిచ్చింది. శుభలేఖ చూశాను. వరుడు మెడిసిన్ ప్యాసైనాడు. అందమైనవాడట. బోలెడు ఆస్తి వున్నదట. సరళ అదృష్టవంతురాలని అన్నది నిర్మల.

నా మనస్సులో అసూయ బాకులా పొడుచుకొచ్చింది మా కాలేజీ మొత్తానికి సరళ అందవిహీనురాలు. పొగమారిన తలుపుచెక్క మొహం. దానికి తగ్గట్టు పత్తికాయల్లాంటి కళ్ల, ఎలుకతోకలాంటి జడ, కొండ అంచులా ముందుకొచ్చిన నుదురు, కాకి రంగును జ్ఞాపకానికి తెచ్చే శరీరపు రంగు. అసలాపిల్లకు జీవితంలో పెళ్ళి జరుగుతుందా? సాహసించి ఏ మొగాడు ఆమెను పెళ్ళాడేందుకు ముందుకు వస్తాడు? అనుకొనే వాళ్ళం మేం. ఎప్పుడూ ఎగతాళి పట్టిస్తూండే వాళ్లం. అట్లాంటి కురూపీ, అనాకారీ, అసహ్యమైన రూపురేఖలుగల సరళ క్కూడా అలిదమైన యువకునితో ఆస్తీ, చదువూ గలవానితో వివాహం జరగబోతుంది! నిజంగా సరళ యెంత అదృష్టవంతురాలు! కొంతమంది మొహాన భగవంతుడు అదృష్టపు రేఖల్ని అంత స్పష్టంగా లిఖిస్తాడన్నమాట!

"నన్ను క్షమించు సరళా! నిన్ను కాలేజీలో ఎప్పుడూ ఎగతాళిచేసేదాన్ని —నా అందం చూసికొనీ, అహంకారంతో. భగవంతుడు తగిన శాస్తి చేశాడు" అన్నాను దిగులు కమ్ముకున్న మొహకతో.

"అదేమిటి సరితా! నువొక్కదాని వేమిటి! నన్ను కాలేజీలో అందరూ హాస్యంపట్టించేవాళ్ళుగదూ! అయినా నేను బాధపడేదాన్ని గాదు. భగవంతుడు అందరికీ ఒకరకమైన రూపురేఖల్ని ప్రసాదిస్తాడా? మానవుల అందం, ఆకర్షణా

నీటిబుడగల్లాంటివి, ఏ క్షణంలో అవి క్షీణిస్తాయో చెప్పలేము" అన్నది సరళ సౌమ్యంగా.

తర్వాత పదినిముషాలు పిచ్చాపాటీ కబుర్లు చెప్పుకున్నాక వాళ్ళు వెళ్ళిపోయారు.

సరళ పెళ్ళి శుభలేఖను చేత్తోపట్టుకుని చాలాసేపు ఆలోచించాను. నా పెళ్ళి శుభలేఖ ఎప్పుడో! సాగర్‌తో వివాహం జరిగితేనే తప్ప బ్రతుక్కు ఓ పట్టు చిక్కదు. భగవంతుడు విధించిన ఈ శిక్షనుంచి ఓ విధంగా విముక్తిలభిస్తుంది. భగవాన్! కనీసం ఈ మేలునైనా నీ నుంచి ఆశించవచ్చా! చేతులు జోడించి, మనస్సును కేంద్రీకరించి, ఆత్మపరంగా ప్రార్థించాను, సాగర్‌తో నా వివాహం జరిపించమని. ఆ శుభదినంకోసమే కళ్ళల్లో ఆశాజ్యోతుల్ని వెలిగించుకొని, విశ్వాసమనే చమురుపోస్తూ నిరీక్షిస్తున్నాను. ఆ నిరీక్షణ ఫలిస్తేనే గానీ నా బ్రతుకు పుష్పించదు. నా జీవితపు ఎడారిలో వర్షం కురవదు.

ఓరోజు డాక్టర్ రామన్ నన్ను చూసి పోవడానికి వచ్చాడు. అప్పుడు నేను వారపత్రికల్లో సినిమా బొమ్మలు చూస్తున్నాను. కొత్త కొత్త సినిమాలు వస్తున్నాయి పోతున్నాయి కాని నేను చూడడంలేదు. ఎట్లా సినిమాలకు వెళ్లడం? కారులో నలుగురు మనుషులు తీసికెళ్ళి, హాల్లో కూర్చోబెట్టాలి. ఎంత శ్రమ? నలుగురూ నవ్విపోరూ! 'ఈ కుంటిదానికి సినిమా కావాల్సివచ్చిందా?' అని ఎగతాళి చేయరూ! అక్కడికీ ఓ రోజు మా నాన్నగారు అన్నారు: 'సరితా! నా ఫ్రెండుది ఓ సినిమాహాలున్నది. అందులో నువ్వు ఏ ఇబ్బందీ పడకుండా కులాసాగా సినిమా చూడవచ్చు. తీసికెళ్ళేదా?' ప్చ్. ఎందుకో నా మనస్సు పీకింది. అంగీకరించలేదు. లోకంకోసమైనా కొన్ని కొన్ని కోర్కెల్ని అణుచుకోవాల్సి వుంటుంది. మా నాన్నగారిపై యెంతో జాలివేసింది. నన్ను సంతోషపెట్టడానికీ ఏలోటూ రానివ్వకుండా చూడటానికి, సాధ్యమైనంతవరకు సరదాలన్నీ తీరడానికి—ఆయన పడుతూన్న తాపత్రయం అంతా ఇంతా కాదు. కాని మొండిచేతివాడు శెనగలు తీసుకు తినగలడా?

డాక్టర్ రామన్ నన్ను పరీక్షించి, సున్నితంగా చీవాట్లుపెట్టాడు.

"సరితా! మరీ మూర్ఖంగా ప్రవర్తిస్తున్నావు. చూడు! ఎంతగా చిక్కిపోయినావో! మందులు సరిగ్గా పుచ్చుకుంటున్నావా, లేదా, జీవితాన్ని గురించి మరీ అంతగా నిరాశపడితే యెట్లా? ఏదోవిధంగా జీవితంపట్ల ఆసక్తి పెంచుకొని, సంతోషంగా జీవించటానికి కృషిచేయాలి. నీడబారిన మొక్కలాగ నీలుక్కు

పోతే లాభమేమిటి? వేళకు మందులుపుచ్చుకొని, బలమైన ఆహారాన్ని తీసి కుంటూ, జీవితంపట్ల ఆసక్తిని వృద్ధిచేసికో."

"జీవితంపట్ల ఆసక్తా? నాకు మిగిలిన జీవితం ఎట్లాంటిది? ఆ జీవితంపట్ల ఎవరైనా ఎట్లా ఆసక్తిని పెంచుకోగలరు? నేను చనిపోయివుంటేనే బావుండేది. ఇప్పుడు బ్రతికి నేను చేసేదేముంది? సాధించేదేముంది? నాబోటి యెందుకూ పనికిరానిదాన్ని యెవ్వరు పెళ్ళిచేసికుంటారు? పెళ్ళికాని స్త్రీ జీవితానికి సంఘంలో విలువేముంటుంది?" అనుకున్నాను రోషంతో జేవురించిన మొహంతో.

"పొరబడుతున్నావు సరితా! నువ్వు చాల చిన్నదానవు. తెలివైన దానవు. జీవించటానికి ఎంతో జీవితముంది ధైర్యంతో, విశ్వాసంతో నీకు నీవే కొత్త జీవితాన్ని కల్పించుకోవచ్చు. నీకు పెళ్ళికాదనే భయమక్కర్లేదు. ఆ రోజు రాగానే ఎవ్వరూ అడ్డుపెట్టరు. కుంటివాళ్ళకూ, గుడ్డివాళ్లకూ ఎంతోమందికి పెళ్ళిళ్లుకావడం నేను చూశాను. అందులో నువ్వు లక్ష్మీపుత్రికవు. అందమూ, చదువూ, విజ్ఞానమూ ఉన్నాయి. ఏ యువకుడైనా ముందుకు వస్తాడు. నిన్ను వివాహమాడటానికి. ఆత్మస్థైర్యాన్నీ, విశ్వాసాన్నీ కలిగివుండు. వాటికోసం నిత్యం ప్రార్థనలు జరుపు" అన్నాడు డాక్టర్ రామన్.

ప్రార్థనలు జరిపితే పోయిన కాలు తిరిగి వస్తుందా? లేని ఆత్మవిశ్వాసమూ, ఆత్మస్థైర్యమూ వంటబడతాయా? డాక్టరుగారిదంతా చాదస్తం, అనుకున్నాను ఆయన వెళ్ళినతోడనే క్రింద మా నాన్నగారితోనూ, అమ్మతోనూ ఓ అరగంట నన్నుగురించీ, నాలో పెరిగిన సినిసిజమ్ గురించీ నా ముందు జీవితాన్ని గురించీ డాక్టరుగారు మాట్లాడినట్టు తెలియవచ్చింది.

సాగర్ జాడ మళ్ళీ తెలియలేదు.

ఇంకా బెంగుళూరునుంచి రాలేదట. ఆ సాయంత్రం ఫోనుచేసి కనుక్కున్నాను. సాగర్‌ను గురించి ఆలోచించుకున్నప్పుడల్లా అవ్యక్తమైన భయసందేహాలు పొడసూపుతూనే ఉన్నాయి.

# 8

మా కాలేజీ స్విమ్మింగుటీమ్ టోర్నమెంట్సులో పాల్గొన్నది నేను లేకుండానే సాగర్ పాల్గొనలేదట. కారణం తెలియదు. నేను లేనని మానుకున్నాడేమో! ఏమైనా ఫస్టుని మా కాలేజీగర్లే వొచ్చింది. నాకు వస్తుందనుకున్న బంగారు పతకం ఆమె కొచ్చింది. ఆమె పేరు జీవని. ఎప్పుడూ నాకంటె వెనకనే వుండేది. నేను లేకపోవడంతో ఆమెకే వొచ్చింది ప్రైజు అదీ ఆమె అదృష్టమే!




సాగర్ బెంగుళూరునుంచి వొచ్చాడు. రెండురోజులు నా ఫోనుకు అందలేదు. అంత తీరికలేకుండా ఏంపనులమీద తిరుగుతున్నాడో, అన్నిరోజులు నన్ను చూడకుండా యెట్లా గడిపాడో, తీరా ఊళ్లోకి వచ్చాక కూడా నన్ను చూడాలనే లాలసకలగలేదా! మూడోరోజు ఉదయం ఫోనుకు దొరికాడు.

"డార్లింగ్! ఎక్స్క్యూజ్ మీ! బెంగుళూరునుంచి వచ్చిన క్షణంనుంచీ నిన్ను కల్సుకుందామనే తహతహలాడుతున్నాను. వీలుపడింది కాదు."

"అంత అర్జంటుపనులేమిటి? ఇన్నాళ్లు బెంగుళూరులో ఎందుకున్నావ్ డియర్! నన్నిక్కడ వొదిలేసి పోవడం న్యాయమేనా" అన్నాను ఫోనులో బుంగమూతిపెట్టి.

"మా నాన్నగారి పనిమీద వుండిపోవాల్సి వచ్చింది. సాయంత్రం మీ యింటికి వస్తాను. తీరిగ్గా మాట్లాడుకుందాం."

"తప్పకుండా రా సాగర్."

"సర్టెన్లీ" అని ఫోను క్రిందపెట్టాడు సాగర్.

బాగా అలంకరించుకొని, సాయంత్రం అయిదుగంటలనుంచీ సాగర్ కోసం వాసకసజ్జిక లాగా ఎదురుచూస్తూనే ఉన్నాను. ఆరుగంటలైంది ఏడు గంటలైంది, రాత్రి ఎనిమిదిగంటలైంది. నా కళ్ళు ద్వారంకేసి చూస్తూనే ఉన్నాయి, నిప్పురవ్వల్లాంటి ఆశలతో. కాని సాగర్ రాలేదు.

నిప్పురవ్వలపై చన్నీళ్ళు చల్లబడ్డట్టు చప్పగా నిరుత్సాహపడ్డాను. మెడలో నెక్లెస్నూ, చేతికి పెట్టుకున్న రాళ్ళ గాజులనూ, రవ్వల దుద్దుల్నీ తీసి టేబుల్పైన విసిరివేశాను ఉక్రోషంకొద్దీ. సాగర్లో ఏదో ఊహకందని మార్పు

వస్తూన్నది. వస్తానని చెప్పి మోసగించడంలో ఏదో అంతర్యమున్నది. నాకు బోధపడటంలేదు. బెంగుళూరు వెళ్ళివచ్చిన దగ్గర్నుంచీ—అతనిలో ఈ మార్పు. నాపై అభిప్రాయాల్నీ, ప్రేమాభిమానాల్నీ, మమతల్నీ మార్చుకున్నాడేమో! నన్ను పెళ్ళిచేసుకోడేమో! అంతా బూటకమేనేమో! నాకు మొహం చూపెట్టడానికి జంకుతున్నాడేమో! ఎట్లా సంభవం? మనుష్యులింత త్వరగా మారిపోవటానికి అవకాశమున్నదా? నా బుర్రంతా తలక్రిందులైంది.

మరునాడు ఉదయం సాగర్‌కు ఫోన్ చేశాను. కాని యింట్లో లేడు. బజారుకు వెళ్ళాడట. ఎప్పుడొస్తాడో తెలియదట. మళ్ళీ పదిగంటలకి ఫోను చేశాను. ఇంకా ఇంటికి రాలేదని జవాబు. ఒంటిగంటకు ఫోనుచేశాను. భోజనంచేసి, నిద్ర పోతున్నాడని చెప్పారు సాయంత్రం మూడున్నరకు ఫోనుచేశాను. మళ్ళీ బజారు కెళ్ళాడని సమాధానం. రాత్రి ఎనిమిదింటికి చేశాను. ఇంకా బజారునుంచి రాలేదని అన్నారు ఇహ మళ్ళీ ఫోనుచేయలేదు నేను ఎందుకూ? ఇంట్లోవుండే లేడని చెప్పిస్తూన్నట్టు అనుమానమేసింది దిండులో తలదూర్చి కన్నీరును కాలువలు కట్టిస్తూ యేడ్చాను. నేనే సాగర్‌ను ప్రేమించి వుండకపోతే, ఈ స్థితిలో యింతగా మనోవేదనకు గురైవుండేదాన్నా? ఇంత అశాంతిగా నా మనస్సు గిలగిల కొట్టుకొనేదా?

ఒకరోజు ఉదయం మా అమ్మ వ్యంగ్యమైన చిరునవ్వుతో నా దగ్గర కొచ్చింది.

డాక్టరు రామన్‌గారు నీకో బహుమతి పంపించారు."

"నాకా? ఏమిటాబహుమతి?" అన్నాను ఆశ్చర్యంతో విప్పారిన నేత్రాలతో.

"నీకు బాగా ఉపయోగపడేదే!"

"అంటే—"

మా అమ్మ పనిమనిషిని పిల్చి, ఆ బహుమతిని మేడమీదికి తెప్పించింది.

అది చక్రాల కుర్చీ!

నా కళ్ళు బైర్లుక్రమ్మినంత పనైంది. చక్రాలబండీలో కూర్చుని వీధుల్లో అడుక్కునే యెంతోమంది బిచ్చగాళ్ళు నా మనోవీధిలో తిరిగారు.

"ఆ బండీలో కూర్చుంచే వున్నదానికంటె రెట్టింపు కుంటిదనం వచ్చినట్టు వుంటుంది నీ యిష్టం! అందులో కూర్చుని మేడవరండాలో పచార్లు చేయవచ్చు," అన్నది మా అమ్మ.

మా అమ్మపై నాకు విపరీతమైన కోపం వచ్చింది. దాన్ని పంపించిన డాక్టరు

రామన్‌మీద నాకు ఆగ్రహమేమీ కలుగలేదు. ఆయన సదుద్దేశ్యంతోనే పంపించి వుంటాడు, మధ్యలోనే మా అమ్మ వక్రబుద్ధితో తన అభిప్రాయాన్ని వెల్లడిస్తోంది. మా నాన్నగారు యింట్లోలేరు. అయినా ఆ వీల్‌చైర్‌లో విహరించడం నాకు సుతరామూ యిష్టంలేదు. అట్లాంటి వాహనాలకు అంటుకుపోవడం నా సెంటిమెట్‌కు నచ్చదు.

"ఈ బండి నా కక్కర్లేదు తిప్పి పంపించమ్మా" అని అరిచాను బిగ్గరగా. కోపోద్రేకంతో నా మొహమంతా వండిన దొండ పండైంది.

"మీ నాన్నగారితో సంప్రదించు" అన్నది మా అమ్మ.

"అవసరమేమీ లేదు" అన్నాను గట్టిగా.

ఆ బండిని పనిమనిషి క్రిందికి తీసికెళ్ళాడు. మా అమ్మకూడా ఆ బండి వెంటే క్రిందకు వెళ్ళింది.

## 9

మళ్ళీ సాగర్ మా యింటి గడప తొక్కలేదు. నేనూ ఫోన్‌చేయడం మానుకున్నాను. అందని పండుకోసం పైకెగిరి అందుకొనే ఓపికా, శక్తీ నాకు లేవు. నా నొనటన యెలా వ్రాసివుంటే, అలానే జరుగుతుంది. మంచికోసం ఆదుర్దా పడినా మంచి జరుగుతుందా? చెడునుగురించి కలలోనైనా ఆలోచించకపోతే—చెడు జరక్కుండా వుంటుందా? కాని సాగర్‌పై పూర్తిగా ఆశను తొలగించుకోలేకపోతున్నాను. అతని వాగ్దానం నా మనస్సుపై అట్లాంటి గాఢముద్రను ముద్రించింది.

ఓ రోజు మధ్యాహ్నం మా యింటికి ఓ కొత్త వ్యక్తి వచ్చారు. మేడక్రింద హాలులో తనకు తనే మా అమ్మతో పరిచయం చేసికున్నాడు. నన్ను చూడాలనీ, నాతో మాట్లాడాలనీ తన అభిప్రాయాన్ని వ్యక్తపర్చాడు. కాని మా అమ్మ అభ్యంతరం తెలిపింది.

"మా సరితకు అట్లాంటివేమీ గిట్టవు. ఆమెను చూడాల్సిన పనేలేదు."

"ఒక్కసారి ఆమెతో మాట్లాడితే, ముఖతా ఆమె అభిప్రాయాన్ని కనుక్కుంటే?" అంటున్నాడతను.

"ఏమీ కనుక్కోనవసరంలేదు. ఆమె మనస్తత్వం నాకంటె యింకెవ్వరికీ బాగా తెలియదు. పద్దెనిమిదేళ్ళనుంచీ నా వొళ్ళో పెరిగినపిల్ల" అంటోంది మా అమ్మ.

"కావచ్చు. నేనేమీ కాదనటంలేదు. మీరు ఆమె తల్లిగనుక, నిజంగా మీ

అమ్మాయిగారి మనస్తత్వం మీకంటె మరొకరికి లోతుగా తెలుసునని అనడానికి సాహసించే తెలివిహీనుణ్ణికాదు. కాని నా ప్రార్థన ఒహటున్నది. ఈనాటి యువతీ యువకులకు తమ తల్లిదండ్రులకు తెలియకుండా పదిలంగా దాచుకొనే అభిప్రాయాలెన్నో వుంటాయి. సమయం వొచ్చినప్పుడు, ఆ సమయానికి తగిన వ్యక్తులవద్ద బయటబెట్టడం కద్దు" అంటున్నాడతను తన పట్టువిడకుండా.

వాళ్ళ సంభాషణ నాకు స్పష్టంగా వినబడుతూన్నది. ఇన్సూరెన్సు ఏజెంటు కామోసు! ఆమాట చమత్కారమూ, ఓర్పూ, పట్టుదలా, దూసుకుపోయే తీరూ— నాకు అలాగే అనిపించింది.

"మీ అమ్మాయిగారిని నేను చూసితీరాలి!"

"చూడటానికి వీల్లేదు" మా అమ్మగొంతు కంచుఘంటవలె మ్రోగింది.

మా అమ్మ పైకి వెళ్ళవద్దని ఎంత మొత్తుకున్నా, చొరువగల వ్యక్తివలె అతను మేడపైకి నా దగ్గరకు వచ్చాడు.

అతను చాల పొడుగ్గా ఉన్నాడు. ఆరు అడుగుల ఎత్తు విగ్రహం. వయస్సు పాతిక సంవత్సరాలకు మించి వుండదని అంచనావేశాను. మొహంలో మృదుత్వం లేకపోయినా, తొలిచూపులోనే 'అందగాడు' అన్న అభిప్రాయం కలగకపోయినా, కళ్ళు ఆకర్షణీయంగా ఉన్నాయి జుత్తూ, మీసకట్టూ యస్.సి.సి. ఆఫీసర్ను గుర్తుకు తెస్తున్నాయి. డీప్ బ్లూ కలర్ ఉలెన్ ప్యాంటుపై, క్రీమ్‌కలర్ టెర్లిన్ శ్లాకు ధరించాడు. చేతిలో హ్యాండ్‌బ్యాగ్ వున్నది.

"నా పేరు రాజారామ్. చౌదరీ అండ్ రెడ్డి కంపెనీలో పనిచేస్తున్నాను. కృత్రిమ అవయవాల్ని తయారుచేయడంలో మా కంపెనీ భారతదేశంలో ప్రసిద్ధికెక్కినది డాక్టర్ రామన్‌గారు మీ దగ్గిరకు వెళ్ళమని చెప్పారు. వారు యెంతోకాలనుంచీ మాకు తెలుసు" అన్నాడతను, ఎంతో వినయంగా.

కృత్రిమ అవయవాలు!—ఆ ఊహకి నా వొళ్ళంతా ఝల్లుమన్నది. తల గుండ్రంగా తిరిగినట్లయింది.

"డాక్టర్ రామన్‌గారు పొరబాటుపడి చెప్పివుంటారు. అందులో నాకు ఆసక్తేం లేదు" అన్నాను దృఢంగా.

"మీకు 'వీల్‌చైర్' మీదగానీ 'క్రచెస్' మీదగానీ ఇష్టంలేదని ఆయన నాతో చెప్పారు. అయితే మీకు ఈ గదిలోనే ఎవ్వరికీ కనబడకుండా వుండాలనీ, జరిగినదానికి జీవితాంతమూ కుళ్ళి కుళ్ళి ఏడ్వాలనీ—ఉన్నదన్నమాట! అంతేనా!" అన్నాడు రాజారామ్ నిశితమైన వ్యంగ్యంతో.



నాకు కోపం తాటిప్రమాణాన లేచింది. "అట్లా ఎన్నటికీ కాదు. ఎవరు చెప్పారు మీకు? నాకూ జీవితంపై ఆశలూ, మమకారాలూ, వాంఛలూ ఉన్నాయి. శైలులాంటి బ్రతుకంటే నాకు అసహ్యం. మీరు వెనకా ముందూ చూసుకొని మాట్లాడటం మంచిది."

రాజారామ్ పలుచగా చిరునవ్వును దొర్లించాడు. నేను కోపంగా మాట్లాడటం అతని దరహాసానికి హేతువైనదా? ఏమి టీయన మనస్తత్వం?

"ఏమైనా మీలో ఉత్సాహం నలిదిపోనందుకు నాకెంతో సంతోషంగా వుంది. వాస్తవంగానే మీకు బ్రతకాలని వుంది. జీవితంలో అనుభవాన్ని సేకరించాలని వుంది. మీలాంటివారికి జీవితం ఎప్పుడూ గులాబీలపడకే!"

అతని మాటలు నన్ను ఉక్కిరిబిక్కిరి చేశాయి. నన్ను గురించి అంత వేగంగా అభిప్రాయాన్ని ఎట్లా మార్చుకోగలిగాడు?

"చూడండి! ఈ క్యాటలాగ్ తిరగవేస్తే కృత్రిమ అవయవాలను గురించి సమగ్రంగా తెలుస్తుంది. వచ్చేవారం ఇదే రోజున మళ్ళీ వస్తాను. ఈ లోపల తీరిగ్గా ఆలోచించండి" అంటూ ఓ పెద్ద కాటలాగ్‌ను నా బెడ్‌పై పెట్టాడు.

నమస్కారంచేస్తూ నిష్క్రమించాడు. ఎంత వేగంగా ప్రవేశించాడో అంత వేగంగా తిరిగి వెళ్ళిపోయాడు.

ఆ కేటలాగ్ పైపైన తిరగవేశాను. కృత్రిమ అవయవాల బొమ్మలు— ముక్కూ, చెవీ, చేతులూ, కాళ్లూ, నుదురూ, బుగ్గలూ, వ్రేళ్ళూ ఉన్నాయి. వాటిక్రింద ఉపయోగించే క్రమం వ్రాసివుంది. 'ఈ అవయవాలతో మళ్ళీ మీరు మామూలు మనుషులు కావచ్చు' అనే నినాదం ప్రతి పేజీలోనూ ఉంది. కాని ఎట్లా సాధ్యం? అది కేవలం వ్యాపార ప్రకటన. అట్లాంటి ప్రకటనలకు ఎవరు మోసపోతారు! ఏమైనా నాకు 'ఆర్టిఫిషియల్ లింబ్' పెట్టుకోవాలనే ఆలోచన లేదు. ఎందుకో దానిపైన నాకు యెక్కడలేని అసహ్యం, జుగుప్స, చిన్నతనం! కాని రాజారామ్ మాటలు నా హృదయాంలో అస్పష్టమైన గాలి స్పర్శవలె ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి. నేను నిజంగా లోకానికి వెరుస్తున్నానా? మేడపై గదిలో ఒక్కదాన్నే యెవ్వరికీ కనబడకుండా రహస్యంగా జీవించాలని అనుకుంటున్నానా? నాలోని బలహీనత ఎంత పదునుగా బయటికి లాగాడు!

ఆరోజు ఉదయం నాన్నగారు నన్ను పలకరించడానికి వచ్చినప్పుడు—

"డాడీ! నన్ను మేడక్రింద గదిలోవుంచే యేర్పాట్లు చేయించు. 'వీల్ చైర్' కూడా తెప్పించు! ఇట్లా మేడపైన యేకాంతంగా చాటుగా బ్రతకడం నా కిష్టం లేదు" అన్నాను.

"సరే! అట్లాగేనమ్మా! అదే బావుంటుంది" అన్నాడు నాన్నగారు.

ఆ సాయంత్రమే నేను మేడక్రింద గదిలోకి వచ్చాను. వరండా ప్రక్కనే వుంది ఆ గది. కిటికీలోంచి చూస్తే మా గార్డెన్ కనబడుతుంది. ప్రహరీగోడ మీదుగా మూడు వీధుల కూడలి కూడా కనబడుతుంది. నన్ను చూడటానికి వచ్చిన వాళ్ళందర్నీ నేను సూటిగా కలుసుకోవచ్చు మా అమ్మ కొంతమందిని నన్ను చూడనీయకుండా వెనక్కు పంపించే ఆస్కారంలేదు.

* * *

సృష్టి రహస్యం బహు విచిత్రమైంది. ఎవ్వరికీ అర్థంగాని అయోమయమైనటువంటిదీ, అనంతమైనట్టిదీ, ఏక్షణాన, ఏ సంఘటనవల్ల బ్రతుకు గాలిబుడగ పగిది అంతమౌతుందో అన్న వేదాంతం తెలిసినప్పటికీ, భూమిమీద పుట్టిన ప్రతి జీవి సుఖంగా బ్రతకాలనీ, ఎక్కువకాలం జీవించాలనీ ఆరాటపడతాడు. అందులో విచిత్రమేమీలేదు. ఒకరకంగా రాజారామ్ నా చీకటిగదిలో అగ్గిపుల్ల వెలిగించాడు. మానవ ప్రపంచంలో వుంటూ మానవులకు చాటుగా, రహస్యంగా,

కుమిలిపోతూ, చిన్నతనం పొందుతూ కాలంతో ప్రేక్కాడటంలో అర్థంలేదు ఉన్న బ్రతుకులో సంతృప్తిని, సౌఖ్యాన్ని సృష్టించుకోవాలి. అదే జన్మకు సార్థకత!

మేడ క్రింద గదికి చేరిన దగ్గర్నుంచీ కాలంలో కదలిక యేర్పడసాగింది—అది కృత్రిమ మైనప్పటికీ స్నేహితులతో కులాసాగా మాట్లాడుతున్నాను. బంధువుల కుశలప్రశ్నలకు తిన్నగా జవాబులు చెబుతున్నాను. ఉదయమూ, సాయంత్రమూ నాన్నగారు నాకోసం తీరికచేసికొని, నన్ను 'వీల్ చైర్'లో తిప్పుతున్నారు. ఆ సమయంలో నాకెంతో ఆనందగా వుంటుంది. ఎందుచేత నంటే, నాన్నగారు చాల కబుర్లు చెబుతుంటారు-నాకు తెలియనివీ, నేను చూడ లేనివీ, విననివీ. ఈ మధ్య నాకోసం ఆయనగారు విరివిగా సినిమాలుకూడా చూస్తున్నారు. తను చూసివచ్చి, సమగ్రంగా ఆ కథ నాకు చెబుతూ వుంటారు.

ఓ రోజు ఉదయం అన్నాను:

"డాడీ! నాకూ ఓ మంచి తెలుగు సినిమా, ఓ మంచి ఇంగ్లీషు సినిమా, ఒక హిందీ సినిమా చూడాలని ఉంది. ఒక నెలలో ఈ మూడు పిక్చర్సూ చూస్తాను."

"ఆల్ రైట్. అంతకంటేనా? నేను ఏర్పాట్లు చేస్తాను. నువ్వు బిడియపడక్క ర్లేదు. ఇతర్లు యేమేమో అనుకుంటారని మన సౌఖ్యాల్ని వొదులుకుంటామా?" అన్నాడు నాన్నగారు.

నాన్నగారికి నేనంటే యెంత ప్రేమ, అభిమానం, వాత్సల్యం, మమతా! నా కోసం ఆయన యేం చేయమన్నా చేస్తాడు? తన వ్యవహారాలు కట్టిపెట్టి అహర్నిశమూ నా దగ్గిర వుండమన్నా ఉంటాడు. నాన్నగారికి నాపైన అశ్రద్ధా, అభిలాషా, ప్రేమా లేకపోతే నాకు బ్రతికే అవసరమే లేకపోయేది!

ఒకరోజు మధ్యాహ్నం నేను మోరేవియా నవల చదువుతూ ఉండగా మా అమ్మ వేగంగా వొచ్చింది ఏదో వార్త నా చెవిని వేద్దామన్నంత హడావిడిగా ఆవిడ చేతిలో ఏదో కార్డు ఉన్నది. నా దగ్గరకు వచ్చిరావడంతో ఆ కార్డు నా వొళ్లో వేసింది. కవరు తొలగించి. కార్డు చూశాను. అది పెండ్లి శుభలేఖ.

—నిలువునా మూర్ఛపోయాను.

ఇనుప దూలానికి కొట్టుకున్నట్టు తలంతాదిమ్మెక్కింది. మనస్సూ, శరీరమూ స్వాధీనం తప్పాయి.

—ఫ్రేంకుర్చీలో జారగిలబడ్డాను.

కడుపులో దుఃఖం 'లావా'లా కుతకుత లాడుతోంది. నరాలు పట్టు దప్పాయి. మస్తిష్కపు లేబరేటరీ ధ్వంసమైనట్లయింది.

నేను ఏదైతే జరగకూడదని అనుకున్నానో, భయపడుతూ వచ్చానో, అహో రాత్రులు ఆలోచిస్తున్నానో—అదే అక్షరాలా జరిగింది. భగవంతుడు నా నెత్తిపై మళ్ళీ పెద్ద బండరాయిని పెట్టాడు. నామీద యెందుకో అంత కక్ష!

సాగర్ పెండ్లి శుభలేఖ. ఒక ధనవంతుల పిల్లతో అతని వివాహం. ఇంకా మూడురోజులున్నది. నాకు శుభలేఖ పంపించాడు. మొహానికి సిగ్గెట్లా లేదో?

నన్నూ, నా మొహంలో కలిగే మార్పుల్ని పరిశీలిస్తూ నిలబడింది మా అమ్మ. ఆవిడలోనూ దుఃఖం పొంగి పైకుబికినట్లుంది. పైటచెంగుతో కళ్ళు అద్దుకుంటూ అన్నది "ఇంత మోసం చేస్తాడని వూహించలేదు ఎవ్వరూ. పాపం! అతని పైనే నువ్వు గంపెడాశ పెట్టుకున్నావు మూలిగే నక్కపై తాటికాయ పడ్డట్లయింది!"

నాలో అహం, రోషం ఉవ్వెత్తుగా లేచేయి. నా హృదయాంతర్వాహినిలో ఎప్పుడూ 'సాగర్ నిన్ను మోసం చేస్తాడు!' అన్న భీతి వెంటాడుతూనే ఉంది. అది నిజమైంది అంతేగా! తన మాటలకూ, వాగ్దానాలకూ, ప్రేమాభిమానాలకూ, స్త్రీ లాగా పురుషుడు కట్టుబడి వుండలేడు. జీవితంలో అగ్నిపరీక్షా సమయం వొచ్చినప్పుడు —పురుషుడు సులభంగా జారిపోతాడు; వేరు మార్గాలు తొక్కు తాడు; స్వార్థాన్ని, సౌఖ్యాన్ని చూసుకుంటాడు. కారణమేమిటంటే, అతను ఏంచేసినా సమాజం 'ఆమోద ముద్రను వేస్తుంది. ఆ పరిస్థితికే సాగర్ అతీతు డని అనుకోవటం నాదే పొరబాటు. అతనిపై ఆశా సౌధాన్ని నిర్మించుకొని, అందులో కాపురం చేయాలని తహతహలాడటం నాదే తప్పు. ఈనాటి యువ కుల ప్రేమాభిమానాల్ని సరిగ్గా అంచనా వేయకపోవడం నా తెలివితక్కువ తనమే! ఇప్పుడు విచారించి, పశ్చాత్తాపపడి ప్రయోజనమేముంది?

"సాగర్ మరో యువతిని పెళ్ళాడుతూంటే దుఃఖించాల్సిన అగత్యం నాకు లేదు. నేను యెప్పుడు హాస్పటల్లో చేరానో అప్పుడే మా యిరువురి మధ్యా అగాధమేర్పడిందని భావించాను. నన్ను చూడటానికి మన యింటికి అతను రాన ప్పుడే ఆ భావన వాస్తవమని రుజువైంది. ఇంకా నేను విచారించడ మెందుకు?" అన్నాను పళ్ళు బిగబట్టి

"నువ్వు అతన్ని గాఢంగా ప్రేమించావు గదా!"

"ప్రేమించాను అతనూ నన్ను అంత గాఢంగానూ ప్రేమించినట్టు తెలియ




జేశాడు. పెళ్ళి చేసుకుంటానని వాగ్దానం చేశాడు. ఆ వాగ్దానానికి కట్టుబడి వుండ లేకపోయాడు. అంత దుర్భరమైన మనస్తత్వం గలవాణ్ణి వివాహం చేసుకుని మటుకు జీవితంలో నేను సుఖపడే దేముంది? భౌతికమైన అందమూ, ఆకర్షణా ప్రేమకు ప్రాతిపదికయైనప్పుడు అది జీవితానందాన్ని ఎల్లాగూ చేకూర్చలేదు."

"పోనీ, ఎక్కడేనా సంబంధాలు చూడమంటావా? పెళ్ళిచేసికుంటావా? సాగర్‌ను తలదన్నేవాణ్ణి, వరుడుగా తీసికొస్తా" అన్నది మా అమ్మ ఉత్సాహంగా.

"ఇప్పుడు నా కేమీ పెళ్ళివద్దు" అన్నాను నిష్కర్షగా.

"అసలు పెళ్ళేచేసుకోవా?" అన్నది మా అమ్మ విస్తుపోతూ.

"చేసికుంటాను. కాని ఇప్పుడుకాదు. సమయం వొచ్చినప్పుడు—"

"ఆ సమయమే ఎప్పుడొస్తుందని."

"ఎప్పుడో ఒకప్పుడు రాకపోతుందా?"

"నీ వేదాంతం నా తలకెక్కటంలేదు" అన్నది మా అమ్మ అమోమయంగా.

"నీకు ఇప్పట్లో అర్థం కాదులే! ఆ రోజు వచ్చినప్పుడు సులభంగా అర్థమౌతుంది.

ఒకరోజు డాక్టర్ రామన్ వచ్చాడు నన్ను చూడటానికి. ఆయన తరచూ మా యింటికివచ్చి నా ఆరోగ్యాన్ని కనుక్కుంటూ ఉంటాడు. అప్పుడప్పుడూ పరీక్షకూడా చేస్తూవుంటాడు.

"క్యాన్సర్ లక్షణాలేమీ లేకపోవడం చాలా అదృష్టమే సరితా! ప్రతిరోజు

రాత్రి భగవంతుణ్ణి ప్రార్థించు—మరుసటిరోజు మంచిగా జరిగిపోవాలని" అన్నాడు రామన్. ఆధునిక శాస్త్ర విజ్ఞానంపట్ల ఆయనకెంత ప్రగాఢ విశ్వాసమున్నా, భగవంతుని ఉనికిపై కూడా అంత ప్రగాఢ విశ్వాసమున్నది.

కాని నాకు భగవంతుణ్ణి ప్రార్థించడంవల్ల జరిగే మేలునుగురించి అంతగా సదభిప్రాయం లేదు. నేనేం పాపం చేశానని, ద్రోహంచేశానని, అపకారం చేశానని—భగవంతుడు నా కీ దుస్థితిని కల్పించాడు? సాగర్‌ను నానుంచి వేరుచేయ వద్దని భగవంతుణ్ణి ఎన్ని రాత్రుళ్ళు వేడుకున్నాను? నా మొర యేమైనా ఆలకించాడా? ఇంకా నాలో క్యాన్సర్‌కు సంబంధించిన లక్షణాలుండి, అవి శరీరంలో మరోచోట బయటపడితేమటుకు చేసేదేముంది? నిత్యమూ ప్రార్థిస్తే మాత్రం భగవంతుడు దయతలుస్తాడా?

డాక్టరుగారి సలహాపై నేనేమీ వ్యాఖ్యానించలేదు.

## 10

ఓరోజు సాయంత్రం వీల్‌చైర్‌లో కూర్చుని గార్డెన్‌లో తిరుగుతున్నాను. సంధ్యారుణిమకాంతికి తోటలో పువ్వులూ చెట్లూ యెంతో శోభతో వెలుగుతున్నాయి. దక్షిణపు గాలికి అవి కులాసాగా తలలు ఆడిస్తున్నాయి. చైతన్యపూరితమైన ఈ ప్రకృతి శోభకు నేను గంతులేస్తూ తిరగవల్సింది, ఇట్లా చక్రాల బండిలో కూర్చుని మూగగా అనుభవించాల్సి వస్తోంది. విధి ఎంత క్రూరమైంది.

ఫౌంటెన్ ప్రక్కనుంచి నర్సు వీల్‌చైర్‌ను నెట్టుతోంది. సినిమా పత్రికలో బొమ్మలుచూస్తూ ఆలోచిస్తున్నాను. నాన్నగారు ఆ సాయంత్రం అర్జంటు పనిమీద కార్లో విజయవాడ వెళ్ళారు. డైరెక్టర్ల మీటింగు ఉన్నదట. ముఖ్యమైన విషయాలపై చర్చ ఉన్నదట. నన్ను వొదిలి వెళ్ళటానికి చాలా బాధపడ్డాడాయన. "నాకోసం మీరేదో బిజినెస్ చెడగొట్టుకోవద్దు డాడీ! ఏకాంతమైన కాలక్షేపంలో హాయిని పొందడం నేర్చుకుంటున్నాను" అన్నాను నా ప్రోద్బలం మీదే-నిశ్చింత గాఉవెళ్ళాడాయన.

గేటుదగ్గర ఎవరో వ్యక్తి కనబడ్డాడు. గేటు మెల్లగా తెరుచుకొని లోపలకు వస్తున్నాడు. ఆ విగ్రహాన్ని చూసి ఇట్టే గుర్తించాను. నా మనస్సులో ముల్లు గుచ్చుకున్నట్లయింది మొహం చిట్లించుకొని, చుట్టూ చూశాను. ఆ వ్యక్తి బూట్లు టకటక లాడించుకుంటూ నాదగ్గరకే వస్తున్నాడు. అతని నడకలో నాకేదో చోద్యం కనబడింది. సాఫీగా నడవటంలేదు. మనుషుల్లో ఎన్ని తరహా



లున్నాయో నడకల్లోకూడా అన్ని తరహాలున్నాయి. ఒకరు నడిచినట్టు మరొకరు నడవలేరు.

వీల్‌చైర్ నెట్టటం ఆపమని నర్సుతో చెప్పాను. సన్నజాజి పందిరిచెంత ఐండిని ఆపింది నర్సు.

"హల్లో, గుడ్ ఈవినింగ్!" అంటూ వచ్చాడు రాజారామ్.

నర్సు వరండాలోంచి ప్రేంకుర్చీ తెచ్చి, వీల్‌చైర్ ఎదురుగ్గా వేసింది.

"హౌ డు యు ఫీల్ మిస్ సరితా!" అన్నాడు రాజారామ్ కుర్చీలో సుఖంగా కూర్చుంటూ.

"నథింగ్ న్యూ మామూలుగానే ఉన్నాను" అన్నాను తల కొంచెంగా ఆడిస్తూ.

మళ్ళీ ఈ పీడవొచ్చి పడిందే! నన్ను జలగలాగ పట్టుకొనేట్టు ఉన్నాడు! అనుకున్నాను.

"నాన్నగారు ఇంట్లో లేరా?" అన్నాడు రాజారామ్ మేడవరండాలోకి చూస్తూ.

"ఉహుం! పనిమీద విజయవాడ వెళ్ళారు."

"ఎప్పుడొస్తారు?"

"రేపు సాయంకాలానికి రావొచ్చు"

"అమ్మగారు లేరా?"

"ఇంట్లో వున్నది. వంటపని చూస్తున్నట్టుంది."

ఈ ఆచూకీ అంతా దేనికి? అతను వొచ్చినపని వొకటి, మాట్లాడుతూన్నది మరొకటి. చల్లకొచ్చి ముంత దాచడమెందుకు? మనస్సులో ఉన్న విషయాన్ని బయటపెట్టేముందు చాలా విషయాల్ని గురించి మాట్లాడుతూ చాలా కాలాన్ని వృధాపుచ్చుతారు. రాజారామ్‌లాంటి వాళ్ళసంగతి ప్రత్యేకంగా చెప్పనవసరం లేదు. గాలిని ప్రోగుచేసి మూటకట్టడంలోనే వాళ్ళు యెంతో ఆనందాన్ని పొందుతూ వుంటారు.

"నేను చెప్పిన విషయాన్ని గురించి ఆలోచించారా?" అన్నాడు రాజారామ్ అసలు విషయంలోకి అకస్మాత్తుగా దిగుతూ.

నేను విననట్లే నటిస్తూ సన్నజాజి పందిరికేసి దృష్టిని మళ్ళించాను.

మళ్ళీ హెచ్చరించాడు రాజారామ్ గొంతు కొంచెం పెంచి. కొంపదీసి నాకు చెముడు వచ్చిందనుకున్నాడేమో!

"ఆలోచించే అవసరం లేదని అప్పుడే చెప్పానుగా! ఆర్టిఫిషియల్ మీద నాకు ఆసక్తి లేదు. మళ్ళీ మీరు శ్రమపడుతూ ఎందుకొచ్చారో నాకు అర్థంగావటం లేదు" నిర్మొహమాటంగా అన్నాను.

రాజారామ్ రవ్వంత చిన్నబుచ్చుకోలేదు. తాజా గులాబివలె అతని మొహం తళతళలాడుతూనే ఉంది ఎదుట వ్యక్తి అవమానపరుస్తూంటే, దాన్ని చిరునవ్వుతో స్వీకరించడానికి ఎంత సహనం కావాలి? నిజంగా అదికూడా అరవైనాలుగు కళల్లో ఒకటి కాబోలు!

"మీ దగ్గరకు మళ్ళీరావడంలో నా కెల్లాంటి శ్రమాలేదు. అది నా వృత్తి ధర్మం. అవసరమైతే వందసార్లు వస్తాను రవ్వంత అలసిపోకుండా. మీరు మాటను ఆలకించేవరకూ వస్తూనే ఉంటాను. మీ పరిస్థితి నన్నట్లా బందీనిచేసింది నాకు తెలుసు-మీరు ఐశ్వర్యవంతులు. వయస్సులో ఉన్నారు. మిసమిసలాడే సౌందర్యంతో మెరిసిపోతున్నారు. విద్యావంతులు, స్విమ్మింగ్ గర్ల్‌గా మీకు ఈ పట్టణంలో మంచి పేరు ప్రఖ్యాతులున్నాయి. అట్లాంటి మీ బ్రతుకు ఈ తోటకూ, మేడకూ, ఈ నాలుగుగోడలమధ్యా అంకితం కావడానికి వీల్లేదు

సువిశాలమైన విశ్వంఉండగా, చిన్నదీ, ఇరుకైనదీయైన ఈ జీవితకాలాన్ని పరిమితం చేయడం ఏంసబబు? స్వల్పమైన ఈ జీవితపరిధిలో సాలెగూడును కట్టుకుంటూ కన్నీటిబొట్లు రాల్చడంవల్ల జీవిత పరమార్థాన్ని సాధించ వీలవునా? మీకు వినే ఓపిక ఉంటే ఓ చిన్నకథ చెబుతాను వినండి "

వెచ్చని నిట్టూర్పు వొదిలాను భారంగా.

"భగవంతుడు పుట్టుకతోనే కొంతమందిని అదృష్టవంతులుగానూ, మరి కొంతమందిని దురదృష్టవంతులుగానూ పుట్టించడు. తర్వాతనే మానవులు తమ చేష్టలవల్ల, ఆలోచనలవల్ల, విధికృతంవల్లా అదృష్టజీవులుగానూ, దురదృష్టవంతులుగానూ మారతారు. మా వూళ్లో రామసుబ్బయ్య అనే పేరుగల ఒకాయన ఉన్నాడు. ఆయన మా ఊళ్లో గొప్ప షావుకారు. వందెకరాల భూమిఉంది. ఒక్కడే కొడుకు. రామసుబ్బయ్య వసుధా మంచివాడు. ఆయనచేతికి యెముక లేదు. ఆ చుట్టుపక్కల పాతిక ముప్ఫై గ్రామాల్లో ధర్మాత్ముడని ఆయనకు పేరు. 'దేహి' అని ఎవరొచ్చి అడిగినా, ఘనంగా యిచ్చేవాడు. కాని ఆయన దుర్వ్యసనాలపుట్ట, తన కర్మను తనే కొనుక్కు తెచ్చుకొనే స్వభావంగలవాడు. చీట్లపేక, వ్యభిచారం, త్రాగుడూ—ఈ మూడు వ్యసనాలకూ దాసుడు. మనిషి పతనానికి అంతకంటె దుర్గుణాలేం కావాలి. ఆ మూడు వ్యసనాల్లోనే ఆస్తంతా హారతి కర్పూరంలా కరిగిపోయింది. ఆయన భార్య ఆ వ్యసనాల దుర్గంధానికి తాళలేకి మొగుడ్ని వొదిలి పుట్టింటికి వెళ్ళిపోయింది. అప్పుడాయన ఒక్క కొడుకూ గుంటూరు కాలేజీలో బి.యన్‌సి. చదువుతున్నాడు తండ్రి ఆస్తినంతా తగలేస్తూన్నా, ఆ కుర్రవాడు తన చదువుపై ఆసక్తితో యేం పట్టించుకోలేదు. తల్లి పుట్టింట్లో వుంటూన్నా ఏమీ జోక్యం కలిగించుకోలేదు.

"సరీగ్గా అతనికి పరీక్షలు జరుగుతూ ఉన్నప్పుడు. ఇంటిదగ్గర్నుంచి టెలిగ్రాం వొచ్చింది: తండ్రికి సీరియస్‌గా ఉన్నదని. వెంటనే పరీక్షహాలులోంచిలేచి, సైకిలువేసుకొని వేగంగా రూముకు బయలుదేరాడు. ఒకరోడ్డు మలుపులో సైకిల్ను ప్రక్కకు త్రిప్పగా, ఓలారీవొచ్చి అతనిమీద పడింది. అక్కడున్న నలుగురు మనుష్యులూ వెంటనే అతన్ని గవర్నమెంటు హాస్పటల్‌కు చేర్చారు. సైకిలు ఎలా నజ్జునజ్జు అయిందో, అతని కుడికాలుకూడా అట్లాగే అయింది. ఆపరేషన్‌చేసి ఒక కాలు తీసివేశారు అంతకు క్రితంరోజే అతని తండ్రి దేహయాత్ర చాలించాడు. తండ్రికి తలకొరివి పెట్టటానికికూడా ఒక్కగానొక్క కొడుకు నోచుకోలేదు.

"ఆ తండ్రి దుర్వ్యసనాలతో ఆస్తినంతా ధ్వంసం చేశాడు. మా వూళ్లో ఒకప్పుడు షావుకారుగా పేరుగడించినవాడు చనిపోయేరోజుల్లో బుక్కాపకీరై నాడు. ఆ కొడుకు కుంటివాడై యింటికివస్తే అప్పులవాళ్ళు యింటినిండా చేరారు పరామర్శించడానికి. అతని తల్లి దీర్ఘంగా ఏడుస్తూ కూర్చుంది. పరువు ప్రతిష్ఠలకు వెరచి, అతను మిగిలిన ఆస్తినంతా అమ్మివేసి తండ్రిచేసిన అప్పుల్ని తీర్చాడు. ఇహపోతే అతనికి మిగిలిందేమిటి — అంధకారమైన భవిష్యత్తు!

"అల్లాగని అతను యింట్లోనే కుమిలిపోతూ కూర్చున్నాడా? తనకి జీవితంలో యింకేముందని నిరాశపడి ఆత్మహత్య చేసుకున్నాడా?

"లేదు. లేదు మనోబలం, ఆత్మవిశ్వాసం - అతనికి కొత్తజీవితాన్ని ప్రసాదించాయి. వికలాంగుడైనంత మాత్రాన జీవితశకటం ఆగిపోవాలని ఎక్కడుంది? భగవంతుడు మిగిల్చిన శక్తితోనే పుంజుకొని, జీవితాన్ని గుప్పెట్లోకి రాబట్టుకున్నాడు. కొత్త ఆశలతో విశేషమైన కృషితో తానూ ఒక మనిషి ననిపించుకున్నాడు. వ్యవహార జగత్తులో మామూలు మనిషివలె తిరిగాడు. బి. యస్‌సి. పరీక్ష పాసైనాడు. ఒక కంపెనీలో ఉద్యోగం సంపాయించాడు. ఇప్పుడు తల్లిని తన దగ్గరే పెట్టుకొని నిశ్చింతగా బ్రతుకుతున్నాడు. అతను కుంటివాడని తనంతట తను చెబితేతప్ప చాలమంది గ్రహించలేరు."

"మరి ఒకకాలు తీసివేశారుగా." అన్నాను నేను ఆశ్చర్యంగా.

"అక్కడేవుంది కిటుకు. ఒక కాలుగానీ, చేయిగానీ, తీసివేసినంత మాత్రాన అతను శాశ్వతంగా కుంటివాడైపోతాడా? ఆ రోజులు పోయినాయి. శాస్త్రవిజ్ఞానమూ, సాంకేతిక పరిజ్ఞానమూ భారీయెత్తున అభివృద్ధిగాంచిన ఈ రోజుల్లో కూడా కుంటివాడు కుంటివాడుగా వుంటే గొప్ప యేముంది? ప్లాస్టిక్ సర్జరీ యెంతో ముందంజవేసింది. కృత్రిమ అవయవాలు విరివిగా లభిస్తున్నాయి. అతను తనకు సరిపడ్డ ప్లాస్టిక్ కాలును పెట్టించుకున్నాడు. తద్వారా మామూలు మనిషిగా మారాడు. జీవితంపై మమకారాన్ని పెంచుకుని, అకుంఠిత విశ్వాసంతో కృషిచేసి కృతకృత్యుడైనాడు. చూశావా! ఆర్టిఫిషియల్ లింబ్‌వల్ల అతని బ్రతుకుతీరే మారిపోయింది.'' అంటూ తన కథను ముగించాడు రాజారామ్. తన కథ నాలో యేమైనా మార్పుల్ని తెచ్చిందేమోనని నా మొహంకేసి పరిశీలనగా చూశాడు.

నిజంగా ఆ కథ నన్ను మొదలంటా కదిలించివేసింది. నాలో పలు ఆలోచ







నల్ని రేకెత్తించింది. జీవితంపై ఆసక్తిని పెంచుకొని, మొండిధైర్యంతో కృషి చేస్తే, ఆ జీవితం తప్పకుండా రాణిస్తుంది. కాని రాజారామ్ ఈ కథను నాలో జీవితంపట్ల ధైర్యాన్ని కలుగజేయటానికి కల్పించి చెప్పలేదుగదా అన్న సందేహం కలిగింది.

"మీరు చెప్పింది కట్టుకథ కాదుకదా!" అన్నాను సులభంగా.

రాజారామ్ గంభీరంగా చిరునవ్వు నవ్వాడు.

"మీ సందేహం కేవలం హాస్యాస్పదం. నేను చెప్పింది మరెవర్నో గురించి కాదు. అది నా స్వీయచరిత్రే! రామసుబ్బయ్య మా నాన్న. అతని కొడుకును నేనే. ఇదిగో! చూడండి–నా కృత్రిమమైన కాలు" అంటూ రాజారామ్ ప్యాంట్ పైకితీసి మోకాలిక్రిందనుంచి తగిలించికున్న ప్లాస్టిక్ కాలును చూపెట్టాడు.

నేను అప్రతిభురాల్ని అయాను. ఆ కాలు కొంత స్టీలుతోనూ, కొంత లెదర్ తోనూ తయారుచేయబడి, చూడటానికి అతిభయంకరంగానూ, జుగుప్సాపూరితంగానూ వుంది. కాని ప్యాంటుక్రింద యేమీ తెలియడంలేదు.

"మీకుకూడా ఓ కాలు లేదని నేను ఊహించనేలేదు. అద్భుతంగా వుంది. మీరు చాలా సామాన్యంగానే, తేలిగ్గా నడుస్తున్నారు" అన్నాను.

"అంతే కాదు. నేను టెన్నిస్ ఆడతాను. అవసరమొస్తే పరుగెత్తుతాను. ఆ ఏక్సిడెంట్‌కుముందు ఏ ఏ పనులు చేసేవాడినో, ఇప్పుడవన్నీ చేస్తాను. నేను వ్యత్యాసాన్ని పెద్దగా ఫీల్‌కావడంలేదు. మీరుకూడా ప్లాస్టిక్ కాలును పెట్టించుకోండి. మామూలు మనిషి కాగలరు. సినిమాలకు వెళ్ళవచ్చు! షికార్లు

చేయవచ్చు; స్విమ్మింగ్‌లో పాల్గొనవచ్చు; ఏవనైనా చేయవచ్చు. పునర్జన్మ పొందినట్టే. ఇందులో బిడియానికి, నామోషీకి స్థానంలేదు. ఎవరి వీలునుబట్టి వాళ్లు బ్రతకడం ఈనాటి సమాజం ముఖ్యాంశం" అన్నాడు రాజారామ్ నన్ను మార్గానికి తిప్పుకొనే వాంఛతో.

కాని నా మనస్సు వెనక్కు పీకుతూనే ఉంది. చీరెక్రింద కృత్రిమమైనకాలు, తెలిసినవాళ్ళు యేమేమో అనుకుంటారు. నవ్వుతారు. నా యెదుటే గుసగుస లాడతారు. ప్లాస్టిక్ కాలుతో సినిమాలకూ, షికార్లకూ, స్విమ్మింగ్‌కూ తిరిగేదా? రాజారామ్ ఎంత బోధిస్తూన్నా నా మనస్సు ఆ ప్రక్కకు మొగ్గటంలేదు. కృత్రిమమైన జీవితాన్నీ, అనుభవాలనూ నే నెప్పుడూ కోరను.

"మీ రెన్నైనా చెప్పండి. నా మన స్సెందుకో ఒప్పుకోవటంలేదు" అన్నాను నైరాశ్య ధోరణిలో.

"అక్కడే మీరు పొరబడుతున్నారు. మీ మనస్సును నేను కనిపెట్టాను. ఒక నిశ్చయానికి రాలేకపోతున్నారు. మనస్సెప్పుడూ అంత పెళుసుగా ఉండరాదు. దృఢమైన మనస్సే దృఢమైన నిర్ణయాలకూ దారితీసి, జీవితమార్గాన్ని నిర్దుష్ట పర్చుకోగలదు. మీకు అంతగా యిష్టంలేకపోయినా, నా మాటలపై విశ్వాసాన్ని వుంచి, ప్రయత్నించండి. మీకు వీలుగాఉంటే ఆ కాలు అట్లేపెట్టుకోవచ్చు. వీలుగా లేకపోతే తీసివేసికోవచ్చు. ఇందులో పోయేదేమీ లేదు" అన్నాడు రాజారామ్ మొహాన్ని సీరియస్‌గా పెట్టి.

నేనేం మాట్లాడలేదు. బరువుగా నిట్టూర్పువిడిచి ఊరుకున్నాను.

నా మౌనాన్ని అంగీకారంగా తీసికొని, రాజారామే కుర్చీలోంచి లేచి, జేబు లోంచి టేపుతీసి నాకాలి కొలతల్ని తీసుకున్నాడు. మనస్సులో 'అక్కర్లేదు!' అనుకున్నా, పైకి చెప్పలేకపోయాను. అతని మాటల మలయానిలానికీ, మంచి తనానికీ, ఆకర్షణకూ లొంగిపోయానన్నమాట!

"నాలుగు రోజుల్లో మళ్ళీవస్తాను" అంటూ నా దగ్గర సెలవు తీసికొని వెళ్ళి పోయాడు రాజారామ్.

వీల్‌కుర్చీలో కూర్చొని అతను నా పథంనుంచి తొలగిపోయే వరకూ అదే చూశాను. నే నంటే యింత ఆసక్తి అభిమానమూ దేనికి? నన్ను నమ్మించ టానికి శ్రమపడాల్సిన అగత్యమేముంది? నాపై జాలీ, సానుభూతీ అతనిలో ఓర్పును ద్విగుణీకృత పరుస్తూన్నదా? లోకంలో ఇట్లాంటి వ్యక్తు లెంతమంది వుంటారు? నా అందాన్నీ, ఆస్తినీ, స్విమ్మింగ్‌లో నాకు గల ప్రావీణ్యతనూచూసి

నన్ను సాగర్ ప్రేమించాడు, అతన్ని నేను ప్రేమించాను. కాని ఆ ప్రేమ నీటిమీద వ్రాతే అయింది నాకు క్యాన్సర్ రావడంతో. ఒకకాలు తీసివేయ బడటంతో—సాగర్ నాపై ప్రేమను వొదులుకున్నాడు. ఆ స్మృతుల్ని శాశ్వతంగా హృదయాంతరాళాల్నుంచి తొలగించుకోవటానికి మరో యువతిని వివాహం చేసికున్నాడు. ఇప్పుడు నన్నెవరైనా ప్రేమించగలిగితే, వివాహానికి సిద్ధపడితే—నా పరిస్థితినంతా తెలుసుకునే నన్ను ప్రేమిస్తారు; వివాహం చేసుకుంటారు. ఇందులో వాళ్ళకి ఆశాభంగమూ, మోసమూ, విధివంచనా ఏమీ ఉండవు. పువ్వువేసిన చెట్టు మంచి పండును ప్రసాదిస్తుందో, చెట్టునే కాయ కుళ్ళిపోతుందో ముందు చెప్పడమెలా? పువ్వునుచూసి చెట్టును ప్రేమిస్తే, ఆ పువ్వు చెడిపోయిన ఫలాన్ని ప్రసాదిస్తే, బాధాకారణం కావచ్చు. కాని ఆ చెట్టునుంచి చెడిన ఫలాన్ని స్వీకరించే వాళ్ళు కూడా ఆ విధంగానే బాధపడరు.

## 11

నాలుగురోజులు గడిచాయి. అప్రయత్నంగానే రాజారామ్ కోసం యెదురు చూశాను. ఆ ఆవశ్యకత నాలో యేర్పడుతుందని కలలోకూడా అనుకోలేదు. ఎంతోదూరాన మసక మసగ్గావున్న దృశ్యం సమీపించినట్లయింది. ఒక్కొక్కప్పుడు మన కాళ్ళదగ్గరున్న మనుష్యుల్ని గమనించకుండా నునుపైన దూరపు కొండల్లాగ దూరంగావున్న వాళ్ళకేసే హృదయానురాగాన్ని పెంచుకుంటాం. దగ్గరకు వెళ్ళాక ఆ కొండలూ మామూలు కొండలేనని తెల్సుకున్నాక విచారిస్తాం. వంచించబడ్డామని విలపిస్తాం సాగర్ విషయంలో నాకు మిగిలిన అనుభవమిదే!

రాజారామ్ కోసం నేనెందుకు ఎదురుచూడాలి? అని నాకు నేనే ప్రశ్నించుకున్నాను. కాని జవాబు ఖచ్చితంగా చెప్పుకోలేకపోయాను. నాలో ఏవో బలహీనతలు ప్రవేశిస్తూన్నట్టు భయమేసింది. మళ్ళీ అగాధంలోకి పడటానికి సిద్ధమౌతున్నానేమో! నిరీక్షణలోనే స్త్రీ జీవితం ఎక్కువగా గడిచిపోతుందేమో! కన్యగా, భార్యగా, తల్లిగా—జీవితంలో స్త్రీ పురుషునికంటె అధికంగా దేని కోసమో ఎదురుచూస్తూంటుంది. కాని నేనింకా కన్యనే! ఎదురు చూడాల్సిన బ్రతుకు నాకింకా చాలా ఉంది.

ఏమైనా రాజారామ్ రాకపైనే అప్రయత్నంగా నా దృష్టి కేంద్రీకృతమైంది. అతని మాటలూ, రూపమూ, చొరవా, నన్ను గురించి అతను తీసుకుంటూన్న

శ్రద్ధా—పదేపదే మనస్సులో కదులాడసాగాయి. కృత్రిమ అవయవాలను గురించికూడా నా దృక్పథం మారజొచ్చింది. దాన్ని నేను ఎందుకు ద్వేషిస్తున్నానో ఖచ్చితంగా ప్రశ్నించుకుంటే సరిగ్గా జవాబు చెప్పలేకపోయాను. ఇతర్లు అపహసించి పోతారన్నది బలమైన కారణంగా తోచలేదు. ఒకరికి జీవిత గమనాన్ని సుగమపర్చేది మరొకరికి నవ్వు కలిగించేదైనప్పటికీ, దాన్ని పొందడానికి ఆ వ్యక్తి ఎందుకు భయపడాలో, చిన్నతనాన్ని పొందాలో అర్థంగాలేదు. బ్రతుకును సుఖమయం చేసికోవడానికి మానవుడు అనేకమైన మార్గాలను తొక్కతాడు; ప్రతిమార్గానికీ తనకు తాను నమ్మకాన్ని కలిగించుకొని, సమర్థించుకునే శక్తి పెంపొందించుకుంటాడు. అందుచేత 'ఆర్టిఫిషియల్ లెగ్'ను తగిలించుకోవటమే నాకు ప్రస్తుతానికి ఉత్తమంగా తోచింది. జీవితం చుట్టూ ముళ్ళ కంచెలా పెరిగిన ఈ అనిశ్చితస్థితినుంచి తప్పుకోవడానికి అదొక మార్గంలా కనబడింది నాకు. ఆ పెట్టుడుకాలు ఎంతరోతగా ఉన్నప్పటికీ, ఎంత మంది నవ్వులకు ఆస్కారమైనప్పటికీ— స్వేచ్ఛగా, ఉషారుగా, కలిసిమెలిసి తిరిగే అవకాశం కలుగుతుందనే ఆశ ఆలోచించుకున్న కొద్దీ వృద్ధిచెందింది. అందు చేతనే రాజారామ్ రాకకోసం తీవ్రంగా ఎదురుచూడ సాగాను.

ఎదురు చూడటంలో నా ఓర్పును ఏక్కువగా హరించకుండానే రాజారామ్ అయిదోరోజు ఉదయం తొమ్మిదిన్నర గంటలకు ఏకంగా ఆర్టిఫిషియల్ లెగ్‌ను వెంటతీసుకొని వచ్చాడు. నాకు విపరీతమైన ఆశ్చర్యమేసింది.

"నేను ఒప్పుకోలేదుగదా! ఏకంగా మీరు పరికరాలతోనే వచ్చేశారే" అన్నాను కనుబొమలు పైకెత్తి.

అతను చాలా మృదువుగా చిరునవ్వు నవ్వాడు.

"మీ ఆలోచనా శక్తిపై నాకు గాఢవిశ్వాసముంది. ఈపాటికి ఆలోచించుకొని, మనస్సు మార్చుకొని, ఆర్టిఫిషియల్ లెగ్‌ను పెట్టించుకోనటానికి సిద్ధంగా ఉండి వుంటారని వూహించాను; నా వూహ అక్షరాలా కరక్టే అనుకుంటాను. ఏమంటారు?"

నునులేత సిగ్గుతో నా బుగ్గలు గులాబీపూలరేకులైనాయి. మాట్లాడలేక పోయాను. ఎదురుచెప్పడానికి వాక్కు సహకరించలేదు. నా మౌనాన్ని పూర్తి అంగీకారంగా తీసుకొని, ఆర్టిఫిషియల్‌లెగ్‌ను నా కాలుకు తగిలించడానికుద్యుక్తుడైనాడు.

నేను కళ్ళుమూసికొని వీల్‌చైర్‌లో కూర్చున్నాను—ఆకాలు మీద నాకేమీ అధికారం లేదన్నట్టు.

కాని అతను ఆర్టిఫిషియల్ లెగ్‌ను బిగిస్తూన్నప్పుడు చచ్చే నొప్పివేసింది. కెవ్వున కేకబెట్టాను. "వొద్దు. వొద్దు. తీసివేయి!" అని అరిచాను. నా గొంతులో ఎక్కడలేని కాఠిన్యత ప్రవేశించింది.

కాని నా అరుపుకు రాజారామ్ రవ్వంతకూడా బెదిరినట్టు కనబడలేదు.

"మొదట్లో కొంచెం బాధగానే వుంటుంది, మరి. ఓర్చుకోవాలి. దేనికైనా ఓర్పే ముఖ్యం. ఆ కాలుతోనే నడవాల్సిన ఆగత్యముంటుంది. పోను పోను, కుదుటపడి నొప్పి క్రమేపీ తగ్గిపోతుంది. ఇప్పుడు బాధ అనిపించినా, రాను రాను అందులో సుఖం తెలిసివస్తుంది. ఆర్టిఫిషియల్‌లెగ్ 'సెట్' అయ్యేవరకూ 'క్రచెస్' సహాయంతో నడవడం నేర్చుకోవాలి" అన్నాడు రాజారామ్ దృఢంగా.

'నాకు ఆర్టిఫిషియలులెగ్ వొద్దు. ఈ కొత్తబాధకు నేను తట్టుకోలేను' అని నిర్మొహమాటంగా చెబుదామనుకున్నాను. కాని అతని చూపులోని వింత ఆకర్షణ నన్ను బంధించింది; నానోటికి నేర్పుగా తాళం వేసింది; నన్ను బుజ్జగించింది. అతను ఆర్టిఫిషియల్‌లెగ్ బిగించాక, క్రచెస్‌ను భుజాలక్రింద వూతంగా పెట్టుకొని, లేచి నిలబడ్డాను. నొప్పితో నా కళ్ళవెంట నీళ్లు గిర్రునతిరిగాయి. అమ్మ ప్రక్కన నిలబడి చోద్యంచూసినట్టు చూడసాగింది. ఆవిడ మొహంలో యేమాత్రం సానుభూతిరేఖలు లేవు. రెండడుగులు ముందుకు వేయబోయి, బొక్కబోర్లా పడబోయాను. కాని రాజారామ్ నన్ను పట్టుకున్నాడు. లేకుంటే నా మొహం పండిన రాంములక్కాయలాగ చితకడమో, రెండో కాలుకూడా విరగడమో జరిగివుండేవి. దేవుడిలాగ అడ్డుపడ్డాడు ఆ విపత్సమయంలోకూడా అతని చేతులు నా భుజాన్ని స్పృశించేసరికి నా వొళ్లు అదోరకమైన అనుభూతికి గురైంది.

"ఇంకేం లాభం లేదు! నేను ఇట్లా నడవలేను. మీకు నాపై కాస్తయినా దయ లేదా?" అన్నాను చిరునవ్వుతో.

"అయితే, పెట్టినకాలు తీసివేయమంటారా?" కటువుగా అన్నాడు రాజారామ్.

నేను విస్తుపోయి అతనికేసి అమాయకంగా చూశాను.

"మీరు కేవలం పిరికివారు. బ్రతుకును గురించి తెగింపులేదు. అధైర్యంతో చీకట్లో బ్రతకడం అవివేకుల లక్షణం. ధైర్యం, విశ్వాసమూ, సంకల్ప బలమూ

వుంటే మనిషి బ్రతుకును చేతిలో బొమ్మ చేసుకోవచ్చు!" అన్నాడు రాజారామ్ ఆవేశంగా.

నేను పిరికిదాన్నా! నాకు బ్రతుకును గురించి తెగింపు లేదూ!... నాలో ఉక్రోషం ఉవ్వెత్తునపొంగి, నూతనోత్సాహాన్ని ఉరకలెత్తించింది. పళ్లు బిగబట్టి, సంకల్ప దీక్షతో, మొండి విశ్వాసంతో, గుండెధైర్యంతో మళ్ళీ ప్రయత్నించాను. ఈసారి క్రిందపడకుండా 'క్రచెస్' ను ఆధారం చేసుకున్నాను. ఆ రోజు రాజా రామ్ వెళ్ళేలోపుగా, అతికష్టంమీద, బాధనంతా కడుపులో కుక్కుకుంటూ, క్రచెస్ సహాయంతో గదిలో అటూ ఇటూ నడవగలిగాను. కాని రాజారామ్ తొలినాటి నా కృషికి మాటమాత్రంగానైనా మెచ్చుకోలేదు. "ఫర్వాలేదు. మళ్ళీ నేను వచ్చేదాకా, ఇట్లానే ప్రాక్టీసుచేస్తూ వుండండి!" అన్నాడు.

తర్వాత వారానికి రెండుమూడుసార్లు రాజారామ్ వస్తూవుండేవాడు. వచ్చి నప్పుడల్లా ఓ గంటసేపు క్రచెస్‌మీద నడిచే తర్ఫీదు యిస్తూండేవాడు ఎట్లాగైతేం ఓ నెల రోజులకు క్రచెస్‌తో బాగా నడిచేస్థితికి వచ్చేను. మేడక్రింది భాగమూ, గార్డెనూ తిరగసాగాను. ఒకరోజున వచ్చి, ఆ క్రచెస్ లాగివేసి, "అవి లేకుండా స్వంతంగా నడవడం నేర్చుకోండి?" అని ఆజ్ఞాపించాడు. రాజారామ్

నాకు చెడ్డకోపం వచ్చింది.

"మీ ఉద్దేశ్య మేమిటి? నేను జన్మలో నడవలేకపోతే మటుకు మీకు కలిగే నష్ట మేమిటి?" అన్నాను కోపాన్ని అణచుకోలేక.

అప్పుడే పూచిన గులాబి చల్లగాలికి మెల్లగా వూగినట్టు కులాసాగా చిరునవ్వు నవ్వాడు రాజారామ్.

"అయితే అవిటి మనిషిలాగా మంచంపైన ముడుచుకు పడుకోండి!" అన్నాడు వ్యంగ్యాత్మకంగా; నన్ను ఉడికించే ధోరణిలో.

మళ్ళీ నాలో ఉక్రోషం కత్తిలా పొడుచుకొచ్చింది. అతనిచేత ఎగతాళి చేయించుకోవడం, నవ్వించుకోవడం, వ్యంగ్యాత్మకంగా మాటలనిపించుకోవడం నా కిష్టంలేదు. కాబట్టి క్రచెస్ లేకుండానే నడవడానికి ప్రయత్నించాను, క్రింద పడ్డాను. లేచాను. మళ్ళీ పడడం, లేవడం, చిన్నచిన్న దెబ్బలకు ఓర్చుకోవడం, విశ్వాసాన్ని వృద్ధిచేసికోవడం, మళ్ళీ ప్రయత్నించడం - ఆ విధంగా ప్రాక్టీసు చేయసాగాను. ఓ సారి రాజారామ్ ప్రక్కనుండగానే గార్డెన్‌లో పడ్డాను. గులక రాయి పొడుచుకొని మోచేయి దోక్కుపోయి కొంచెంగా రక్తంకూడా వచ్చింది.



"మిస్ సరితా! ఇది చాలా కష్టంతో కూడుకున్నపని అని నాకు తెలుసు. నేనూ ఈ కష్టాన్ని పడ్డాను. ఎన్నో దెబ్బలకు ఓర్చుకున్నాను. భగవంతుడు ప్రసాదించిన శక్తి గనుకలేకపోతే, ఈ స్థితికి వచ్చివుండేవాణ్ణికాదు. ఆ శక్తి కోసం ప్రత్యేకంగా భగవంతుణ్ణి ప్రార్థించండి. నేనూ అల్లాగే ప్రార్థనలు జరిపే వాణ్ణి" అన్నాడు రాజారామ్.

"ప్రార్థనలనుగురించి డాక్టర్ రామన్‌గారికిమల్లేనే మీకూ పిచ్చివుంది. కాని నాకు వాటిల్లో నమ్మకంలేదు. నాకు సహాయపడేవారెవరూలేరు. నాకు నేను సహాయపడవల్సిందే! ఆ విషయం నాకు తెలుసు" అన్నాను.

కాదన్నట్టు రాజారామ్ తల ఆడించాడు. "అట్లా ఎన్నటికీ కాదు. మీరు పొరబడుతున్నారు మిస్, సరితా! కేవలం పొరబాటే! నేను ఏ వందసార్లో చేతులు జోడించి భగవంతుణ్ణి ప్రార్థించాను — పునర్జన్మను ప్రసాదించమని. నా ప్రార్థనల్ని భగవంతుడు ఆలకించి, ఆ శక్తిని నాకు ఇచ్చాడు. మీరు ఒప్పుకున్నా, ఒప్పుకోకపోయినా — భగవంతుని కరుణాదృష్టి మీ కెంతో అవసరం!"

రాజారామ్ మాటలు నా బుర్రకెక్కలేదు. ఎందుకంటే ప్రార్థనలమీద మొదట్నుంచీ నాకు విశ్వాసంలేదు. కొంతమందికి గాఢమైన విశ్వాసమున్నదంటే,

అది వేరేవిషయం. వారి ఆత్మ శక్తియుక్తులపై ఆధారపడివుంటుంది. కాని నేను వందసార్లు రాజారామ్‌కు చేతులెత్తి దణ్ణంపెట్టి వుండాల్సింది. అతని ప్రోద్బలం వల్లనూ, ఉపదేశాల ఫలితంగానూ, కృషిచేతనూ ఇప్పుడు వంకరగానైనా నడువ గలుగుతున్నాను ఆపరేషనుచేసి కాలు తీసివేశాక, ఎప్పుడైనా మళ్ళీ జీవితంలో నడిచే, నడవగల్గే అవకాశం వస్తుందని కలలోనైనా ఊహించానా?

నాన్నగారితో చెప్పి ఓ టైపు మిషనూ, పాఠ్యగ్రంథమూ తెప్పించాను టైపు నేర్చుకొనేందుకు. జీవితంపై నాకు విశ్వాసమూ, మమకారాలూ, ఆప్టిమిజమూ రోజు రోజుకూ పెరుగుతున్నాయి. కాని మా అమ్మ నా ఆలోచనలకు సడన్ బ్రేకు వేసింది.

"జీవితంలో నీకు ఉద్యోగం చేయాలనే కాంక్ష ఉన్నట్టుంది. అంత ఖర్మేం గాలింది! అనుభవించడానికింత ఆస్తి వున్నప్పుడు ఆడదానివీ, అందులో అవిటి దానివీ ఉద్యోగాలుచేసి ఊళ్ళు ఏలతావా? ఆఫీసులో నువ్వు ఉద్యోగం ఈ జన్మకు చేయలేవు. సిటీబస్సుల్లో ఎక్కిదిగటమూ, ఆఫీసు భవనాల మెట్లు యెక్కిదిగటమూ - నీబోటివాళ్ళకు వీలయ్యేవనా? ఎందుకొచ్చిన శ్రమా, షోకా! నీకు ఒకకాలు అవుడు అన్న విషయం జీవితాంతమూ గుర్తుపెట్టుకొని ప్రవర్తించాలి. ఏ ఆలోచనచేసినా ఆ సంగతి మరువరాదు."

ఆవిడ మాటల్లో నిజంలేకపోలేదు. ఎంత ఆస్తీ, డబ్బూ వున్నప్పటికీ, చదువుకున్నందుకు ఉద్యోగం చేద్దామనుకుంటేమటుకు, ఆ రాత నుదుట లిఖించబడి వుండొద్దూ! కుంటిదాన్ని నేను. నన్నెవ్వరు, ఏ ఆఫీసులోకి తీసుకుంటారు? నాన్నగారు తల్చుకుంటే నాకు ఉద్యోగం వేయించలేకపోతారా? అయినా నాన్నగారు నేను ఇతర్లక్రింద ఉద్యోగం చేయడానికి ఒప్పుకుంటారా? ఛి ఛీ! ఎంత పిచ్చిగా ఆలోచించాను. అసలు ఉద్యోగానికి నే నెట్లా అర్హురాల్ని! — అనుకున్నాను. నన్ను నేను నిందిందుకుంటూ ఆశలన్నీ దిగజారిపోగా.

వెంటనే టైపురైటర్ను సెకండుహ్యాండు మార్కెటుకు పంపించి, ఆ పాఠ్యగ్రంథాన్ని చెత్తబుట్టలోకి విసరివేశాను.

## 12

ఓ రోజు ఉదయం రాజారామ్ హడావుడిగా వచ్చాడు. మంచి డ్రస్సులో అందంగా మెరిసిపోతున్నాడు.

"ఏమిటి విశేషం!" అన్నాను.

"మిస్ సరితా! మీకో కొత్త ప్రదేశం చూపెడతాను. వెళదాం రండి!" అన్నాడు రాజారాం ఉత్సాహంగా.

"ఎక్కడ?"

"ఓ పదిమైళ్ళ దూరముంటుంది. మీలాంటివారే చాలామంది అక్కడుం టారు. వాళ్ళంతా మీ మాదిరిగానే జీవితంలో సంఘర్షణకు గురవుతూన్నవాళ్ళే!"

కొత్త ప్రదేశాలకూ, కొత్తమనుషుల మధ్యకూ నేను రానని మీకు తెలుసు గదూ!"

"వినండి! మీరు అహర్నిశలూ ఇంట్లో కూర్చున్నదువల్ల ప్రయోజనంలేదు. మిస్ సరిత అజ్ఞాతవాసం ప్రపంచానికి ఎబ్బెట్టుగా వుంటుంది. మీరు మళ్ళీ టవున్లో తిరుగుతూ, అందరికీ ఆశ్చర్యాన్ని కలిగించాలి. సాంఘిక జీవనంలోని సుఖ దుఃఖాల్ని నలుగురితో పాటూ పంచుకోవాలి."

"నేనుతప్ప మీ కెవ్వరూ కష్టమర్సులేరా? ఎప్పుడూ నా దగ్గరికే వస్తూ, నన్నే హింసిస్తూ వుంటారేం!" అన్నాను అధికమైన కోపాన్ని నటిస్తూ.

"ఎందుకంటే, మిగతా నా కష్టమర్సు ఎవ్వరూ మీలాగా గట్టివాళ్ళుకాదు." అన్నాడు రాజారామ్ పిచ్చిగా నవ్వుతూ.

నేనేం మాట్లాడలేదు.

"మీరు మర్యాదగా నా వెంట వస్తారా, లేదా అమాంతంగా యెత్తుకెళ్ళి కార్లో కూర్చోబెట్టమంటారా?"

అతనికేసి చురచుర చూశాను. నాలో కోపం గట్లులేని ప్రవాహంపగిది పగ వళ్ళు తొక్కుతోంది. అతను అన్నంతపనీ చేశాడు. నన్ను బలవంతాన కారు దగ్గరకు తీసికెళ్ళాడు. నేను కార్లో ఫ్రెంట్సీట్లో కూర్చోబోతుండగా, ఆర్టిఫిషి యల్ లెగ్ డోర్కు తగిలి విపరీతమైన బాధను కలిగించింది. "అబ్బో!" అన్నాను బాధ కోర్చుకోలేక.

కాని రాజారామ్ మందహాసం చేసాడు.

"ఏం ఫర్వాలేదు. కారులోకి ఎక్కడానికీ, దిగడానికీ ప్రత్యేకమైన నేర్పు కావాలి. అలవాటుమీద అదే పట్టువడుతుంది."

నేను ఇల్లు బయలుదేరివెళ్ళి ఎన్నో యుగాలైనట్లుంది. లోలోపల అయిష్టంగా వున్నప్పటికీ, కారు బయలుదేరి, చుట్టూ ప్రపంచాన్ని వీక్షిస్తూన్నకొద్దీ, కొత్త ఉత్సాహమూ, ఆలోచనలూ వొచ్చి, మనస్సుకు విశ్రాంతినీ, ఆనందాన్నీ కలి గించసాగాయి. కొంతదూరం పోయాక, రాజారామ్ ఓ రెస్టారెంట్ ప్రక్కన

కారు ఆపి, కాఫీ తెచ్చియిచ్చాడు. అక్కర్లేదన్నకొద్దీ బలవంతంచేశాడు కాఫీత్రాగ మని. ఎల్లాగో కాఫీ చప్పరించాను.

తర్వాత అయిదారుమైళ్లు పోయాక, ఇరుప్రక్కలా ఎత్తైన చెట్లవరుసవున్న రోడ్డువొచ్చింది. ఆ ప్రకృతిదృశ్యం కనుల కింపుగావుంది. నా మనస్సు ఆహ్లాదంతో వూగిపోయింది. కొత్తలోకంలోకి కొత్తగా వొచ్చినట్లుంది. మరికొంత దూరం పోయాక, చుట్టూ చెట్ల ఆవరణ కలిగివున్న పెద్ద బిల్డింగ్ కనబడింది రోడ్డుప్రక్కన. దాని దగ్గర రాజారామ్ కారు ఆపాడు.

"ఏమిటి, ఇక్కడ ఆపారు?" అన్నాను ఆశ్చర్యంగా.

"ఇది వికలాంగులైన పిల్లల గవర్నమెంటు హాస్పటల్" అన్నాడు రాజారామ్ కారులోంచి క్రిందికి దిగుతూ.

"ఇక్కడికి నన్నెందుకు తీసికొచ్చినట్టు?" అన్నాను మొహాన్ని పెద్ద ప్రశ్న మార్కులో బిగించి.

"మీరు ఓసారి చూస్తారని. చూడవల్సిన ఆగత్యమెంతైనా వుంది. ఇది సరైన టైముకూడాను." అన్నాడు రాజారామ్ కారు డోరు తెరిచి.

నేను కొంచెం శ్రమతో కారులోంచి క్రిందికి దిగాను. అతనేమో చేయి అందివ్వలేదు. పరిశీలనా దృష్టితో దీర్ఘంగా నాకేసి చూస్తూనే నిలబడ్డాడు. నా గుండెలో కోపజ్వాలలు మిన్నుముట్టుతున్నాయి.

"ఇక్కడకు నేను తరుచూ వస్తూనేవుంటాను. చాలామంది పిల్లలకు ఆర్టిఫిషియల్ లింబ్స్ పెట్టాను నేను." అన్నాడు రాజారామ్ ముందుకు నడుస్తూ.

ఆ పెద్ద భవనంలోని వరండాల్లోంచి మేము నడుస్తూండగా, మమ్మల్ని చాలా మంది పిల్లలూ, పెద్దలూ నమస్కారాలతో సత్కరించారు. పూర్వపరిచయం వున్నట్లే, ఆప్యాయంగా, గౌరవంగా, భక్తిపూర్వకంగా, ఉత్సాహంగా, చిరునవ్వు మొహాలతో నిశ్శబ్దంగా స్వాగతం పలికారు. నాకు తగని ఆశ్చర్యమేసింది— నన్ను చూసి వాళ్ళంతా ఎందుకు విస్తుపోవడంలేదు? రాజారామ్ నన్ను లోపలి పెద్ద గదుల్లోకి తీసికెళ్ళాడు. అవి ఎంతో విశాలంగా, రంగురంగులతో అలంకరించబడి, చూడముచ్చటగా వున్నాయి. ఆ గదుల్లోని దృశ్యాల్ని చూసేటప్పటికి నా హృదయం బాధాపూర్ణంతో మెలికలు తిరిగిపోయింది. వికలాంగులైన వందలాది పిల్లలు చేతులూ, కాళ్ళూ, చెవులూ, ముక్కులూ, నోళ్ళూ, మెడలూ, నడుములూ వంకరపోయి, ఆర్టిఫిషియల్ లింబ్స్ తగిలించుకొని, వాటికి అలవాటుపడలేక, నొప్పితో బాధపడుతూ, అయినప్పటికీ ధైర్యంతో, విశ్వాసంతో




ఉత్సాహంతో నడవటానికి ప్రయత్నాలుచేస్తూ, బ్రతుకుపై ఆశతో తంటాలు పడుతున్నారు. పాపం! పసిపిల్లలు. భగవంతుడు వాళ్ళ కీ దుస్థితి కల్పించి, సంఘర్షణకు గురిచేసి, వాళ్ళ ధైర్యాన్ని, బ్రతుకుపై మమకారాల్ని పరీక్ష చేయడం ఏం న్యాయం? ఏం ధర్మం? ఆ హృదయవిదారకమైన దృశ్యాలకు నా మనస్సు చప్పగా కూలిపోయింది.

వడిగా నడవడంవల్ల ఓ ప్రక్క నా కాలు విపరీతమైన బాధను కలుగజేస్తోంది. రెండో ప్రక్క ఆ పసిపిల్లల దారుణవిధికి హృదయంలో సానుభూతి వరద వెల్లువలా పొంగుకొస్తోంది. నా మొహంలోని అలజడిని రాజారామ్ కని పెట్టాడు. నా చేతిని పట్టుకొని, భవనంముందున్న లాన్‌లోకి తీసికెళ్ళాడు. ఆ లాన్ ప్రక్కనే 'స్విమ్మింగ్ పూల్' ఉంది. దాని ఒడ్డున కుర్చీలో నన్ను కూర్చుండబెట్టి 'సరితా! ఇక్కడ కూర్చుని విశ్రాంతి తీసుకో!' నేనే 'కూల్ డ్రింక్' పట్టుకొస్తాను' అంటూ దగ్గరలోవున్న క్యాంటీన్‌కేసి వెళ్ళాడు రాజారామ్.

ఆ కుర్చీలో కూర్చుని చుట్టూ ప్రదేశాన్ని తిలకించాను. ఎంతో ప్రశాంతంగా, మనోహరంగా వుంది. స్విమ్మింగ్‌పూలో కొంతమంది పిల్లలు ఈదుతున్నారు. వాళ్ళంతా కొత్తగా నేర్చుకుంటూన్నట్లుంది. వింత ఏమిటంటే—వాళ్ళంతా ఏదో రకంగా వికలాంగులే. వాళ్ళమధ్య ఈతనేర్పే ఓ యువతి ఉన్నది. ఆమెకు తన వయస్సే వుంటుంది. కాని మనిషి కొంచెంలావు. బేతింగ్ సూట్‌లో అసహ్యంగా వుంది. ఆ సూట్‌లో ఇదివరకు నేనెంత అందంగా వుండేదాన్ని! ఆ భావన రాగానే నా మనస్సు ముల్లుగుచ్చుకున్నట్టు కళుక్కుమన్నది. ఆ రోజులు వేరు. మళ్ళీ నా జీవితంలో ఆ రోజులు వస్తాయా? అట్లా స్విమ్ చేయగలుగుతానా?...

స్విమ్మింగ్‌పూల్‌నుంచి దృష్టి మళ్ళించి, దూరానవున్న పచ్చని చెట్లకేసి చూస్తూ ఆలోచించసాగాను.

అంతలో ఒక్కసారి ప్రమాదభరితమైన కేకలు వినబడ్డాయి. గబుక్కున 'స్విమ్మింగ్ పూల్' కేసి చూశాను ఓ పిల్లవాడు మునిగిపోతున్నాడు. ఈతనేర్పే యువతి ఆ పిల్లవాణ్ణి రక్షించడానికి సతమతమవుతూంది. తన అశక్తతను తెలియజేస్తూ కేకలుబెడుతూంది. "రాజారామ్! రాజారామ్" నేనూ కేకలు పెట్టసాగాను తెలీని ఆవేశంతో.

కాని రాజారామే కనుచూపుమేరలో లేడు. దగ్గరలో యెవ్వరూ మనుష్యులూ కూడా లేరు. అవతల రెండు ప్రాణాలు చావుబ్రతుకుల సమరంలో చిక్కుకుని ఉన్నాయి మిగతా పిల్లలంతా భయభ్రాంతులై కేకలు వేస్తున్నారు. పరిస్థితంతా గందరగోళంగా వుంది. ఏమైనా వాళ్ళని రక్షించాలి.

నేను మరో ఆలోచనలేకుండా అమాంతంగా 'స్విమ్మింగ్‌పూల్'లోకి దూకాను. ఒక కాలుకు ఆర్టిఫిషియల్ లింబ్ బెల్టుతో తగిలించివుంది. అది బాధ పెడుతోంది. అయినప్పటికీ శక్తినంతా కూడగట్టుకొని ఈదుతూ వాళ్ళదగ్గరకు వెళ్ళాను. అడుక్కు పోయిన కుర్రవాణ్ణి మునిగి పైకి తీశాను. ఆ పిల్లవాడు నా భుజాన్ని జలగలాగ అంటిపెట్టుకొని ఉన్నాడు. నీళ్ళకు నా కళ్ళు మండుతున్నాయి. కాళ్ళల్లో సత్తువ తేలిపోతోంది. చేతులు పట్టుతప్పిపోతున్నాయి. ఈత నేర్పే యువతి తన ప్రాణాన్ని కాపాడుకొనే హడావిడిలోనే వుంది. ఇంకొకర్ని రక్షించే శక్తియుక్తులు ఆమెకు లేవు. ఒకసారి రాజారామ్ చెప్పిన ఉపదేశం స్ఫురణకొచ్చింది. 'సరితా! శక్తికోసం, ధైర్యంకోసం, విశ్వాసంకోసం భగవంతుణ్ణి ప్రార్థించడం నేర్చుకో!" ఇప్పుడిహ భగవంతుని ఉనికిని గురించి సందేహాలకు ఆస్కారంలేదు. "భగవాన్! నాకు శక్తిని ప్రసాదించు. ఈ కుర్రవాని ప్రాణాన్ని కాపాడు. ఇంతకంటే నేను ప్రార్థించేదిలేదు. కోరుకొనేది లేదు!" భగవంతుణ్ణి హృదయపూర్వకంగా ప్రార్థించాను.

ఏదో అపూర్వమైనశక్తి నాలో ప్రవేశించినట్లయింది. నూతనోత్సాహం వెల్లివిరిసింది. ఒడ్డుకు చేరడానికి ప్రయత్నించాను. కుర్రవాడు నా భుజాలను గట్టిగా పట్టుకొని వ్రేలాడుతున్నాడు. అయినప్పటికీ అనూహ్యమైన శక్తి ఏదో నన్ను ఒడ్డుకు చేర్చింది. అంతలో ఇద్దరు పెద్దపిల్లలువచ్చి ఆ కుర్రవాణ్ణి ఒడ్డుకు లాగారు. నేను ఓ రెండు క్షణాలు గాలి పీల్చుకున్నాను. కాని యింకా ఆ యువతి నీటితో పోరాడుతూనే ఉంది. అధైర్యానికి గురైనట్లుంది. ప్రాణ

భయంతో తనకు వొచ్చిన ఈతనే మర్చిపోయినట్లుంది. చావుబ్రతుకుల మధ్య సహాయంకోసం అర్థించే ఓపికకూడా నశించి, మూగగా ఘర్షణపడుతోంది. ఆమెను రక్షించే తలంపుతో, మళ్ళీ ఓసారి శక్తికోసం భగవంతుణ్ణి మనసారా ప్రార్థించి ఈదుకుంటూ ఆమెదగ్గరకు వెళ్ళాను.

ఆమె సాంతం మునిగిపోయే ప్రమాదస్థితిలో వుండగా, ఆమె తల పట్టుకొని పైకి యెత్తాను. నా నడుమును వాటేసుకుంది. ఆ బరువుకు నేను ముందుకు అడుగువేయలేకపోయాను. నేనూ నీటిలో దిగిపోతున్నాను చేతులు ముందుకు సాగడంలేదు. "భగవాన్! రక్షించు. శక్తిని ప్రసాదించు" ప్రార్థించాను.

శక్తినంతా కేంద్రీకరించి ఈదడానికి ప్రయత్నించాను. కొంతదూరం యీదే సరికి నా పని అయిపోయింది. రెండు శరీరాలూ నీటిమీద తేలడానికి సిద్ధంగా వున్నాయి. సరిగ్గా అదే సమయంలో ఎవరో వ్యక్తివచ్చి ఆపద్బాంధవునిలా అడ్డు పడ్డాడు. ఆమె బరువును నానుంచి తొలగించాడు. అతను ఎవరోకాదు రాజారామ్!

నన్ను ఒడ్డుకుచేర్చి, పడకకుర్చీలో పడుకోబెట్టేవరకూ నాకు స్పృహరాలేదు. నేను త్రాగిన నీటిని రాజారామ్ కక్కించాడు. హాస్పటల్లోని నర్సులంతా నా చుట్టూ మూగారు చికిత్సకోసం.

"చాలా గొప్పపనిచేశావు సరితా! నిజంగా నీ సాహసం కొనియాడదగింది. ఇరువురి ప్రాణాలు రక్షించావు" అన్నాడు రాజారామ్.

నేను తల ఆడించి. ఆతనికేసి విస్తుపోయి చూశాను. "రాజారామ్‌గారూ! ఏం చేయాలో నాకు ఆ స్థితిలో తోచలేదు. ఆవేశంకొద్దీ, ముందూ వెనకా ఆలోచించ కుండా 'పూల్'లోకి దూకాను; యీదాను. నేనిట్లా యీదగలనని యెప్పుడూ అనుకోలేదు" అన్నాను ఆశ్చర్యచకితనై.

గర్వంగా, విజయవంతంగా నవ్వాడు రాజారామ్.

"ఇప్పుడు నువ్వు ఏపనిచేయటానికైనా సమర్థురాలవు. భయాన్నీ అధైర్యాన్నీ జయించావు డార్లింగ్!"

డార్లింగ్! రాజారామ్ నన్ను 'డార్లింగ్' అని పిలిచాడు. ఆ పిలుపులో యెంత మాధుర్యముంది? ఎంత ఆప్యాయత? ఎంత ప్రేమానురాగాలు?

"ఇంతకాలం మిమ్మల్ని అపార్థంచేసుకుంటూ వచ్చాను. నా కాళ్ళపై నేను నిలబడగలందులకే, నా శక్తిపై నాకు విశ్వాసం కలిగించడానికే—నేనెన్ని

బాధలుపడా, పట్టిపట్టనటు చూస్తూ వూరుకున్నారు మీరు. ఇప్పుడు అర్థమైంది. మీ ఉన్నతమైన ఆశయం. కాని నాలో ఇంకా పిరికిదనమున్నది!"

"నో! నో! నువ్వెప్పుడూ పిరికిదానివికాదు సరితా! ధైర్యంతోనే ఇంత కాలమూ జీవితంతో పోరాడుతూ వస్తున్నావు. నీలో నిద్రాణమైన శక్తుల్ని యిప్పటికి తెలుసుకోగలిగావు."

"రాజారామ్‌గారూ! 'పూల్ లో భయంతో, కాలూ చేయీ ఆడక-భగవం తుణ్ణి ప్రార్థించాను. మీ ఉపదేశాన్ని గుర్తుకు తెచ్చుకొని. నా ప్రార్థనల్ని భగవం తుడు ఆలకించి, శక్తిని ప్రసాదించాడు. ఆ శక్తి లేకపోతే నా సాహసానికి నేనే బలిఅయ్యేదాన్ని. భగవంతుడు సహాయంచేశాడు. నా విశ్వాసమదే!"

రాజారామ్ గంభీరంగా చిరునవ్వు నవ్వాడు.

"మన ప్రార్థనల్ని భగవంతుడెప్పుడూ ఆలకిస్తాడు. మనం విశ్వాసాన్ని కుదుర్చుకోవడంలోనే వుంది రహస్యం. మనం ప్రమాదాల్లో ఇరుక్కున్నప్పుడు, ఆ ప్రమాదాల్నుంచి మనల్ని సురక్షితంగా వొడ్డుకుచేర్చే శక్తి భగవంతుడు. అదే ఆయన ఉనికి. మాయ లీలా విశేషం. కరుణ. నేటినుంచీ నువ్వు కొత్త జీవితాన్ని ప్రారంభించవచ్చు" అన్నాడు రాజారామ్ నాకేసి ప్రేమగా, అను రాగపూరితంగా, ఆప్యాయంగా చూస్తూ.

ఆ చూపులద్వారా ఇట్టే గ్రహించాను-నా కొత్తజీవితంలో రాజారామ్ భాగస్థుడు కాగలడని. ఆ ఉద్దేశ్యంతోనే భగవంతుణ్ణి ప్రార్థించాను. బలవంతుడూ, ధైర్యస్థుడూ, సహృదయుడూ, నిస్వార్థసేవకుడూ యైన రాజారామ్ నీడక్రింద నా బ్రతుక్కి ఏ భయమూ, ఏ ఆలజడీ వుండదు. ఇట్లాంటి 'క్యాన్సర్' జబ్బులు యెన్ని వొచ్చినా ఎదుర్కోగలను! భగవంతుని దయకోసం ఎట్లా ప్రార్థనలు జరపాలో. జీవితంలో సాటివారికెట్లా సహాయపడాలో, జీవితలక్ష్యాన్ని సాధించే మార్గాలేమిటో—రాజారామ్ ఇంకా బాగా బోధించగలడు. క్యాన్సర్ వల్ల వికలాంగురాలినైనా, నా జీవితం వ్యర్థంకాదు. ఇందులోంచి మంచికోసం ప్రయత్నించే కర్తవ్యాన్ని గుర్తించగలిగితే, నాబోటి వికలాంగులకు సహాయపడ గల పరమార్థ మెంతైనావుంది భవిష్యత్తులో! అదేనా కొత్తజీవిత లక్ష్యం. ఈ లక్ష్యసాధనకు రాజారామ్‌తో చేతులు కలపాల్సిన అగత్యమెంతైనా వుంది.

"వెళదామా ఇంటికి?" అన్నాడు రాజారామ్ నా నడుంచుట్టూ మృదువుగా చేయివేసి.

ఆ చేతిలో చేయిగలిపి, అతని విశాల వక్షస్థలంపై మొహంపెట్టి, మేనుపులక రించగా, సిగ్గుతో చిరునవ్వునవ్వి. 'వెళదాం—మన యింటికి!' అన్నాను.

---



# అగ్నిమాల

వాసరి సుబ్రహ్మణ్యం

(గత సంచిక తరువాయి)

## 12

ఆరాత్రి అగ్నిపాలుడు తను నరకంలో ఉన్నంతగా బాధపడ్డాడు తను అగ్ని పాలుణ్ణని చెప్పి, వకుళమాలచు క్షమించవలసిందిగా కోరుకునే అవకాశాలను, ఒకటి రెంటిని నేజేతులా జార విడుచుకున్నాడు. నిజంగా తను అగ్ని పాలుడని తెలిస్తే, ఆమె క్షమించగల

దన్న నమ్మకం కూడా లేదు. వకుళ మాల ప్రేమిస్తున్నది విష్ణుమిత్రుణ్ణి! ఆ విష్ణుమిత్రుడు గత జీవితంలో ఏవైనా గొప్ప నేరాలూ, అత్యాచారాలూ చేసి వుంటే...బహుశా, ఆమె క్షమించగల దేమో కాని, అగ్నిపాలుడనే వ్యక్తిని ఎలా క్షమించగలదు?

రాత్రి చాలా పొద్దుపోయేవరకూ. అగ్నిపాలుడు ఇలాంటి సంశయాలతోనే నానా బాధపడి, తెల్లవారుజామును కన్ను మూశాడు. ఏ పరిస్థితులలోనూ, ఆ మర్నాటి రాత్రిని, ఆ ఇంట గడపకూడదని మాత్రం అతడు నిశ్చయించుకున్నాడు

సూర్యోదయమై బాగా పొద్దెక్కి, దాదాపు పదిగంటల కాలమైన తరవాత అగ్నిపాలుడికి మెలకువ వచ్చింది. అతడు కిటికీలోంచి తీవ్రంగా లోపలికివస్తున్న సూర్యకిరణాలకేసి ఓ మారు చూసి, చప్పున మంచంమీదలేచి కూర్చున్నాడు. పడకగది తలుపులు బార్లా తెరిచివున్నవి. కాని, ఆ ప్రాంతాన సేవకులు ఎవరూ ఉన్నట్లులేదు.

అగ్నిపాలుడు ముఖం కడుక్కొని, స్నానంచేసి దుస్తువులు మార్చుకునే సమయానికి, నౌకరు ఒకడు వచ్చి బల్ల మీద ఫలహారాలు పెట్టిపోయాడు. అంతగా ఆకలి లేకపోయినా, అగ్నిపాలుడు ఫలహారాలముందు కూర్చున్నాడు

ప్రసేనుడు మందహాసంచేస్తూ గది లోకి వచ్చాడు. కాని, అతడి ముఖభంగిమల్లో ఏదో ఆదుర్దా వ్యక్తమవుతుంది.

"విష్ణూ, నువ్వు మంచి అవకాశాన్నొకదాన్ని జారవిడుచుకున్నావ్!" అంటూ ప్రసేనుడు, అగ్నిపాలుణ్ణి సమీపించి, అతడిపక్కనవున్న కుర్చీలో కూర్చున్నాడు.

అగ్నిపాలుడు తలఎత్తి ప్రశ్నార్థకంగా చూశాడు.

"రాత్రి బాగా పొద్దుపోయింతరవాత మణిమంతుడు వచ్చాడు; వెంట అతడి కుమార్తె లలితాంగి కూడా వున్నది. ఆ సమయంలో నిన్ను నిద్రలేపటం ఎందుకులెమ్మని వూరుకున్నాం. కాని, తెల్లవారి ఒకటిరెండుసార్లు సేవకున్ని పంపినా...యింకా నువ్వు గాఢనిద్రలో వున్నట్లు తెలిసింది. మణిమంతుడు యింతకుముందే బయలుదేరి వెళ్ళిపోయాడు. అతడు, నీకిమ్మని యిచ్చిన ఉత్తరం యిది!" అంటూ ప్రసేనుడు ఒక ఉత్తరాన్ని అగ్నిపాలుడికి అందించాడు.

ఆ ఉత్తరాన్ని అందుకునేటప్పుడు అగ్నిపాలుడి చేతులు అప్రయత్నంగా వణికినై. తనకు ఒక పెద్ద గండాన్నుంచి ఏ దేవతో రక్షించిందని అతడను కున్నాడు ఈ వచ్చిన మణిమంతుడు, విష్ణుమిత్రుడిని బాగా ఎరిగివున్నవాడు. విష్ణుమిత్రుడు తన తుదిక్షణాల్లో,

తనకు ఒక నెలరోజుల్లో వివాహం జరిగి వుండేదని చెప్పి, ఆ కాబోయే భార్య పేరు చెప్పకుండానే మరణించాడు. బహుశా, ఆ యువతి యీ లలితాంగే అయివుండొచ్చు!

నిజంగా, ఆ మణిమంతుడు వచ్చి నప్పుడు తను మేలుకునే వున్నట్టయితే యీ సరికి తన బ్రతుకు ఏమయివుండేది?

హఠాత్తుగా అగ్నిపాలుడికి లలితాంగి విషయం గుర్తుకొచ్చింది. బయలుదేరి వెళ్ళిపోయింది మణిమంతుడొక్కడే నేమో! ఒకవేళ లలితాంగి యీ ఇంటనే వుండివుంటే?

"లలితాంగి ఎక్కడున్నది?" అని అడిగాడు అగ్నిపాలుడు, తన భయాన్ని బయటికి కనబరచకుండా.

"తండ్రితోనే వెళ్ళిపోయింది," అన్నాడు ప్రసేనుడు.

"ఇద్దరూ అంత హడావిడిగా వెళ్ళి పోవటం..."

ప్రసేనుడు వేలితో సౌంజ్ఞచేసి, గొంతుస్థాయి తగ్గించి," మణిమంతుడి కోసం నవబోజుడి సైనికులు యీ ప్రాంతాలన్నీ గాలిస్తున్నారు. ఆ కారణం వల్ల, అతడిక్కడ అట్టేకాలం వుండటం క్షేమంకాదనుకున్నాడు. కాని, వచ్చి నప్పుడు నాతో అన్నదేమంటే, ఇవాళ చీకటిపడేవరకూ యిక్కడేవుండి, తను ముందుగా బయలుదేరిపోతాననీ, లలితాంగిని యిక్కడే వుంచుతాననీ. కాని, ఏ కారణంవల్లనో తెల్లవారి అభిప్రాయం మార్చుకున్నాడు. కుమార్తెతో కూడా వెళ్ళిపోయాడు. ఈ సంగతి చాలా రహస్యం. నా నౌకర్లెకరికీ, అతణ్ణి గురించిన పూర్తి సమాచారం తెలియదు," అన్నాడు.

"ఈ ఉత్తరం యివ్వటమేనా, మరే మైనా చెప్పాడా?" అని అడిగాడు అగ్ని పాలుడు.

"ఈ ఉత్తరం ఒకటే యిచ్చాడు. అదీ, తీరా బయలుదేరేముందు హడా విడిగా రాశాడు. కారణం ఏమిటో తెలియ లేదుగాని, ఎటువంటి విపత్కర పరి స్థితుల్లోనైనా, ప్రశాంతంగా వుండే అతడు... ఎందుకో చాలా ఉద్రేకపడు తున్నట్లు కనిపించాడు," అన్నాడు ప్రసేనుడు.

"అలాగా!"

అగ్నిపాలుడు ఆలోచనలో పడ్డాడు: మణిమంతుడికి యిక్కడ ఎవరిమీద కోపం కలిగినట్టు? అది తనమీద... అంటే విష్ణుమిత్రుడిమీద కాదు గదా? గాయాలతో చచ్చి బతికిన— ఆ విష్ణు మిత్రుణ్ణి, యింతదూరం వచ్చి చూడ కుండా మణిమంతుడు ఎందుకు వెళ్ళినట్టు? బహుశా, అతడిచ్చిపోయిన ఉత్తరంలో ఆ వివరాలు వుండొచ్చు.

ప్రసేనుడు కొంతసేపు మౌనంగా కూర్చుని,కుర్చీలోంచి లేచి వెళ్ళబోతూ, "విష్ణూ! ఇక నీ పని చూసుకో

మణిమంతుడు ఆ ఉత్తరంలో ఏమైనా ముఖ్యవిషయాలే రాసి వుండొచ్చు. తనకు బందీగా చిక్కిన కాలభోజరాజును, నవ భోజుడు స్వయంగా విచారించి శిక్షిం చేందుకు, మానుకోట పురానికి వస్తున్నాడని వార్తలు వినవస్తున్నట్టు మణిమంతుడు చెప్పాడు," అని గది నుంచి బయటికి వెళ్ళిపోయాడు.

ప్రసేనుడు గడపదాటగానే, అగ్ని పాలుడు ముందున్న ఫలహారాలను పక్కకు తోసి, ఆత్రంగా ఉత్తరాన్నందు కుని చదవసాగాడు:

విష్ణూ! ద్రోహీ!

నీ ద్రోహబుద్ధీ, అవినీతిప్రవర్తనా నా కుమార్తె లలితాంగి ద్వారా విన్నాను. నువ్వే గనక, నా మిత్రుడి ఇంట అతిథిగా కాక మరో స్థితిలో నాకు కనబడివుంటే- ఆ క్షణాన్నే నిన్ను, నా కత్తికి ఎరచేసి వుండేవాణ్ణి. కాని, ప్రసేనుడు నా బాల్య మిత్రుడవటంవల్లా, ఈ సమయంలో నువ్వతడి ఆశ్రయంలో ఉండటంవల్లా బ్రతికిపోయావు. నువ్వూ, నేనూ కాల భోజరాజు పక్షీయులమే అయుండవచ్చు. అయినా. నీవు ప్రేమించినట్టు నటించి, నా కుమార్తెకు చేసినద్రోహానికి ప్రాయ శ్చిత్తం అనుభవించి తీరవలసిందే.

ఈనాటి సూర్యాస్తమయం వరకూ, నేను మంజీరానదీ తీరానవున్న, హిరణ్య పురంలో వుంటాను. ఆ పట్టణం మాను కోటవెళ్ళే రాజమార్గం మీద వున్నదని, నీకు తెలియందికాదు. నువ్వే గనక సుక్షత్రియవంశ సంజాతుడవయితే— ఈనాటి సూర్యాస్తమయంలోపల, నన్నా పురపరిసరాలలోని, నా మిత్రుడు విజయ రాజు ఇంట కలుసుకోవలసింది. ఆ తర వాత, నీ-నా చేతి ఖడ్గాలే ధర్మనిర్ణయం చేయగలవు.

ఇట్లు,
నీ కంఠరక్తాన్ని చవిచూడ ప్రతిజ్ఞపూనిన,
మణిమంతుడు.

ఈ ఉత్తరం అగ్నిపాలుడికి ఎంత ఆశ్చర్యం కలిగించిందో, అంత నవ్వూ తెప్పించింది. ఈ మణిమంతుదెవరో గాని... మహానుభావుడు, అగ్గిపిడుగు లాంటి మనిషి, అనుకున్నాడతను. ఒక విధంగా ఆ విష్ణుమిత్రుడు అదృష్ట వంతుడే అనుకోవాలి. ఒకవేళ అతడు బ్రతికేవుండి, యీ సమయంలో యీ మణిమంతుడి కంటబడితే, అతడి కంఠ రక్తం నిజంగానే యీ మణిమంతుడు చవిచూడగలడు! అనుకున్నాడు అగ్ని పాలుడు. అంతలోనే అతడికో పెద్ద సంశయం కలిగింది. విష్ణుమిత్రుడు తన కుమార్తెకు ద్రోహంచేశాడనే సంగతి ఈ మణిమంతుడికి ఎవరు చెప్పి ఉంటారు? ఇంతకూ. ఆ విష్ణు మిత్రుడు చేశాననే ఆ ద్రోహం ఎలాం టిది? ఒకవేళ విష్ణుమిత్రుడు బ్రతికే వున్నాడా? విష్ణుమిత్రుడు మరణించా డనీ...నాడికూడా పరీక్షించి చూశాననీ,



తనతో చెప్పినవాడు, తన ప్రధానసేవ కుడు, మాహూ! తనకై తాను, అతడి గుండె ఆగిపోవటాన్నిగాని, నాడి అడటం, ఆడకపోవటంగాని పరీక్షించి చూడలేదు. ఎక్కడో ఏదో పొరబాటు జరిగివుండాలి!

అగ్నిపాలుడు కుర్చీలోంచి లేచి,కిటికీ దగ్గిరకువెళ్ళి, దూరంగా కనబడుతున్న ఉద్యానవనానికేసి చూస్తూ, యిప్పుడు తన కర్తవ్యం ఏమిటా అని ఆలోచించ సాగాడు.

తను ఎటూ ఆనాటితో ప్రసేనుడి గృహం విడిచిపోక తప్పదు. ప్రస్తుతం తను చిక్కుకున్న విషవలయంలోంచి ముందు బయటపడాలి. తను భవి ష్యత్తులో మరేనాడైనా, అగ్నిపాలుడుగా వకుళమాలను భార్యగా పొందగలడేమో కాని... ఇప్పటి పరిస్థితుల్లో మాత్రం సాధ్యంకాదు

విష్ణుమిత్రుడు తనకు అప్పచెప్పిన పత్రాలను వెంటతీసుకుని, ఆ సాయంత్రం లోపల హిరణ్యపురంలో మణిమంతుణ్ణి కలుసుకుని, జరిగిన దేమిటో చెప్పటం మంచిదని అగ్నిపాలుడు నిశ్చయించుకున్నాడు. ఇకపోతే, యీ గృహం వదలటం ఏమంత కష్టంకాదు. కాని, వీడ్కోలు సమయంలో తాను వకుళమాలకు చెప్పవలసిందేమిటి?

ఇలా ఆలోచిస్తున్న అగ్నిపాలుడి దృష్టికి హఠాత్తుగా వకుళమాల కనిపించింది. ఆమె ఉద్యానవనంలో ఒక పొదరింటి పక్కన నిలబడి, తను వున్న కిటికీకేసే చూస్తున్నట్టు అతడు గ్రహించాడు. అతడు తక్షణం గదినుంచి బయటికివచ్చి, మేడమెట్లు దిగి, ఉద్యానవనంకేసి బయలుదేరాడు. ముఖద్వారం దగ్గిర రెండు గుర్రాలు పూన్చిన ఒక బండి, తెరలతోసహా నిలబడి వుంది. అంటే, ఎవరో స్త్రీలు ప్రయాణమై పోబోతున్నారు వారెవరు? వకుళమాల కాదు గదా! ఆ అనుమానం కలగ్గానే అగ్నిపాలుడు వేగంగా నడిచి వకుళమాల వున్న పొదరింటిని చేరాడు. ఆమె శిలా ప్రతిమలా నిలబడి, రెప్పవాల్చకుండా అతడికేసే చూస్తున్నది. ఆమె ముఖం కోపంతో జేవురించివున్నది.

వకుళమాలను సమీపించబోయిన అగ్నిపాలుడు అది గమనించి, ఉన్న చోటునే తక్కున ఆగిపోయాడు. అతడి గుండె వేగంగా కొట్టుకోసాగింది

"వకుళా!" అంటూ అగ్నిపాలుడు తిరిగి ముందడుగు వేయబోయాడు. కాని అంతలో, "ఛీ, నీచుడా!" అన్న వకుళమాల మాటలు అతణ్ణి నిశ్చేష్టుణ్ణి చేసినై. కాళ్ళకింది భూమి విచ్చిపోతున్నట్టుగా తోచిందతడికి.

"లలితాంగివల్ల నీ నీచత్వం అంతా తెలుసుకున్నాను. నువ్వు మానవరూపం ధరించిన రాక్షసుడివని, తెలిసిపోయింది!" అన్నది వకుళమాల తీవ్ర స్వరంతో.

"వకుళా! నువ్వనేదేమిటో..."

"ఛీ దుర్మార్గుడా! ఇంకా నన్ను వకుళ అని పిలవటానికి నీకు ముఖం ఎలా చెల్లింది? ఇంక నా దగ్గిర ఆ చనువు పనికిరాదు," అన్నది వకుళమాల కఠినంగా.

"ఇంతకూ నేను చేసిన అపరాధం?" అన్నాడు అగ్నిపాలుడు దీనంగా.

"అపరాధం! నీ అపరాధమేమిటో యింకా తెలియలేదా? లలితాంగిని ప్రేమించినట్టు నటించి, నమ్మించి... ఆమె తండ్రిద్వారా వివాహముహూర్తం కూడా నిశ్చయించేసుకున్నావు తరవాత, మా ఇంటచేరి, ప్రేమించినట్టు నటించి, నన్నుకూడా మోసపుచ్చాలని చూశావు. నీ నీచత్వం తెలియని నేను, నా హృదయంలో నీకు స్థానమిచ్చాను. కల్లబొల్లి మాటలతో, నీ గతజీవితంలో



ఊరిగిపోయిన దేన్నిగురించో నాకు చెప్ప లేక బాధపడుతున్నట్టు నటించినదంతా— యీ లలితాంగికి నువ్వు చేసిన ద్రోహం సంగతేగదా ?" అన్నది వకుళమాల.

"నన్ను విశ్వసించు, వకుళా ! నేను, నీ వనుకుంటున్నవాణ్ణి కాదు. నిజం తెలిసిననాడు..."

వకుళమాల చీత్కరిస్తూ, "ఇక మాటలంతటితో కట్టిపెట్టు. లలితాంగి నీ గురించి సర్వం చెప్పింది. నీ ద్రోహానికీ, మోసానికీ తగిన ప్రాయశ్చిత్తం జరిపించి తీరుతాను," అంటూ గిరుక్కున తిరిగి, ఉద్యానవన ప్రధాన ద్వారంకేసి వేగంగా వెళ్ళిపోయింది

అగ్నిపాలుడు వెళ్ళిపోతున్న వకుళమాలకేసి చూస్తూ, ప్రయత్నించి ముందుకు అడుగు వెయ్యలేకపోయాడు. తరవాత కొంతసేపటికి అతడు తెప్పరిల్లి, నీరసంగా ద్వారంకేసి నడిచి, ఉద్యానవనంనుంచి బయటికి వెళ్ళేసరికి, దూరంగా జోడుగుర్రాలు పూన్చినబండి సుడిగాలిలా పరుగిడుతూ, చూస్తుండగానే అతడిదృష్టిపథాన్నుంచి మాయమైంది.

## 13

అగ్నిపాలుడికి మారిన యీ పరిస్థితుల్లో, తన కర్తవ్యం ఏమిటో నిర్ణయించుకోవటం ఏమంత కష్టం కాలేదు. తను ఎలా అయినా, ఆనాటి సూర్యాస్తమయంలోపల ప్రసేనుడి గృహంవదిలి వెళ్ళదలుచుకొన్నాడు. అప్పట్లో, ఎక్కడికి వెళ్ళాలనేదిమాత్రం అతడు ఆలోచించుకోలేదు. కాని, ప్రస్తుతం వకుళమాల ప్రవర్తన దృష్ట్యా మాత్రమే కాక, మణిమంతుడి ఉత్తరం ధోరణినిబట్టి కూడా—తాను హిరణ్యపురం వెళ్ళటం మంచిదనుకొన్నాడు.

ఆనాటి సూర్యాస్తమయం వరకూ,

మణిమంతుడు హిరణ్యపురంలోని, తన మిత్రుడైన విజయరాజు యింట వుంటాడు. తను అతణ్ణి కలుసుకుని, విష్ణుమిత్రుడు తనకు అప్పచెప్పిన పత్రాలను ఆయన పరంచేసి, జరిగిన వాస్తవం ఏమిటో వివరించవలసివుంటుంది. ఏ పరిస్థితులలోనూ తా నెవరైనదీ మణిమంతుడికి తెలియనివ్వకూడదని అగ్నిపాలుడు నిశ్చయించుకొన్నాడు.

ఇక వకుళమాల సంగతి. ఆమె తనను విష్ణుమిత్రుడని పూర్తిగా విశ్వసించటం వల్లనే, లలితాంగి చెప్పినమాటలకు అంతగా ఉడికిపోయింది. తను లలితాంగితో వివాహానికి అంగీకరించి, తరవాత తన ఇంటచేరి, తనతోనూ ప్రేమకలాపాలు ప్రారంభించానని ఆమె నమ్మకం; కాని...'నీ ద్రోహానికి తగిన ప్రాయశ్చిత్తం జరిపించి తీరుతాను,' అన్న ఆమె మాటల అర్థం ఏమిటి? 'ఏ కారణంవల్ల, ఎందుకోసం యింత హడావిడిగా వకుళమాల ఇల్లువదిలి ప్రయాణమైపోయింది?

అగ్నిపాలుడికి ఎంత ఆలోచించినా, యీ ప్రశ్నలకు జవాబులు దొరకలేదు. అతడు నీరసంగా మేడమెట్లెక్కి, తన గదిని చేరి, తనకు సంబంధించిన వస్తువులన్నీ ఒక చోట చేర్చి ప్రయాణానికి సర్వంసిద్ధం చేసుకోసాగాడు.

ఆ సమయంలో ప్రసేనుడు అక్కడికి రావటం జరిగింది. అతడు అగ్నిపాలుడు వస్తువులన్నీ ఒకచోటుకు చేర్చుతూండటంచూసి, "ఏమిటిదంతా, విష్ణూ?" అని అడిగాడు.

"నాకు సెలవిప్పించండి. చాలా అవసరంగా బయలుదేరి పోవలసినపని తగిలింది," అన్నాడు అగ్నిపాలుడు.

"ఏమిటా అవసరం అయిన పని?" అంటూ ప్రసేనుడు కొంచెం ఆగి "మణిమంతుడు ఆ ఉత్తరంలో ఏదైనా ముఖ్య విషయం రాశాడా?" అన్నాడు.

"అవును. ఆయన్ని యీ సాయంత్రం హిరణ్యపురంలో కలుసుకోవలసి వున్నది," అన్నాడు అగ్నిపాలుడు.

ప్రసేనుడు ఒక్క నిట్టూర్పు విడిచి, కుర్చీలో కూర్చుంటూ, "ప్రస్తుతానికి మన ఆశలన్నీ భగ్నమయినై. నన్నడిగితే- మనం తొందరపడి, నవభోజుడితో బహిరంగయుద్ధానికి పూనుకొన్నామంటాను. మరికొంతకాలం వేచివుండవలసింది," అన్నాడు.

"అంతా అయిపోయింతరవాత, ఇప్పుడనుకుని లాభం ఏముంది? అంతా దైవఘటన!" అన్నాడు అగ్నిపాలుడు.

ప్రసేనుడు కొంతసేపు మౌనంగా ఆలోచిస్తూ వూరుకుని, "అన్నట్లు- తనెక్కడికి వెళుతున్నదీ, నీతో ఏమైనా చెప్పిందా, విష్ణూ?" అని అడిగాడు.

"ఊహుఁ," అంటూ అగ్నిపాలుడు తలాడించాడు.





పో లి క లు

"నీవు, యీ రోజున బయలుదేరి పోతున్నట్టు అమ్మాయికి తెలుసా ?"

"నేను చెప్పమరిచాను," అన్నాడు.

"సరే, మనం యిప్పట్లో కలుసుకోవటం జరక్కపోవచ్చు. మణిమంతుడు యీ అపజయానికి చాలా విచారిస్తున్నట్టు కనిపించాడు. అతడి మాటల ధోరణి చూస్తే, కృష్ణానది దాటి చాళుక్యరాజ్యం చేరదలచినట్టు కనబడింది ఇక నీ ప్రయాణం..." అంటూ ప్రసేనుడు, అగ్నిపాలుడి ముఖంలోకి చూశాడు

"ముందు మణిమంతుడితో మాట్లాడాలి. ఆ తరవాతే ఏం నిర్ణయించినా," అన్నాడు అగ్నిపాలుడు

"అదే మంచిపని ! కొద్దిరోజుల్లో కాలభోజరాజు భవిష్యత్తు ఎలా వుండబోతున్నదో, మనకు తెలిసిపోతుంది. ఈ లోపల మనందరం ఒకరొకరుగా, నవభోజుడి చేతబడి నాశనం అయ్యేకన్నా— ఉన్న కొద్దిమందిమీ, సురక్షితంగా ఏ చాళుక్యరాజ్యంలోనో తల దాచుకోవటం మంచిది నా సంగతి— ఇంతవరకూ నన్ను కాలభోజుడి పక్షపాతినని శత్రువు లెవరూ గుర్తించలేదు. కనుక, ప్రస్తుతానికి నేనిక్కడ వుండక తప్పదు ఇది ఒక రకంగా ముందు ముందు, మీ అందరికీ ఉపయోగకరంగా పరిణమించవచ్చు," అన్నాడు ప్రసేనుడు.

అగ్నిపాలుడు మౌనంగా తల వూపాడు

ప్రసేనుడు కుర్చీలోంచి లేచి, గదిలో అటూ యిటూ కొద్దిసేపు ప్రచార్లుచేసి, "సరే, విష్ణూ! నువ్వు కాస్త విశ్రాంతి

తీసుకుని బయలుదేరటంమంచిది. హిరణ్య పురం యిక్కడికి ఎంత లేదన్నా, పదీ పన్నెండు కోసుల దూరం వుంటుంది," అని గది బయటికి నడిచాడు.

జరిగిందేమిటో— విష్ణుమిత్రుడికి సంబంధించినంతవరకూ మణిమంతుడితో చెప్పి, ఆ పత్రాలు అతడి స్వాధీనంచేసి, తాను సరాసరి చంద్రగిరినగరం చేర టమే ఉత్తమమని అగ్నిపాలుడు నిశ్చ యించుకున్నాడు. అంటే, దాని అర్థం తను అవజ్ఞవర్మతో వేసినపందెంలో ఓడినట్టు! తనకు అదృష్టంకలిసిరాలేదు. మారు మాట్లాడకుండా తన సంస్థానాన్ని అతడికి ధారాదత్తంచేయవలసి వుంటుంది. అంతమాత్రాన, తను నిరుత్సాహపడనల సిందేమీ లేదు. ఏదో ఒకనాడు తను అంతకన్నా గొప్ప సంస్థానాన్ని... మరొకచోట సంపాయించగలడు కాని, వకుళమాల నెలా...

అగ్నిపాలుడు యిటువంటి ఆలోచన లతో, కుర్చీలోనే మగతగా కళ్ళు మూసుకున్నాడు. అలా ఎంతకాలం గడి చిందో అతడికి తెలియదు. హఠాత్తుగా భవనప్రాంగణంలో గుర్రపు డెక్కల చప్పుడూ, కేకలు వినిపించి అతడు ఉలిక్కిపడుతూ కళ్ళు తెరిచాడు.

ప్రప్రథమంగా అతడిదృష్టి కిటికీ లోంచి, భవనం ముందుభాగాన వున్న ఖాళీప్రదేశం మీదికి ప్రసరించింది. పది హేనూ, ఇరవైమంది అశ్వ సైనికులు అతడి కంటబడ్డారు. వారిలో కొందరు యింకా అశ్వాలమీదనే వున్నారు. కొందరు దిగి అటూ ఇటూ పరిగెత్తు తున్నారు. ఒక నడివయసువాడు... బహుశా వాళ్ళ నాయకుడై వుంటాడు— అతడుమాత్రం కత్తిదూసి, భవన ముఖ ద్వారంకేసి నడుస్తూ, "రాజా ప్రసేన్! రాజాప్రసేన్! అని పెద్దగా కేకలు పెడుతున్నాడు.

అగ్నిపాలుడు నిలువెల్లా వణికి పోయాడు. ఎవరో ప్రసేనుడికి ద్రోహం తలపెట్టారు. అతడికి ఆ క్షణంలో బేతాళ వర్మ గుర్తుకువచ్చాడు. వకుళమాల కార ణంగా అతడు బహుశా పగపట్టివుంటే అది తనమీదే అయుంటుంది. చూస్తూ చూస్తూ అతడు ప్రసేనుడికి ద్రోహం చెయ్యలేడు. ఒకవేళ ఆ వచ్చిన సైని కులు తనకోసం అయితే?

అగ్నిపాలుడు యిలా మధనపడు తున్నంతలో, ప్రసేనుడు తలుపుతెరుచు కుని బయటకివచ్చాడు, అతణ్ణి చూస్తూనే సైనికుల నాయకుడు సగౌరవంగా ప్రణామంచేస్తూ, "రాజా ప్రసేన్! నన్ను క్షమించాలి. రాజకార్యంమీద నేనిక్క డికి రావటంజరిగింది. మీ గృహంలో ఒక రాజద్రోహి వుంటున్నట్టు, మాకు సమాచారం చేరింది. అతడు తమకు నిజ నామం చెప్పక బొంకినకారణంగా, రాజద్రోహి అని తెలియక, మీరతడికి ఆశ్రయం యిచ్చి వుంటారు. అతణ్ణి

బంధించవలసి వుంది. దయవుంచి, ఎక్కడ వున్నాడో చెప్పకోరతాను," అన్నాడు.

ప్రసేనుడు నిప్పులుచెరిగే కళ్ళతో, ఆ సైనికనాయకుడికేసి చూస్తూ, "నువ్వు నేది ఏ రాజద్రోహిని గురించో, నా కర్థం కావటంలేదు. ఎవరతను?" అని ప్రశ్నించాడు.

"విష్ణుమిత్రుడు! నవభోజమహారాజు పేరుతో, నేను మిమ్మల్ని అడుగుతున్నాను అతడెక్కడున్నాడు?" అన్నాడు సైనికనాయకుడు అధికార స్వరంతో.

ప్రసేనుడు పైకుబికివస్తున్న కోపాన్ని తొక్కిపడుతూ, "ఇది నన్నవమానించటంగా భావిస్తున్నాను. ఆ విష్ణుమిత్రుడు రాజద్రోహిఅని మీతో చెప్పినవాళ్ళెవరు! అసలు నా అనుమతిలేకుండా, నా భవన ప్రాంగణంలో అడుగుపెట్టే అధికారం.." అంటుండగా, పరిస్థితి చేజారిపోతున్నదని గ్రహించిన అగ్నిపాలుడు కిటికీలోంచి చేయివూపుతూ, "రాజాప్రసేన్! మీరు తొందరపడకండి," అంటూ పెద్దగా కేకవేసి, సైనికనాయకుణ్ణి ఉద్దేశించి, "మీరేమీ తొందరపాటున పరుషాలు పలకకండి. విష్ణుమిత్రుణ్ణి నేనే! కిందికి దిగివస్తున్నాను. నన్ను బందీగా పట్టుకుపోవచ్చు," అన్నాడు.

ప్రసేనుడు స్థాణువులా నోటమాట రాక నిలబడిపోయాడు. సైనిక నాయకుడు కూడా, అగ్నిపాలుడి మాటలకు ఆశ్చర్యపడుతూ నిల్చున్నాడు.

అగ్నిపాలుడు వేగంగా మెట్లుదిగి భవనప్రాంగణంలోకి వచ్చి, ప్రసేనుణ్ణి సమీపించి, "రాజాప్రసేన్!నన్ను క్షమించండి. కొన్ని ప్రత్యేక కారణాలవల్ల, మీకు నా నిజనామం చెప్పలేకపోయాను," అంటూ సైనికనాయకుడికేసి తిరిగి, ఒరలోవున్న తన కత్తితీసి వేలు చూపుతూ, "నేనిప్పుడు మీకు బందీని కావాలంటే, అందుకు సూచనగా నా కత్తిని మీ పరం చేయగలను," అన్నాడు.

ఆ మాటలకు సైనికనాయకుడు అయిష్టంగా తలవూపి, "మీ గురించి నేను లోగడ విన్నదాన్నిబట్టి, మీరింత తేలిగ్గా నా స్వాధీనం అవుతారనుకోలేదు. ఆ కారణంవల్లనే యింతమంది సైనికులతో నేనిక్కడికి రావటం జరిగింది. రాజాజ్ఞ, నేను చేయగలిగిందేమీలేదు. కత్తిని మీదగ్గిరే వుండనివ్వండి. దయచేసి,ఆ గుర్రాన్ని అధిరోహిస్తే...బయలుదేరవచ్చు," అన్నాడు.

అగ్నిపాలుడు మారుమాటాడకుండా, సైనికుడొకడు ముందుకు తెచ్చిన గుర్రాన్ని ఎక్కాడు. సైనికనాయకుడు ముందు కదిలాడు. అతడివెనకనే అగ్నిపాలుడు తన గుర్రాన్ని నడిపించాడు. మిగిలిన సైనికులు అతడి వెనక బయలుదేరారు.

అగ్నిపాలుడు భవన ప్రాంగణం

దాటి, రాజమార్గం మీదికి వచ్చేవరకూ తలతిప్పి ప్రసేనుడి వైపుకు చూడలేదు. కాని, రాజమార్గం చేరగానే ఆతడు తల తిప్పిచూశాడు. ప్రసేనుడు భవన ప్రాంగణంలోనే నిలబడి వున్నాడు; అతడిపక్కన భార్య చంద్రాదేవి కూడా వున్నది. ఆమె తనకేసి చేయివూపుతూ, భర్తతో ఏదో ఆద్వేగంగా మాట్లాడు తున్నది.

అగ్నిపాలుడి పెదాలమీద చిరునవ్వు మెరిసింది. తను విష్ణుమిత్రుణ్ణని చెప్ప కుండా ప్రసేనుడి ఆశ్రయం సంపా యించినట్టు, సైనికనాయకుడు అను కుంటున్నాడు. బహుశా ఆతడి కొచ్చిన సమాచారం అలాంటిదై వుండొచ్చు. ఆ కారణంవల్లనే తను ప్రసేనుడితో, '...కొన్ని ప్రత్యేక కారణాలవల్ల, మీకు నా నిజనామం చెప్పలేకపోయాను!' అనటం జరిగింది. దీనితో సైనిక నాయ కుడికి, ప్రసేనుడిమీద ఇంకా ఏమైనా అనుమానం మిగిలివుంటే— అది కాస్తా పటాపంచలు కాగలదు.

దారిలో సైనికనాయకుడు పక్కకు తలతిప్పి, అగ్నిపాలుడికేసి గుచ్చి చూస్తూ, "మిమ్మల్ని చూడగానే నాకు చాలా ఆశ్చర్యం కలిగింది. లోగడ మిమ్మల్ని ఎక్కడో చూసివున్నట్టు అనుమానం కలుగుతున్నది," అన్నాడు.

"ఎప్పుడైనా మీరు చంద్రగిరి నగ రంలో వున్నారా?" అని అడిగాడు అగ్ని పాలుడు.

"కొద్దిరోజులపాటు వున్నాను. అక్కడ నా మిత్రుడొకడు...ఇప్పుడు రాజాస్థానంలో చాలా పెద్ద ఉద్యోగంలో వున్నాడు—అతడింట నాలుగైదు రోజు లున్నాను," అన్నాడు సైనికనాయ కుడు.

"ఎవరా మిత్రుడు?"

"జయసింగ్. ఆయన్ని మీరేమైనా ఎరుగుదురా?"

అగ్నిపాలుడు నిశ్చేష్టుడయాడు. ఈ పట్టున తనెవరైనదీ అందరికీ తెలిసి పోవటం మంచిదికాదు. తను రాజద్రోహి విష్ణుమిత్రుడు కాదనీ, అగ్నిపాలుడనీ ఏ క్షణాన కావాలంటే, ఆ క్షణంలో రుజువుపరుచుకుని, యీ చిక్కుల్లోనుంచి బయటపడొచ్చు. కాని, యీ లోపల విష్ణుమిత్రుడుగా తను చేయవలసిన పనులు కొన్ని వున్నవి

"జయసింగ్‌ను నేనెరుగుదును. కాని, విష్ణుమిత్రుడుగా మాత్రం కాదు. బహుశా నన్ను మీరతడివెంట ఎప్పుడైనా చూసి వుంటారు ఇంతకూ మీ పేరు?" అన్నాడు అగ్నిపాలుడు.

"క్షమించాలి. చెప్ప మరిచాను. నా పేరు ధర్మనందుడు. ప్రస్తుతం మాను కోట పట్టణంలో విడిసివున్న సైన్యానికి నాయకుణ్ణి," అన్నాడు ఆ సైనికనాయ కుడు.



"చాలా సంతోషం. రాజద్రోహినైన నా మీద, నవభోజరాజు సైనికులెవరూ యింత మర్యాద కనబరచగలరని నేననుకోలేదు," అన్నాడు అగ్నిపాలుడు.

"మీరు రాజద్రోహులని అప్పుడే ఒప్పుకుంటున్నారే! మిమ్మల్ని న్యాయాధిపతులముందు నిలిపినప్పుడు...అక్కడ జరగవలసిన న్యాయవిచారణ తంతు చాలా వుంది. నిజమైన రాజద్రోహులు కూడా చాలామంది, తెలివిగా శిక్షపడకుండా తప్పించుకోగలుతున్నారు. నిర్దోషులు కొందరు శిక్షింపబడుతున్నారు కూడా. ఇదంతా చూచిన తర్వాతనే,నాకు యీ సైనిక వృత్తిమీద అసహ్యం కలుగుతున్నది. ఒక్క ఆ కాలభోజుణ్ణి మాత్రం ఉరితీసి, తతిమ్మా వారిని ఎవరిమానాన వారిని వదలటం ఒక్కటే ఉత్తమమార్గం అని నేను నమ్ముతున్నాను. ఆ కారణం వల్లనే, మీతో నేనంత మర్యాదగా ప్రవర్తించటం జరిగింది."

ధర్మనందుడి మాటలు, అగ్నిపాలుడికి ఎంతో ఆనందం కలిగించినై. దురదృష్టవశాత్తూ తను మణిమంతుణ్ణి కలుసుకోకముందే, యీ చిక్కులో పడవలసి వచ్చింది. ఆతడికోసారి కనిపించి, జరిగిన పొరపాటు ఏమిటో చెప్పటం తన ధర్మం. అందుకు తను సూర్యాస్తమయం లోపల హిరణ్యపురం చేరాలి; మణిమంతుణ్ణి కలుసుకోవాలి. ఇప్పటి పరిస్థితుల్లో ధర్మనందుడి సహాయం గాని, లేక అనుమతిగాని లేనిదే, అది సాధ్యం కాదు. ముందు తనెక్కడికి తీసుకుపోబడుతున్నదీ తెలుసుకోవటం అవసరం..

"ధర్మనందా! మీ దయకూ, నాపై

గల సదభిప్రాయానికి కృతజ్ఞుణ్ణి. నన్ను మానుకోటకే తీసుకుపోతున్నారా? అభ్యంతరం లేకపోతే తెలుసుకోవాలని వున్నది," అన్నాడు అగ్నిపాలుడు.

"అవును, మానుకోటకే!" అన్నాడు ధర్మనందుడు.

"మానుకోటకు వెళ్ళే మార్గంలో, హిరణ్యపురం తగులుతుందిగదా?" అని అడిగాడు.

"ఈ రాత్రికి మనం అక్కడే కాలం గడపవలసివుంటుంది. అక్కడ మీకు బంధువులుగాని, మిత్రులుగాని ఎవరైనా వున్నారా?" అన్నాడు ధర్మనందుడు కుతూహలంతో.

"అక్కడ నా మిత్రులొకరిని కలుసుకోవాలి. అతడితో నేను మాట్లాడేటప్పుడు, మీరు దగ్గరవుండవచ్చు. స్వవిషయాలూ, కుటుంబవిషయాలూ తప్ప, అతడితో రాజద్రోహం ఏమీ మాట్లాడబోవటం లేదు," అన్నాడు అగ్నిపాలుడు మందహాసం చేస్తూ.

"ఓ!, మీరు నిరభ్యంతరంగా అక్కడ ఎవరినైనా కలుసుకోవచ్చు. నా కనుగప్పి మీరు పారిపోదలచలేదు గదా? అలాంటి దేమీలేదని వాగ్దానం చేయండి, చాలు," అన్నాడు ధర్మనందుడు ఎంతో మర్యాదగా.

"వాగ్దానం చేస్తున్నాను. గృహవిషయాలు తప్ప, ఎవరితోనూ ఎట్టి రాజకీయ వ్యవహారాలూ మాట్లాడను," అన్నాడు అగ్నిపాలుడు.



పోలికలు

ధర్మనందుడు గుర్రాన్ని అదిలించి, వేగంగా దాన్ని పరిగెత్తించుతూ, "చీకటి పడకముందే మనం హిరణ్యపురం చేరగలం. మీరు మాట్లాడదలచిన స్నేహితుడి ఇల్లు, నగరంలోని ఏ భాగంలో?" అని అడిగాడు.

"నా స్నేహితుడు ఆ నగరవాసికాదు. అతడు నగరపొలిమేరలలో వున్న విజయరాజనే వారి ఇంట అతిథిగా వుంటున్నాడు. ఈ స్నేహితుడికి నేటి రాజకీయ కక్షలలో దేనితోనూ సంబంధంలేదు.




అతడు నాకు బాల్యమిత్రుడు," అన్నాడు అగ్నిపాలుడు ఎంతో నమ్మకంగా.

"ఆ విజయరాజనబడే ఆయన నివసించే పెద్దలోగిలి, నాకు తెలిసిందే మొదట్లో ఒక వారంరోజులపాటు, చాలా మంది సైనికులతోపాటు నే నక్కడే వున్నాను. ఆయనకు చంద్రగిరి రాజ్యంలో ఏంజరుగుతున్నదో తెలియటం మాట అటుంచి, హిరణ్యపురంలో ఏంజరుగుతున్నదోకూడా తెలియదు," అంటూ ధర్మనందుడు బిగ్గరగా నవ్వాడు.

"ఆయనకు అతిథిగావున్న, నా స్నేహితుడు కూడా అలాంటి వ్యక్తే. తన పనేమిటో తప్ప, మరిలోకంఅనేది వున్నదనే సంగతికూడా అతడికి తెలియదు," అన్నాడు అగ్నిపాలుడుకూడా మందహాసంచేస్తూ.

"ఈ చంద్రగిరి రాజ్యంలో యిలాంటి వాళ్ళసంఖ్య పెరిగితే, యీ కల్లోలాలకు తావేవుండదు," అంటూ ధర్మనందుడు, అగ్నిపాలుడికేసి చూసి నాలుక్కొరుక్కొని, "మనం విమర్శించి లాభంలేదు. ఎవరి ఆదర్శాలూ, ఆశయాలూ, అభిప్రాయాలూ వారివి! అందరూ వర్తకులూ,వ్యవసాయదారులూ కాలేరుగదా!" అన్నాడు

"అందుకు మీరూ, నేనే నిదర్శనం. మీరు సైనికులు, నేనూ సైనికుణ్ణే. కాని, నేనొక రాజును నమ్మాను, మీరు మరొక రాజును నమ్మారు. ఈ ఇద్దరిలో ఎవరు జయించగలరనేది, మీ నా శక్తి సామర్థ్యాలమీద ఆధారపడి వుంటుంది," అన్నాడుఅగ్నిపాలుడు.

"ఔనౌను!" అన్నాడు ధర్మనందుడు సాలోచనగా.

—(సశేషం)



# పంతులుగారమ్మాయి

మల్లాది వెంకటకృష్ణమూర్తి

నిరంజనం నాకు మంచి మిత్రుడు. మద్రాస్‌కి నాలుగేళ్ళ క్రితం వుద్యోగ రీత్యా వచ్చాక అనేకమంది కొత్త మిత్రులు ఏర్పడ్డారు నిరంజనం అందరి కన్నా ఆప్తుడవడానికి కారణం, స్నేహంకి ప్రాముఖ్యతనిచ్చే స్వభావం వల్ల.

నిరంజనం, నేనూ బ్రహ్మచారులం. సంవత్సరం క్రితం రూమ్‌మేట్స్ అయాక మా ఇద్దరి మధ్యా అనుబంధం మరింత బలపడింది నిరంజనం మద్రాసుకి నాలాగే వుద్యోగం చేయడానికి వచ్చాడు.

వచ్చిన కొత్తల్లో బాగా 'హోమ్‌సిక్' ఫీలయేవాడు. ఇంట్లోనే ఎక్కువ కాలం గడపటంవల్ల ఇంటిమీద, తలితండ్రుల మీద బెంగ ఎక్కువ నిరంజనానికి. నేను కొత్తలో అలాగే బాధపడ్డవాడిని కాబట్టి, ధైర్యం చెపుతూ, సహాయంచేసే ప్రయత్నం చేసేవాడిని.

హోటల్ భోజనం తనకు పడదని

రూంలోనే వంటచేసుకునేవాడు నిరంజనం. నేను మాత్రం ఆ బాదరబందీ లేమీ పెట్టుకోకుండా హోటల్‌లోని భోజనం చేస్తూండేవాడిని.

నిరంజనం ఇంటిమీద బెంగ విపరీతంగా వున్న రోజుల్లో నాకు వాళ్ళ గ్రామం గురించి కుటుంబ సభ్యుల గురించి, గ్రామంలోని రాజకీయాల గురించి చెపుతుండేవాడు. నాకు అట్టే ఉత్సాహం లేక పోయినా, వింటూండేవాడిని.

నేను ఇంటిమీద బెంగతో కాలం గడిపినప్పుడు, నాలుగేళ్ళక్రితం మద్రాస్‌లో నేను మా ఇంటి గురించి, అనంతపూర్ జిల్లాలోని మా కదిరి గురించి చెప్దామన్నా, నాకప్పుడు శ్రోతలెవరూ దొరక లేదు. ఆ అనుభవంతో నేను నిరంజనానికి శ్రోత నయ్యాను లెక్కలేనన్ని సార్లు.

ఫలితంగా నాకు నిరంజనం కుటుంబం గురించి, నిడదవోలు సమీపంలో వున్న వాళ్ళ గ్రామం తాడిమళ్ళ గురించి ఒక అభిప్రాయం ఏర్పడిపోయింది, నేనెప్పుడూ అంతదాకా గోదావరి జిల్లాల వైపు వెళ్ళకపోయినా.

నిరంజనం తండ్రి తాడిమళ్ళలోనే తమ పెంకుటింట్లో వుంటూన్నారు ప్రస్తుతం. పోస్టుమాస్టర్‌గిరీ చేసి రిటైరైపోయారు సంవత్సరం క్రితం. నిరంజనం అన్నయ్య నిడదవోలులో రైల్వే వుద్యోగి.

నిరంజనం నాన్నగారికి మొదటి నుంచీ నాటకాలన్నా, కళాకారులన్నా విపరీతమయిన మోజు. ఆయన చిన్నప్పటినుంచీ అనేక నాటకాల్లో లెక్కలేనన్ని వేషాలు వేసారు. వుద్యోగంలోంచి రిటైరవడానికి అయిదేళ్ళ ముందు తనే స్వయంగా ఓ నాటకాల ట్రూపు తయారు చేసారు. భిన్నాభిప్రాయాలవల్ల తర్వాత అంతా విడిపోయారు.

నిరంజనం తల్లికి కళ్ళు కనబడవు. ఆవిడకి పదేళ్ళనుంచి ఆరోగ్యం కూడా అంతంతమాత్రంగానే వుంటోంది. యమధర్మరాజుదగ్గర పనిచేసే చిత్రగుప్తుడు ఆవిడకి సంబంధించిన పుస్తకంలోని పేజీని చూడటం మర్చిపోయాడని నిరంజనం అభిప్రాయం

తర్వాత చూస్తే 'ఎప్పుడో ఆవిడకి కాలం తీరిపోయిందే. ఇన్నాళ్ళు మర్చిపోయానేమిటి?' అని నాలుక కొరుక్కుంటాడని కూడా నిరంజనం అభిప్రాయం. నిరంజనానికి తన తల్లి అంటె ప్రాణం కాబట్టి, ఆ కబురు ఎప్పుడు అందుతుందోనని విలవిల్లాడిపోతుంటాడు అప్పుడప్పుడు.

తాడిమళ్ళకి నిడదవోలునుంచి ఎలా వెళ్ళాలో ఇప్పుడు నాకు తెలుసు. తాడిమళ్ళలోని నిరంజనం ఇంటికి కూడా ఎలా వెళ్ళాలో దారి తెలుసు. ఆ ఆరు గదుల పెంకుటిల్లుకూడా ఎలా వుంటుందో నాకుతెలుసు నిరంజనం. శ్రోతని కాబట్టి.

తర్వాత తాడిమళ్ళలో నిరంజనం చదువుకున్న ప్రాథమిక పాఠశాల ఎలా వుంటుందో నా మనఃఫలకంలో ఓ బొమ్మ ఏర్పడింది. ఆ స్కూల్లోకి వచ్చే విద్యార్థులు, వాళ్ళ అవగాహన శక్తితో పాటు ఆ బడిలోనే పనిచేసే పంతులుగారు కూడా నాకు సుపరిచితులు.

నిరంజనానికి తన పంతులుగారంటే ఎనలేని గౌరవం, భయం, ప్రేమ. కారణం పంతులుగారు ఇంగ్లీషులోని 'ఇండియన్ కాన్‌స్టిట్యూషన్'ని సంస్కృతంలోకి తర్జుమా చేయగలిగారనికాదు.

పంతులుగారిని చిన్నప్పటి నుంచీ తాడిమళ్ళలో అంతా గౌరవంగా చూడటంవల్ల, పాండిత్యం ఆయన సొత్తు. పెళ్ళికి చదివే మంత్రాలు, సంవత్సరీకానికి చదివే మంత్రాలు అన్నీ ఆయన గడగడ అప్పచెప్పగలరు. కాని ఆయన జీవనం బడిద్వారానే

ఆ పంతులుగారికి ఇద్దరు కూతుళ్లు. పెద్దకూతురికి పదిహేడేళ్ళు నిండాయి. పేరు భానుమతి.

నిరంజనం తన గురించి చెప్పాలనుకుంటే ఇద్దరి గురించి చెప్పకుండా వుండలేడు. తన తల్లి గురించి కానీ, భానుమతి గురించిగానీ చెప్పకుండా తన గురించి చెప్పటం చాతకాదు. నిజానికి వాళ్ళిద్దరూ లేకుండా నిరంజనం లేడు. వుండలేడు బహుశ.

ఆవిధంగా నాకు భానుమతి పరిచయం అయింది. భానుమతి ఎలా వుంటుందో, ఎలా మాట్లాడుతుందో, ఎలా నడుస్తుందో, ఎలానవ్వుతుందో—భానుమతి నా మనఃఫలకంలో ఓ సజీవచిత్రంగా మారింది, నేను నిరంజనం శ్రోతనవటంవల్ల.

తెల్లగా వుంటుంది సన్నగా వుంటుంది. నల్లటి నొక్కులజుట్టు జడ మోకాళ్ళదాకా వస్తుంది, జడని ముందుకు లాక్కుంటే. ఎర్రచీర కట్టుకుని, చేతిలో కడవతో చెరువుకు వెళ్ళదు. వీధిపంపు దగ్గరకి వెళ్తుంది నీళ్ళు పట్టుకోడానికి. పంతులుగారికి భార్యలేదు. ఇంటిపనంతా చేస్తుంది. రాత్రి తీరికగా పడుకున్నప్పుడు, నిద్ర రాకముందు, నిరంజనం గురించి ఆలోచిస్తుంది. అంటే తన భవిష్యత్తు గురించి ఆలోచిస్తుంది.

నిరంజనం కూడా తన భవిష్యత్తు గురించి ఆలోచిస్తాడు. అంటే, భానుమతి గురించి ఆలోచిస్తాడు. నాకు చెప్తాడు. నవ్వుతాను. కోపం తెచ్చుకుంటాడు నవ్వినందుకు. అయినా కాసేపాగి మళ్ళీ చెప్తాడు. నాకు అసూయ కలుగుతూండేది నిరంజనంమీద.

నేను బ్రహ్మచారినేగాని అవిధంగా కలలు గనడానికి నాజీవితంలో అమ్మాయి లెవరూ తారసపడలేదు. నిరంజనం లాగా నేను చిన్నప్పటినుంచి భానుమతి లాంటి అమ్మాయితో కలిసి ఏ బడిలోనూ చదవలేదు. పెరిగి పెద్దయ్యే కొద్దీ ప్రేమ పెరగడానికి నాకు భానుమతిలాంటి—

అసలెలాంటి అమ్మాయి – స్థిరంగా నా జీవితంలో చోటుచేసుకోలేదు.

అందుకే నిరంజనం భవిష్యత్తంటే నాకు ఆసక్తి. నిరంజనం నాన్నగారు అయిదారు నెలల క్రితం వచ్చారు ఓసారి మద్రాస్. ఏదో సినిమాలో చిన్న పాత్ర వేద్దామనే వుద్దేశంతోవచ్చి, మా రూమ్‌లో బసచేసారు. వారం రోజులున్నారు.

ఆ వారం రోజుల్లో ఆయనంటే నాకున్న అభిప్రాయం తారుమారయింది. నాటకాల్లో వేషాలువేసి తిరిగే వాళ్లెవరూ నాకు పరిచయం లేరు అప్పటిదాకా. అందరూ ఆయనలా వుండకూడదనే నా ఆశ. అలాగే వుంటే, నాటకరంగం లోనివాళ్ళ మనసులు నాటకంలోని పాత్రల వరకే పవిత్రంగా వుంటాయి అనిపించింది.

ఆయన చాలాతంటాలుపడి సినిమాలో ఓ చిన్న వేషం వేసి, అతి తక్కువ రాబడితో తిరుగుప్రయాణం ఆయారు. మళ్ళీ ఎప్పుడయినా వేషం కట్టడానికి వస్తానని చెప్పి వెళ్ళారు.

అప్పుడు, ఆ వారంరోజుల్లో, నిరంజనం తన పెళ్ళి ప్రస్తావన తీసుకు రావడానికి నన్ను వాడుకున్నాడు. నిరంజనానికి త్వరలో పెళ్ళిచేయాలని తనూ అనుకుంటున్నానని చెప్పాడు నిరంజనం తండ్రి.

నిరంజనం అభిప్రాయం తెలుసుకోండని నేను హెచ్చరిందాక భానుమతి



ఆ తండ్రీ కొడుకుల సంభాషణలోకి వచ్చింది. ఆయన ముహూర్తాల కోసం పంచాంగాలు తిరగేసి, త్వరలో ఏ సంగతీ వ్రాస్తాననిచెప్పి వెళ్ళాడు. నిరంజనం భవిష్యత్తులాంటి భానుమతి గురించి కలలు కనడం ఇంకా ఎక్కువ చేసాడు.

నా అసూయని మరి కాస్త పెంచాడు కూడా

భానుమతి గురించి ఆలోచనలు మరింత దగ్గరయాయి నాకు ఇంతకాలం కన్నె చెఱలో వుంది మాఘమాసంలో, నిరంజనం కౌగిల్లో తొలిసారిగా ఆ చెఱనుంచి బయటపడుతుంది

పల్లెటూళ్ళలోని ముగ్ధలు వాళ్ళ భావాలు ఎనిమిదో క్లాసు దాకానే చదివిన వాళ్ళే పరిజ్ఞానం పరిధిల్లోంచి తొంగి చూసే ఆలోచనలు ఆశలు నేను కూడా నిరంజనం భవిష్యత్తు గురించి ఆలోచించడం ప్రారంభించాను, నాకు తెలియకుండానే

నిరంజనం నాన్నగారినుంచి వుత్తరం వచ్చింది పంతులుగారితో మాట్లాడానని, భానుమతిని నిరంజనానికి ఇవ్వడానికి ఆయన వప్పుకొన్నారని మార్చి ఆరో తారీఖు రాత్రి ఏడుగంటల ఆరు నిముషాలకి ముహూర్తం నిశ్చయం అయినట్లూ పదిరోజులు సెలవుపెట్టి మార్చి ఒకటి కల్లా అక్కడ వుండాలని, చవకబట్టి శుభలేఖలని మద్రాసులోనే అచ్చు వేయించుకుని చాలా చాలా వివరాలతో పెద్ద కవరు వచ్చింది

నిరంజనంకి తన జీవితంలో చెప్ప లేనంత ఆనందాన్ని కలిగించిన వుత్తరం బహుశ అదే ప్రథమం అయివుండచ్చని పించింది నాకు ఆనందంతో వెలిగిపో తున్న నిరంజనం మొహంచూస్తే నాకూ సంతోషం వేసింది ఆ రాత్రి సవేరాలోనే భోజనం మాకు నిరంజనం ఖర్చుతో

తర్వాత రోజులు లెక్కపెట్టుకోవడం నిరంజనం వంతయింది తాడిమళ్ళలో తన వివాహంతో పంతులుగారి ఇంటి ముందున్న ఆవరణలో జరుగుతుందనీ రెండుమైళ్ళదూరంలో వున్న తమ వరి పొలంలో వున్న పెంకుటింట్లో మొదటి రాత్రి గడుస్తుందనీ మిగతా రెండు రాత్రులు పంతులుగారింట్లో జరుగుతా యని, భానుమతికి సిగ్గెక్కువనీ భయం కూడా ఎక్కువేననీ

నాకు సంతోషం వేసింది ఎక్కడో కొద్దిగా బాధకూడా వేసింది గుండెల్లో భానుమతి నిరంజనంది అయిపోతుందని కాదు నాకు అలాంటి అమ్మాయి సావాసం లేదనీ కాదు నాకు పెళ్లవటం మరికొంత కాలందాకా దుర్లభం అని కూడా కాదు ఎందుకో నాకే తెలియదు

నిరంజనం మద్రాసులో అప్పుడే ఇల్లు వెదకడంకూడా ప్రారంభించాడు నేనూ సహాయంచేశాను ట్రిప్లికేన్‌లో బస్ స్టాప్‌కి దగ్గిరలో డెబ్బయి ఎనిమిది రూపాయలకి క్రొత్తగా పెళ్ళయిన వాళ్ళకి సరిపడే ఓ ముచ్చటయిన చక్కటి ఇంటికి అడ్వాన్సు ఇచ్చేశాడు ఫిబ్రవరి పద్దెనిమిదో తారీకు ఆ రాత్రి కూడా సవేరాలోనే మా భోజనం నిరంజనం ఖర్చుతో

పెళ్ళి కుదిరాక, ఆ పెళ్ళి అయేదాకా



రోజులు ఎంత మధురంగా, తీయగా, హాయిగా గడుస్తాయో నాకు నిరంజ నాన్ని చూస్తే తెల్సివచ్చింది. నా పెళ్ళికి లగ్నం పెట్టేటప్పుడు, వీలయినంత ఆల స్యంగా పెట్టించుకోవాలని నిర్ణయించు కొన్నాను అప్పుడే.

భానుమతికి వుత్తరాలు రాయడం కుదరదో, తెలియదో, ఇష్టంలేదో నాకు అంతుబట్టలేదు కాని, నా కాబోయే భార్య తప్పకుండా గ్రాడ్యుయేట్ అయి వుంటుంది కాబట్టి, ముందలే వుత్తరాలు వ్రాసుకోవడం కూడా చేయాలని మరీ నిర్ణయం చేసుకొన్నాను.

శుభలేఖలు అచ్చువేయించి చాలా మందికి పోస్ట్ చేసాడు నిరంజనం. నేనే చిరునామాలు వ్రాసాను అన్ని కవర్ల మీద, నా చేతివ్రాత బావుంటుంది కాబట్టి. కావాలని భానుమతికికూడా ఓ శుభలేఖ పోస్ట్ చేసాను తమాషాకి.

తండ్రి పంపిన లిస్ట్ పట్టుకుని, ఓ రోజు నాచేత సెలవు పెట్టించి, మద్రాస్‌లో ఈవినింగ్ బజార్, బర్మా, చైనా బజార్లు, పాయిక్రాఫ్ట్స్ మొదల యినచోట్లు తిరిగి అప్పడాలనుంచి బట్టలదాకా అన్నీ కొన్నాడు.

మర్నాడు వుదయమే నిరంజనం ప్రయాణం. ఆ రాత్రి మా భోజనం వుడ్‌లాండ్స్ హోటల్‌లో. నా ఖర్చు తోనే. రాత్రి చాలాసేపు సామాను సర్దటంలో నేనూ సహాయంచేశాను.

తను తిరిగి వచ్చేలోగా ఏమేం చేయాలో నాకు కొన్ని సూచనలు ఇచ్చాడు, అద్దెకు తీసుకున్న ఇంటిని గురించి.

ముహూర్తానికి ముందురోజు వస్తానని, రెండు రోజులుంటానని మాట తీసుకున్నాడు స్టేషన్‌లో. ఆఖరిసారిగా మళ్ళీ నా అభినందనలు తెలియజేసి, చేయివూపాను నిరంజనం కనబడేదాకా.

మార్చి నాలుగో తేదీన వెళ్ళామని ముందరే రిజర్వ్ చేయించుకున్నాను. నిరంజనం వెళ్ళాక గదిలో ఒంటరిగా వుంటే బోర్‌గావుంది. అది బోర్ కూడా కాదు. అలవాటయిన నిరంజనం లేక పోవటంవల్ల ఓ విధమయిన బెంగ, వెలితి.

ఇక నిరంజనం వుండడు గదిలో. తన ఇంట్లో భానుమతితో కాపురం చేస్తూ గడుపుతాడు. ఇన్నాళ్ళు నిరంజనం 'భవిష్యత్తు' అనకుంటున్నది రెండు మూడు రోజుల్లో 'వర్తమానం' అయిపోతోంది.

మరో రూంమేట్‌ని వెదుక్కోవాలి. సాయంత్రాలు ఆఫీసునుంచి రూంకి ఇదివరలా తిరిగిరాకుండా, పాండీబజార్ లోనో, మౌంట్‌రోడ్‌లోనో, సినిమా హాల్లోనో, స్నేహితుల ఇళ్ళల్లోనో గడిపేస్తున్నాను.

రేపు ప్రయాణం అనగా, రాత్రి నిరంజనం తిరిగి వచ్చేసాడు!

నిరంజనం ముఖం వాడిపోయివుంది. అంతేకాదు. మొహంనిండా, నిండుగా ఆ కళ్ళనిండా దిగులు, బెంగ, బాధ, భయం!!

బిత్తరపోయాను. నిరంజనం అకారణ రాకకి నాకు కారణం అంతుబట్టలేదు. తనకు మనసంతా చికాకుగా వుందనీ, దయచేసి మాట్లాడించవద్దనీ, పక్క పరుచుకుని పడుకున్నాడు నిరంజనం.

ఆ రాత్రి నిరంజనం నిద్దరపోలేదు. పక్క మీదే పొర్లుతూ గడిపాడు. విసిగించటం ఇష్టంలేక నేనూ ఏమీ ప్రశ్నించలేదు. కారణాలుమాత్రం నాలో నేనే వూహించాను చాలా రాత్రిదాకా.

కట్నందగ్గర పేచీ వచ్చివుంటుంది. భానుమతి నిరంజనం ఇదివరకు చూసిన విధంగా వుండి వుండదు. బహుశ ఏ మశూచో వచ్చి పాడయిపోయి వుంటుంది అనుకుంటున్నప్పుడు మాత్రం నా గుండెని ఎవరో నొక్కిపట్టుకున్నట్టుగా అనిపించింది.

లేదా, భానుమతిని ఏ పామో కాటేసి వుండచ్చు, పల్లెటూరు కాబట్టి. భానుమతికి ఏదో జరిగివుంటుం దనిపించింది నిరంజనం బాధ చూస్తూంటే.

భానుమతికి నిరంజనం అంటే ఇష్టం లేక పెళ్ళికి ముందే ఎవరితోనయినా లేచిపోలేదుకదా? ఛ. అలా జరిగి వుండదు. ఇంకా ఇలా చాలా చాలా వెధవ ఆలోచనలతో గడిపాను నిద్ర పట్టేదాకా.

రాత్రి నిద్రలేకపోవడంవల్ల ఆలస్యంగా లేచాను. నేను నిద్రలేచేసరికే, తలుపు దగ్గరగావేసి వెళ్ళిపోయాడు నిరంజనం. ఆఫీసుకి ఆలస్యంగావెళ్లాను. ఆ రాత్రి హోటల్లో భోజనం అయాక తిరిగివచ్చాను గదికి.

నిరంజనం అన్నం వండుకుంటున్నాడు. కారణం అడిగాను. చాలాసేపు వెలుగుతున్న స్టవ్‌వంక చూస్తూండిపోయాడు, నిశ్శబ్దంగా. నిరంజనాన్ని మళ్ళీ మాట్లాడించటం ఇష్టంలేక నేను మళ్ళీ ఆ ప్రసక్తి తీసుకురాలేదు. తర్వాత చెప్తాడని తెలుసు నాకు.

నిరంజనం రెండు రోజుల తర్వాత చెప్పాడు, తను పెళ్ళిచేసుకోకుండా హఠాత్తుగా రావడానికి కారణం. భానుమతిని పెళ్ళిచేసుకోవడం ఇక ఏ మాత్రం మనస్కరించక.

భానుమతిని వూరు వెళ్ళాక చూడనే లేదు నిరంజనం. కనబడలేదు. కాని భానుమతి చెల్లెలు వచ్చి చెప్పింది నిరంజనానికి, తన అక్కయ్య రహస్యంగా చెప్పిపంపిన సంగతి. తాడిమళ్ళలాంటి పల్లెటూరిలో పుట్టిపెరిగిన భానుమతికి వుత్తరం రాసే ధైర్యంలేదు. మద్రాస్ లాంటి పట్టణాల్లో పెరిగితే ఏమయేదో చెప్పలేనుకాని, ఆ పల్లెటూరిలో తులసి చెట్లమధ్య పెరగడంవల్ల సెంటిమెంట్ గాఢంగా వుండివుంటుంది. అందుకే చెల్లెలుచేత రహస్యంగా కబురు పంపి నిరంజనానికి తెలియచేసింది జరిగింది.

నిరంజనం నాకా సంగతి చెప్పినప్పుడు ఆ గదంతా గిర్రున తిరిగినట్లూ నా గుండె కొట్టుకోవడం హఠాత్తుగా ఆగిపోయినట్లు అనిపించింది నాకు.

ఈ లోకంలో నిరంజనం నాన్నగారిలాంటి వాళ్ళుకూడా వుంటారా అనిపించింది. నాలుగయిదు నెలల క్రితం ఓ సాయింత్రం భానుమతిని, నిరంజనం నాన్న తమ పొలంలోని పెంకుటింట్లో బలవంతంగా ఆవేశంలో...

తనని నాశనంచేసిన వ్యక్తి కొడుకుని పెళ్ళాడి, మామగారి దుర్మార్గం గురించి భర్తకి చెప్పకుండా జీవితాంతం కుమిలిపోవడంకన్నా ఇదే మంచిమార్గమేమో? అందుకే ముందరే తెలియచేసేసింది భానుమతి

భానుమతి ఇప్పుడు నిరంజనానికి తల్లితో సమానం. అందుకే అనుకుంటాను, నిరంజనం జీవితం చాలాకాలం పెళ్ళిలేకుండా ఖాళీగా గడిచింది. ఆ ఖాళీ తర్వాత భర్తీ అయింది కాని, భానుమతి గురించిన సంభాషణ మా మధ్య ఎప్పుడూ జరగలేదు ఆ తర్వాత.

అందుకే ఇప్పుడు పంతులుగా రమ్మాయి ఎక్కడుందో, ఎలా వుందో నాకు తెలియదు.

---




# జీవ మృత్యు

ఇచ్ఛాపురపు రామచంద్రం

బ్రతుకు తీపి- మరణ భీతి- మనిషికే కాదు, ప్రాణులన్నిటికీ అంతే.

పుట్టుకనుంచి చావువరకూ చేసే ప్రయాణాన్ని జీవితం అని నిర్వచించుకుంటే-ఈ జీవితంలో ఎంత వైవిధ్యం! ఎంత ఆకర్షణ!

మనిషి జీవితం మరీ రంగుల మయం.

ఒకపట్టాన అర్థంకాని యీ అస్తవ్యస్తపు వర్ణచిత్రానికి మరిన్ని రంగులు పూసుకుందుకూ మరిన్ని హంగులు చేసుకుందుకూ మనిషికెన్ని తాపత్రయాలు!

మానవ జీవితాలలో ఎన్నెన్ని రంగులు! ఎన్నెన్ని హంగులు!!

చివరకు— జీవితం చివరకు— మిగిలేదేమిటి? ఏమీలేదు. గుప్పెడు బుగ్గి.

ఎంత ఘనమైన జీవితమయినా పిడికెడు బుగ్గితో అంతంకావలసిందే కద ?

*    *    *

బ్రతుకు తీపి- మహా దొడ్డది, అమిత పెద్దది.

బ్రతుకు తీపి మనిషిచేత ఏ పనయినా చేయించగల మహత్తర శక్తివంతమయినది.

అలా ఆలకించండి. అటు పరికించండి.

డప్పులశబ్దం వినపడడంలేదూ ! వినపడకేం చేస్తుంది, వినేవాళ్ల చెవులు గింగురుమనేటట్లు- వేళ్ళు విరిగేలా వాడలా మోత మ్రోగిస్తూంటే, ఆ మునిలాడి వేళ్లలో అంత ఓపికెక్కడిదో ! ఇంతకీ ఎందుకా వాద్యసందోహం ?

మిమ్మల్నీ, నన్నూ, మరో పదిమందినీ వీలయితే యింకా ఎక్కువ మందినీ నిలబెట్టి మన దృష్టి ఆకట్టుకునేందుకు. చూడండి, అక్కడ జరుగుతున్నది- దొమ్మరాట !

ఎత్తయిన వెదురుబొంగుమీద- ప్రాణాలకు తెగించి- ఆకాశంలో పిల్లిమొగ్గలు !

సాహసంతో కూడిన సర్కస్. పడి- ప్రాణాలు తీసుకుందుకా ?

ఊహూ ఁ. కాదు. ప్రాణాలు తీసుకుందుకు కాదు, పోసుకుందుకే.

గెడచివర- ఆకసాన- చూపుకందని ఎత్తులో- పల్టీలు కొడుతున్న తల్లిని చూస్తూ- కటిక నేలమీద- కాలుతున్న ఎండలో- వేడెక్కిన అరికాళ్ళమీద నిలుచుని- వేలెడులేని ఆ పాపడు- చప్పట్లు కొడుతూ- చెమటలు కారుతున్నాడే, వీడెవడు ?

దొమ్మరిసాని కొడుకు మూడేళ్ళ బుడతడు. ముక్కుపచ్చ లారనివాడు. మూట కడుతున్నాడు. ముచ్చట కొలుపుతున్నాడు. మండుటెండలో కందిపోతూ వాడెందుకూ ?

తల్లి గెడ దిగగానే- ముఖం తుడుచుకుని తాడుమీద నడకకి సిద్ధపడగానే- ఆమె వెనుక- కొంగుపట్టుకుని- తాడు మీద- తడబడే అడుగులతో- తల్లివెంట నడిచేందుకు ?

గుడ్డుతెరిచి- గడ్డు ప్రపంచంలో అడుగుపెట్టకుండానే బ్రతుకు బరువు పంచుకోవలసిన నిర్భాగ్యుడని ఆ ముద్దుబిడ్డకు తెలునునా ! తెలియదు

ఆ సన్నని తాడుమీద అడుగు తడబడితే- లేతప్రాణం భూమిలో కలిసిపోతుందని ఆ పసివాడికి తెలుసునా ?- తెలియదు గాక తెలియదు-

మరేం తెలుసు ?

డప్పుల చప్పుడు కనుగుణంగాఅడుగు వేయాలనీ, చూపు 'అమ్మమీదే నిలపాలనీ, అంతవరకే తరిఫీదు. ఆ పై తిరకాసొస్తే ?

ఆ బుల్లి బుర్రలో అంతంత ప్రశ్న

లకు తావేలేదు. చూపు చక్కాలమీద, నడక తాడుమీద. అంతే, అంతే.

శీర్షాసనంవేసి- మొనలు పైకి పెట్టి మట్టిలో గుచ్చిన సూదులను కనురెప్పలతో తొలగించడం- దొమ్మరివాడికి వినోదమా ? కాదు కాదు. ఆ ఆట-వాడు కావాలని ఆడడంలేదు. బతుకు ఆడిస్తూంది, జీవనఖేలలో వాడో పావు. ఆట వస్తువు.

ఇదంతా దేనికి ?

జానెడుపొట్టకి - పిడికెడు అన్నం అందించడానికి, చారెడు గింజలు సంపాదించుకుందుకు. పన్నెండేళ్ళ కుర్రవాడి వీపుమీద ఆ తట్లేమిటి ? గడ్డుబ్రతుకు తరిఫీదులో తగిలిన దెబ్బల తాలూకు గుర్తులు. ఛెళ్... ఛెళ్... ఛెళ్... కమ్చీ వీపుమీద మోగాలి. నాలుగు డబ్బులు రావాలి. బతుకుమీది ఆశ

ఆట !

రుసుము - ముందు చెల్లించనక్కర లేదు. చూసి- దయకలిగితే- మనసు కరిగితే... ధర్మం. ఓ బాబు ఐదు పైసలు... ఓ రాజు పదిపైసలు... ఓ దేముడు- పావలా.

ఇచ్చిన బాబుకి ఓ సలామ్. ఇవ్వని మారాజుకి పది సలామ్‌లు.

"పదవే, ఇంకేటి సూత్తావ్ ? ఆళ్లు మనలాటోళ్ళే."

"మనంత యీనంకాదు. మనకంటే మెరుగే."

మొగాడికి పౌరుషం వొచ్చింది. ఒక్కవాడికి కోపంవెక్కువ. ఆకలికీ కోపం వెక్కువే.

"నోరుముయ్యెహె... మాటలు సెబుతున్నాది, మాటలు." కసిరాడు. మొగాడు కనక కోపంవొచ్చినా, తాపంవొచ్చినా తీర్చుకుందుకు అప్పనంగా ఓ ఆడది దొరికింది. అది మొగమహారాజు తరతరాలుగా చేసుకున్న అదృష్టం. పూర్వపుణ్యం?

కాలే కడుపుతో... మండే గుండెలతో...ఎండలో స్టేషను చేరుకున్నారు.

ఓవర్ బ్రిడ్జెక్కకుండానే ఆర్.పి.యఫ్- పోలీసెదురయ్యాడు.

ఆశగా చూశారు.

"ఎళ్లండెళ్లండి. మీకు బాగా అలవాటయిపోయింది." కసిరాడు పోలీసు.

"మూడ్రోజులై గెంజిసీళ్ళు నేవు. కూటికి ముకంవాసిపోయున్నాం.యింటిల్లిపాదీ ఒక్కటంటే ఒక్కటి. ఒక్క శవం దయసేయించండి. మీ మేలు జనమలో మరిసిపోం. మా సెర్మంతో సెప్పులు కుట్టిచ్చినా రుణంతీరదు-" పోలీసుని ప్రాధేయపడ్డాడు పోలీసు వినిపించుకోలేదు.

ఆడదికూడా వేడుకుంది. "ఒక్క శవం బాబూ. ఒక్క శవం... ఒక్కటంటే ఒక్కటే. దయసూడు దరమరాజా. దిక్కులేనోళ్ళం."

వికటంగా నవ్వాడు ఆర్.పి.యఫ్.




పోలీసు. "నేనేటి జేసేది? పేపర్లో వెయించాలి వాంటెడ్ శవం- అని. ఎవడూ సావకపోతే నేనేంజేసేది? నన్ను పీక్కుతినకండి. పొండి నన్ను సంపకండి-"

ఆలుమగలు నీరసంగా నిట్టూర్చి వెనక్కి తిరిగారు.

"మన కదురుస్టంనేదు ఈడే పొద్దుట సంగమయ్యకి పిలిచి మరీ శవం యిచ్చాడంట."

"అది ఆడి ముకసిరి, ఆడికి దచ్చినా దక్కుతుంది, శవవూ దక్కుతుంది. మన్ని జూసేటలి కేటొత్తదో- ఎప్పుడూ మొండిసెయ్యే. దచ్చినక్కర్లేదు, శవం యివ్వండన్నా యివ్వరు-"

ఎండ పేట్రేగి పోతూంది

కడుపులో ఆకలి కాలిపోతూంది.

వాళ్ళ ఆశలలో శవాలు. వాళ్ళ అన్వేషణ- శవంకోసం. ఇంతకీ వాళ్ళెవరు?

అనామకులు కారు కానీ అటువంటి వారే. శవంకోసం దేవురిస్తున్నారెందుకని? నరమాంస భక్షకులా? కాదు, కాదు. మరి?

చాలామంది అసహ్యించుకునే, భయపడే శవాలను,- వీళ్ళు ప్రేమిస్తారు! ఆప్యాయంగా కౌగలించుకుంటారు. పరసలు కలుపుకుంటారు.

జీవనపథంలో ఎన్ని చిత్ర విచిత్రాలు!

ఒక్కసారి వాళ్ళ బతుకు బొమ్మని చూద్దాం. చూస్తే తరిస్తామని కాదు. తపిస్తామని!

మనలాంటి మనుషులు- మన నడుమ మనుషులు... వాళ్లూ మనషులే.

శవం దొరికితే- పండగలా ఉంటుంది వారికి. మగశవం అయితే మరీ మజాగా ఉంటుంది.

రద్దీ రోడ్డు పక్క- పేవ్‌మెంట్ మీద శవం. మగశవం, ముఖంమాత్రమే కనిపించేలా.

కుంకుమా, పూటా, తలదిక్కున అగరొత్తులు.

జుత్తు విరబోసుకుని- గుండెలు బాదు కుంటూ ఆ శవంమీద పడి ఏడిచే ఆడది.

"నన్ను నట్టేట ముంచి పోనావా? దిక్కుమాలిందాన్ని చేసేశావా? బతుకు నడిసంవుద్రంలో నావే బపోయింది. నిన్ను బుగ్గి సెయ్యడానికేనా డబ్బు ల్లేవే, నానేటి జేసేది నాయదో?

బాబూ, కనికరించండి. దరమ రాజులూ దయసూడండి. దిక్కుమాలిన సావు... పీనుగుని బుగ్గిసెయ్యాలి. పైస వెయ్యండి పెబువులూ. వున్నెంచేసు కొండి పెద్దలూ..."

దాని నిజం మొగుడు దగ్గరలోనే ఉంటాడు. అంతా చూస్తూంటాడు. శవం మీద రాలే డబ్బుల్ని లెక్కేసుకుంటాడు. ఎక్కువ రాలుతూంటే లొట్టలేసు కుంటూంటాడు.

ఆడశవం దొరికితే మరో కథ, మరో నాటకం.

శవంపక్క మొగాడు కూర్చుంటాడు ముకం వేలేసుకుని, పుట్టెడు దుఃఖంలో మునిగినట్టు.

"నువ్వు సచ్చిపోతే ఎలాగ? ఈ బిడ్డల్ని తల్లిలేనోళ్లని జేసి- నీ దారి నువ్వు జూసేసుకుని సుకపడిపోతావా? ఏటిమధ్యలో సంసారాన్నొదిలేశావే? ఈ పిల్లల్ని ఎలా పెంచాలి? ఈ శవా న్నెలా లేపాలి? నాకు దారి కనపడ్డం లేదు. దిక్కుతోచడం లేదు.

ఏడవకండి బాబులూ. ఏడవకండి. మనంవెంతేడిసినా అమ్మ తిరిగిరాదు."

శవంపక్కన కూర్చుని మగవాడు, శవంమీదపడి పిల్లలు... అందరూ ఏడ్పులు.

మనిషన్నవాడి మనసు కరగకపోదు. ఉన్నవాడి చేతినుంచి ఒకటో అరో పైసలు రాలకపోవు. ఇంటికో యీక, యిల్లాలికో కంబళి. రాలేడబ్బులే-వాళ్ళ ఆకలి తీరుస్తాయి. అదే వాళ్ళ బ్రతుకు. శవాలే వాళ్ళ జీవనాధారం. ఈ నీచ బ్బతుకు వీళ్ళెందుకు బతుకుతున్నారు? మార్గాంతరం తోచక.

మరి- శవాలెక్కడ దొరుకుతాయి?

రైలుస్టేషన్లలో... గవర్నమెంట్ ఆస్పత్రులలో... పోలీస్‌స్టేషన్లలో...

ఎలాగ? అనాధచావులు చస్తారే... వాళ్లవే దొరుకుతాయి. అడ్రస్‌లేని శవా లను పోలీసోళ్ళే దహనం చేయించాలి. శవానికి పాతికో వరకో కర్చులకింద యిస్తుంది ప్రభుత్వం. పాతికా జేబులో వేసేసుకోరు పోలీసులు. ఐదో అరో రిక్షావాడికిచ్చి శవాన్ని పాతెయ్యడమో, సముద్రంలో పారెయ్యడమో చెయ్య మంటారు. ఆ రిక్షావాడు_ మన కథలో లాటి శవాధారులకి (అనవచ్చునా?)దయ గానో డబ్బులుతీసుకునో యిచ్చేస్తాడు.

వాళ్లేంచేస్తారో మనం చూడనే చూశామ్. మనిషి-మనిషిమీద వ్యాపారం చేసే ప్రస్తుత వ్యవస్థలో_మనిషి- శవాల

మీద వ్యాపారం చేయడం ఏమంత అబ్బురం? విడ్డూరం?

మన కథానాయకీ నాయకుల పేర్లు రంగమ్మా, నారాయణా. వీళ్ళకి ప్రత్యర్థులూ, పోటీదార్లూ తక్కువేమీలేరు. వారిలో సంగ(వయ్య ఒకడు. సారాపోసి శవాలను కొనగలిగే సంగమయ్య-శవాధారులలో స్థితిమంతుడిగా జమ. పోలీసులే కానీండి, ఆసుపత్రి వార్డ్‌బోయ్‌లే కానీండి- డబ్బుకి లొంగని వారుంటే ఉడవచ్చు. శవాన్నమ్ముకోడం ఏమిటి- నీచం, అనుకోవచ్చు. కాని- సారా డబ్బుకిందకి రాదు. బహుమతి కిందకొస్తుంది. అదుకే వాళ్లంతా సంగమయ్య అందించిన సారా తీసుకుని శవాన్నిచ్చేందుకు సంకోచించరు సరికదా సంతోషిస్తారు. అతని వ్యాపారంలో యిదే కిటుకు. భారీఎత్తులో కనుక కొన్ని సులభమార్గాలూ చవకదారులూ కూడా సంగ(వయ్యకి తెలుసు కోవెల పూజారినుంచి అగరొత్తులూ, పూలూ, పసుపూ కుంకుమూ వగైరాలు చవగ్గా కొంటాడు. కనుక- శవంమీద పెట్టే పెట్టుబడి తక్కువ. రాబడి ఎక్కువ. మరి- వ్యాపారం లాభసాటిగా కాక మరెలా ఉంటుంది?

"దేసనుకి పోదారి పద. రోజు బాగుంటే దొరుకుతుంది."

కాళ్ళు మాడుతూంటే- పోలీస్టేషనుకి నడిచారు, ఆసుపత్రికి నడిచారు

రెండుచోట్లా మొండిచెయ్యి ఎదురైంది.

మధ్యాహ్నం మూడుదాటింది. చెట్టుకిందకి చేరుకున్నారు చేయగలిగిందేమీ లేక.

చెట్టు-నీడనిస్తుంది. ఆకలి తీర్చదు. తీర్చలేదు.

శవం దొరకాలి. ఆకలి తీరాలి.

శవంకోసం కలవరిస్తూనే శోషవచ్చినట్లు పడుకున్నారు.

ఎండనపడి తిరిగారేమో- వొంటిమీద స్పృహే లేకపోయింది.

* * *

స్థానిక పత్రికలో బాక్సుకట్టి మరీ ప్రకటించబడిందొక వింత.

నెలకి ఐదువందలు దొరికే ఉద్యోగం చేస్తూకూడా-భార్యా పిల్లలున్న ఉద్యోగి- స్కూటరు కొనుక్కోలేక పోయినందుకు చింతిస్తూ- ఇక ఆ కోరిక తీరదని-ఆత్మహత్య చేసుకున్నాడు.

పేపరు చదివినవాళ్ళు ముక్కుమీద వేలేసుకున్నంత పనిచేశారు.

పేపరు కందని వార్త ఒకటుంది.

ఊరిచివర మర్రిచెట్టుకింద- నాలుగు శవాలున్నాయి

అవన్నీ ఆకలిచావులు.

శవం దొరక్కపోవడంతో- ఆ నలుగురూ శవాలైపోయారు.

ఇది విచిత్రమే కానీ- అట్టే మందికి తెలియదు.

అసలు- జీవితానికి మించిన విచిత్రం ఏముంది?

మనిషి-ఎంత ఎదిగినా- ఎంత ఎత్తుకి ఎగిరినా అందకుండా ఊరించేది జీవితం తప్ప మరేముంటుంది?







(గత సంచిక తరువాయి)

## 5

మర్నాడు రాత్రి మంత్రికుమార్తె తిరిగి ఇలా కథ చెప్పసాగింది.

ఉదయంవేళ రాజుగారు కోరిన కొన్నివస్తువులు తెద్దామని కోశాధికారి ఖజానాకు వెళ్ళి తలుపులు తెరచి చూసే సరికి అది శూన్యంగా ఉన్నది. కోశాధికారి పెద్దకేక పెట్టి మూర్ఛపోయాడు.

స్పృహ రాగానే అతను చేతులెత్తి పరిగెత్తుతూ రాజుగారి దగ్గిరికి వెళ్లి, "మహారాజా, రాత్రి ఖజానా ఖాళీ అయిపోయింది" అన్నాడు.

"నీచుడా, నా ధనమంతా ఏం చేశావు?" అన్నాడు రాజు.

"అల్లామీద ఒట్టు, నేనేమీ చెయ్యలేదు. అది ఏమయిందో, ఎలా పోయి ఉంటుందో కూడా నాకు తెలీదు. నిన్న రాత్రి తనిఖీచేసి చూశాను, కాని ఈ ఉదయం అంతా ఖాళీ. వేసిన తలుపులు వేసినట్టున్నాయి. వేసిన తాళాలు వేసినట్టున్నాయి. కట్టిన గొలుసులు చెక్కు-చెదరలేదు. దోచిన వాడెవడోగాని మామూలు దొంగకాడు."

"సంచులు రెండూ కూడా పోయాయా?"

"పోయాయి."

రాజుకు మతి చెదిరింది. ఆయన కోశాధికారిని వెంటబెట్టుకుని ఖజానాకు వెళ్లి చూశాడు. ఖజానాకు ఎలాటి హానీ కలగకుండానే అది ఖాళీ అయింది.

"ఇంత సాహసం చేసినవాడెవడు?" అని అరిచి, రాజు పట్టరాని కోపంతో దర్బారును హాజరుపరచటానికి పరిగెత్తాడు.

అమీర్లూ, ఇతర అధికార్లూ రాజు వద్దకు వేగంగావచ్చి చేరి, రాజుగారి

దురాగ్రహానికి కారణం ఏమైఉంటుందని ఒకరినొకరు అడుగుకున్నారు.

వాళ్ల అనుమానాన్ని తీరుస్తూ రాజు, "గతరాత్రి ఎవరో నా ఖజానాను పూర్తిగా ఊడ్చేశారు. ఈ పని చెయ్య సాహసించి, నాకు ఆగ్రహపాత్రుడైన వాడెవడో తెలియదు. కోశాధికారి నడిగితే వివరాలు చెబుతాడు," అన్నాడు.

అందరూ కోశాధికారి చుట్టూ మూగారు. ఆయన తన కథ అంతా మళ్లీ చెప్పాడు. "నిన్నరాత్రి ఖజానా నిండుగా ఉన్నది. ఇవాళ ఖాళీగా ఉన్నది. గోడలో ఒక చిన్న కన్నంగాని, తలుపులో చిన్న బెజ్జంగాని లేదు."

రాజు ముఖం చూడటానికి భయం వేసి అందరూ తలలు దించుకున్నారు.

ఇంతలో అక్కడికి, సాలిమ్, సలీమ్‌లను పట్టిఇచ్చిన ఉద్యోగే వచ్చి, "మహారాజా, తెల్లవార్లూ నేను కన్ను మూయ్యలేదు. తెల్లవార్లూ అద్భుతమైన పనివాళ్లు ఏదో కట్టడం చూస్తూ ఉండిపోయాను. తెల్లవారేసరికి ఒకఅద్భుతమైన రాజభవనం వెలిసింది. రాత్రికి రాత్రే వెలిసిన ఆ భవనంలాటిది ప్రపంచంలో ఎక్కడా ఉండదు. నేను వాకబు చెయ్యగా తెలిసినదేమంటే, ఉమర్ అనే ఆయన కొడుకు జూదర్ అనేవాడు దాన్ని కట్టించాడట. అతను ఇటీవలనే దేశాంతరాల నుంచి, ఓడమీద, అనేక మంది ఆడ, మగ, పిల్ల బానిసలనూ, బంగారాన్నీ తెచ్చాడట. ఇప్పుడు మహారాజులాగా తన భవనంలో కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు," అన్నాడు.

"కారాగారాన్ని వెతకండి!" అని అరిచాడు రాజు.

కారాగారం నుంచి సాలిమ్, సలీమ్‌లు తప్పించుకున్నారని వినగానే రాజుకు అర్థమయింది. వాళ్లను కారాగారం నుంచి తప్పించినవాళ్లే ఖజానా కొల్లగొట్టి ఉండాలి.

"ఈపని చేసినవాడు జూదర్. వాడే నా సంచులుకూడా ఎత్తుకుపోయాడు. వజీర్, ఒక అమీరు వెంట యాభై మంది సిపాయిలనుపంపి, వాళ్ల ఆస్తిని స్వాధీనంచేసి, వాళ్ళను పట్టితెప్పించండి. అందరినీ ఉరితీస్తాను," అని రాజు ఆజ్ఞాపించాడు.

అప్పటికీ ఆయన ఆగ్రహం చల్లారలేదు, "తక్షణం ఆ పని చెయ్యండి. వాళ్ల చావు చూడాలని తహతహ లాడుతున్నాను," అన్నాడు.

వజీరు వినయంగా, "మహారాజా, తమరు ఉదారంగానూ, దయగానూ చరించండి. అల్లా కరుణామయుడు గదా! ఒక్కరాత్రిలో రాజభవనం లేపగలవాడు ఎవరికీ వెరవడు. అతనివద్దకు పంపే అమీరుకు ఏం జరుగుతుందో అని

నా భయం! నేను ఇంతకన్న మంచి మార్గం చూసి, నిజం తెలుసుకునేదాకా కొంచెం ఓపిక పట్టండి. నిజం తెలిసి పోయినాక ఈ మనుషులపట్ల ఎలా ప్రవర్తించాలో అదే తెలుస్తుంది,'' అన్నాడు

''అయితే మీ సలహాఏమిటి?'' అని రాజు అడిగాడు.

"అమీరును పంపటమైతే పంపండి. పంపి. జూదర్‌ను రాజభవనానికి ఆహ్వానించండి. అతను ఇక్కడికి వచ్చినాక, మంచిమాటలతోనే మభ్యపెట్టేస్తాను. ఆ తరవాత చేయదగినది ఏమిటో చూతాం. అతని శక్తి గొప్పదైతే, అతన్ని మోసంతో పట్టుకుందాం? సాధారణ శక్తి అయితే బలప్రయోగంతో పట్టుకుందాం. ఎలా చేసినా అతను మనకు దొరికి పోతాడు. తరవాత మీ చిత్తం వచ్చినట్టు చేయవచ్చు," అన్నాడు వజీరు.

"అయితే వాణ్ణి పిలిపించండి!'' అన్నాడు రాజు.

వజీరు ఉత్మాన్ అనే అమీరునుపిలిచి ''నువ్వువెళ్ళి జూదర్‌ను కలుసుకుని ఈ రోజు రాజుగారి విందుకు పిలుచుకురా. అతన్ని వెంటతీసుకు రాకుండా తిరిగి రావద్దు,'' అన్నాడు.

ఈ ఉత్మాన్ అనేవాడు వట్టి మూడుడూ, అతిశయం గలవాడూనూ. అతను జూదర్ భవనం వద్దకు వచ్చే సరికి, అతనికి ఒక కొజ్జావాడు అందమైన వెదురుకుర్చీలో కూర్చుని, ద్వారం వద్ద కనిపించాడు. ఉత్మాన్ దగ్గిరికి వచ్చినా, ఆ కొజ్జావాడు లేవలేదు సరి కదా, తలతిప్పి చూడనైనా లేదు.

"ఒరే, బానిసవాడా! నీ యజమాని ఎక్కడ?'' అని ఉత్మాన్ వాణ్ణి అడిగాడు.

కొజ్జావాడు కదలకుండా, తలకూడా తిప్పకుండా, " రాజభవనంలో, '' అన్నాడు.

అమీరుకు మండిపోయింది. ''పాపిష్టి కొజ్జాకుంకా! నేను మాట్లాడుతుండగా అలా దర్జాలుపోయి కూర్చుంటావేం?'' అని అతను అరిచాడు.

''ఇంక అదే మాట్లాడకు! పో అవతలికి!" అన్నాడు కొజ్జా

కోపం పట్టలేక అమీర్ వాణ్ణి అధికార దండంతో కొట్టబోయాడు. ఆ కొజ్జావాడు ముద్రిక తాలూకు భూతమని అతనికేం తెలుసూ? అమీర్ ఉద్దేశం కని పెట్టి, లేచి, ఒక కన్నుమూసి రెండో కన్నుతో అమీరునుచూస్తూ, ఉఫ్‌మని ఊది అమీర్‌ను పడగొట్టి, తనదండంతో అతన్ని నాలుగు దెబ్బలు వేశాడు.

తమ యజమానికి జరిగిన ఈ పరాభవం చూసి, అమీర్ వెంట వచ్చిన యాభైమంది సైనికులూ ఆగ్రహావేశంతో కత్తులుదూసి, కొజ్జామీదికి ఉరికారు.

"కుక్కల్లారా, కతులు దూస్తారా? క్షణం ఉండండి!" అంటూ కొజ్జా కొద్ది



మందిని గుప్పెట్లోకి తీసుకుని, వాళ్ల కత్తులతోనే వాళ్లడొక్కల్లో పొడిచాడు. తరవాత అతను వాళ్లను నేలరాచి మట్ట గిస్తూంటే, మిగిలిన సైనికులు పారి పోయారు. అందరికన్న ముందు పరిగె త్తినవాడు అమీరు. వాళ్లు కనుచూపుమేర దాటగానే కొజ్జా తిరిగి కుర్చీలో చేరగిల బడ్డాడు.

పారిపోయినవాళ్ళు అదే పరుగున రాజుగారిని చేరుకున్నారు. ఉస్మాన్‌కు జరిగిన మర్యాద తెలుసుకుని రాజు అమితంగా మండిపడి, "ఈ కొజ్జామీదికి నూరుగురు సైనికులను పంపండి!" అని ఆజ్ఞాపించాడు.

నూరుగురూ వెళ్ళి, చావుదెబ్బలు తిని రాజువద్దకు తిరిగి వచ్చారు. రాజు రెండు వందలమంది సైనికులను పంపాడు. వారిలో ఎక్కువమంది చచ్చారు.

అప్పుడు రాజు వజీరుతో, "అయిదు వందలమందిని వెంటబెట్టుకుని మీరేవెళ్ళి, ఆ దుర్మార్గులను నా దగ్గిరికి తీసుకు రండి!" అన్నాడు.

''మహారాజా, నావెంట ఎవరూవద్దు. నిరాయుధుణ్ణిగా నేను ఒక్కణ్ణే వెళ తాను," అన్నాడు వజీరు.

''మీ యిష్టం," అన్నాడు రాజు.

వజీరు తన మామూలు ఆయుధాలు అవతలపెట్టి, తెల్లని అంగీ ధరించి, చేతిలో ఒక తావళం తీసుకుని నింపాదిగా నడుచుకుంటూ జూదర్ ఇంటి ముందు చేరాడు. ఆయన చిన్నగా నవ్వుతూ కొజ్జాను సమీపించి పలకరిస్తూ, ఎదురుగా కూర్చున్నాడు.

"ఏం కావాలి, నరుడా?" అని కొజ్జా అడిగాడు.

'నరుడా' అన్న సంబోధన వినగానే ఆ కొజ్జా భూతమని తెలిసి, వజీరుకు భయం పుట్టింది.

"జూదర్ ప్రభువుగారు లోపల ఉన్నారా?" అని ఆయన అడిగాడు.

"భవనంలో ఉన్నారు."

"అయ్యా, నేను మిమ్మల్ని వేడుకుంటాను. మీరు లోపలికివెళ్ళి, వారితో 'షమ్స్ అల్‌దౌలా రాజుగారు తమ దర్శనం కోరుతున్నారు. తమ గౌరవార్థం విందు ఏర్పాటు చేస్తున్నారు. తమ అభివాదాలు తెలియజేసుకుంటూ, తాము వచ్చి వారి లోగిలి పావనంచెయ్యవలసిందిగా కోరుతున్నారు' అని చెబుతారా?"

''కొంచెం ఆగు. నేను వెళ్ళి వారి చిత్తం తెలుసుకుని వస్తాను,'' అన్నాడు కొజ్జా.

అతను లోపలికివెళ్ళి జూదర్‌తో, "ప్రభూ! రాజు మొట్టమొదట ఒక ఆమీరువెంట యాభైమంది సైనికులను పంపాడు. వారిని ఓడించాను. తరవాత వందమందిని పంపాడు. వాళ్లను చెదరగొట్టాను. తరవాత రెండువందలమందిని పంపితే దావగొట్టాను. ఇప్పుడు ఆ రాజుగారి వజీరు, నిరాయుధుడుగా, తెల్లని అంగీ ధరించి వచ్చి, తమరిని విందుకు ఆహ్వానిస్తున్నాడు. ఏమంటారు?" అని అడిగాడు.

"ఆ వజీరును ఇలా తీసుకురా," అన్నాడు జూదర్.

కొజ్జావెంట వజీరు లోపలికివచ్చి సింహాసనాసీనుడై ఉన్న జూదర్‌ను చూశాడు. ఏ కాలంలోనూ ఏ రాజుకూ అలాటి సింహాసనం లేదు. జూదర్ కాళ్ల కింద అద్భుతమైన తివాసీ పరిచిఉన్నది. జూదర్‌లో ఏ సుల్తానుకూ లేని ఠీవీ, అందమూ వజీరుకు కనిపించాయి. ఆయనకు భవనం సౌందర్యం చూస్తుంటేనోట మాటరాలేదు. తానొక బిచ్చగాడి నన్న భావం కలిగింది.

ఆయన జూదర్‌కు వంగి సలాము చేసి, ఆశీర్వదించాడు.

"ఏంకావాలి?" అని జూదర్ అడిగాడు.

వజీరు వినయంగా, "నా మిత్రుడైన

యువ



షమ్సు అల్‌దౌలా రాజు నాద్వారాతమకు అభివాదాలు పంపుతున్నారు. మిమ్మల్ని ఒక్కసారి చూడాలని ఆయన మన స్ఫూర్తిగా కోరుతున్నారు. అందుకుగాను తమ గౌరవార్థం విందు ఏర్పాటు చేస్తున్నారు ఆయన కోరిక మన్నిస్తారా?" అని అడిగాడు.

"ఆయన నాకు మిత్రుడే గనక నా అభివాదాలు ఆయనకు అందజేసి, ఆయననే వచ్చి నన్ను చూడమనండి" అన్నాడు జూదర్.

అతను ఉంగరాన్ని రుద్దేసరికి భూతం వచ్చాడు. జూదర్ భూతంచేత అందమైన అంగీ తెప్పించి, వజీరుతో, ఇది మీకోసమే. ధరించండి. వెళ్ళి రాజుతో మీరు విన్నదీ, కన్నదీ చెప్పండి" అన్నాడు.

వజీర్ అపూర్వమైన ఆ అంగీధరించి రాజువద్దకు తిరిగివచ్చి, జూదర్ భవనాన్ని కీర్తిస్తూ వర్ణించి, "జూదర్ మిమ్మల్ని ఆహ్వానిస్తున్నాడు," అని చెప్పాడు.

"యోధులారా, గుర్రాలమీద నా వెంట బయలుదేరండి. నేను నా సమరాశ్వం మీద జూదర్‌ను చూడబోతున్నాను," అన్నాడు రాజు.

రాజు సైనికశ్రేణులతో వస్తూఉండటం జూదర్ చూసి, భూతంతో, "నీ వాళ్లను మానవ సైనికదళాల రూపంలో రెండు సోల్బులలో నిలబెట్టు. రాజువాటి మధ్యగా వచ్చేటప్పుడు నా సైనికుల సంఖ్యనూ, బలాన్నీ చూసి అదిరిపోవాలి; తన శక్తికన్న నా శక్తి ఎక్కువని గ్రహించాలి," అన్నాడు.

రాజు ప్రాంగణం ప్రవేశించేసరికి ఆయనవచ్చే దారికి అటూయిటూ రెండు బారులుతీరి అతిభయంకరులూ, దీర్ఘకాయులూ, కవచధారులూ అయిన సైని

కులు నిలబడి ఉన్నారు. రాజు కాస్త చలించాడు.

ఆయన వచ్చేసరికి జూదర్ సింహాసనంమీద మరింత ఠీవిగా కూర్చొని ఉన్నాడు. రాజు తలవంచి శుభాకాంక్షలు తెలిపాడు. కాని జూదర్ మర్యాదగా లేవలేదు, ప్రతి శుభాకాంక్షలు చెప్పలేదు, చివరకు రాజును కూర్చోమని అయినా అనలేదు. రాజు ఎంతసేపు అలా నిలబడి ఉండవలసి వచ్చిందంటే, ఆయనకు అవమానమై ఉండాలో, వెళ్ళిపోవాలో కూడా తెలియలేదు.

చిట్టచివరకు జూదర్ నోరువిప్పి, "నువు అనాధ ప్రజలను పీడించి, వారి సొత్తు అపహరించటం భావ్యమంటావా?" అని అడిగాడు.

"అయ్యా, నన్ను దయచేసి క్షమించండి. లోభంతోనూ, దురాశతోనూ నేను మీ అన్నల విషయంలో అలా ప్రవర్తించాను. అదీగాక అది నా ప్రారబ్ధం. ప్రపంచంలో తప్పే లేకపోతే క్షమాపణకూడా ఉండదుగద," అంటూ రాజు ఇదే ధోరణిలో తనను సమర్థించుకుంటూ, క్షమాపణ చెప్పుకుంటూ చాలా సేపు మాట్లాడి, నీతిపద్యాలు కూడా చదివాడు.

చిట్టచివరకు జూదర్ "అల్లా నిన్ను క్షమించుగాక!" అని రాజును కూర్చోమన్నాడు.

తరవాత అతను రాజుకు అభయ వస్త్రదానం చేసి, తన అన్నలచేత విందు భోజనం పెట్టించాడు. భోజనాలు అయాక అతను రాజు వెంట వచ్చిన వారందరికీ మంచిమంచి బట్టలూ, బహుమానాలూ ఇచ్చాడు. చివరకు రాజు సెలవు పుచ్చుకుని వెళ్ళిపోయాడు.

ఆదిమొదలు రాజు రోజూ జూదర్ భవనానికివచ్చి తనకాలమంతా అక్కడే గడుపుతూ. అక్కడి నుంచే రాచకార్యాలన్నీ నడుపుతూ రాసాగాడు. ఇద్దరి మధ్యా గాఢమైన స్నేహబంధం ఏర్పడి, చాలాకాలం వర్ధిల్లింది.

కాని ఒకరోజు రాజు వజీరుతో ఏకాంతంలో ఉన్నప్పుడు, "వజీర్, జూదర్ నన్ను చంపి, నారాజ్యం కాజేస్తాడని భయంగా ఉంది," అన్నాడు.

"మీ అధికారానికి భంగం కలుగుతుందనుకోను మహారాజా. అతను మీ సింహాసనాన్ని ఆశించడు. కాని అతని వల్ల మీ ప్రాణానికి ప్రమాదం ఉన్నదని మీకు నిజంగా భయం ఉన్నట్టుంటే, మీ కుమార్తెను అతనికిచ్చి పెళ్ళిచేసి, అర్ధ రాజ్యం ఇచ్చెయ్యండి. ఇద్దరూ సమాన హోదాగలవా రవుతారు" అన్నాడు వజీర్.

"వజీర్ ఈపని చేసిపెట్టగలరా?" అన్నాడు రాజు.

"అదెంతపని? మీరు అతన్ని విందుకు పిలవండి. మీరు పెద్దహాలులో కూర్చునిఉండగా, మీకుమార్తె దివ్యంగా



అలంకరించుకుని, వాకిలివద్ద తళుక్కున మెరిసి వెళ్ళిపోతుంది. జూదర్‌కు ఆమెను చూసి మతిపోయి, మోహ పాశంలో పడిపోయి, ఆమెను గురించి వివరాలు అడుగుతాడు. నేను అతని చెవిలో రహస్యంగా ఆమె మీ కుమార్తె అని చెప్పి, ఆమెను పెళ్ళాడగోరుతున్నా నని అతని నోటనే అనిపిస్తాను. వాళ్ళ పెళ్ళి అయినాక ఇక మీ ఇద్దరి మధ్య స్థిరమైన శాంతి ఉంటుంది. అతనుపోయి నాక అతని సంపద అంతా మీదే!" అన్నాడు వజీరు.

వజీరు ఆలోచనకు రాజు హర్షించి, విందుకు ఏర్పాట్లుచేసి, జూదర్‌నుఆహ్వా నించాడు. జూదర్ సంతోషంగా ఒప్పు కున్నాడు. రాజభవనంలోని పెద్ద

హాలులో పొద్దుకూకినదాకా విందు సాగింది.

అంతకు పూర్వమే రాజు రాణితో, తమ కుమార్తెను రత్నాభరణాలతో చక్కగా అలంకరించి హాలు వాకిలి పక్కగా పంపించమన్నాడు. ఆ పిల్ల రవ్వల ధగధగలతో పోతూ కనిపించే సరికి, జూదర్ మూలుగులాటి నిట్టూర్పు విడిచాడు. అతని అవయవాలు జావగారి పోయి, ముఖం పాలిపోయింది. అతన్ని కామమూ, మోహమూ, ప్రేమా ఒక్క సారిగా కుంగదీశాయి.

వజీరు అతని స్థితి చూసి, "ప్రభూ, ఎందుకలా ఉన్నారు? ఒంట్లో అస్వస్థత లేదుకదా? ఏమిటి బాధ?" అని అడిగాడు.

"ఆ పిల్ల, వజీరుగారూ! ఆమె ఎవరి పిల్ల? ఆమె నా మనస్సునూ, హృదయాన్నీ దోచుకున్నది," అన్నాడు జూదర్.

"ఆమె మీ మిత్రులైన రాజుగారి కుమార్తె. మీకు అంతగా ఆమెపైమనసు పోతే ఆయనతో మాట్లాడి, ఆమెను మీ కిచ్చి పెళ్ళిచెయ్యగలరేమో అడుగుతాను" అన్నాడు వజీరు.

''ఆపని చెయ్యగలిగితే, మీరు ఏమడిగితే అది ఇస్తాను" అన్నాడు జూదర్.

వజీరు రాజును చేరబోయి, "మహారాజా, మీ మిత్రుడు జూదర్ మీకుటుంబంతో బంధుత్వం కోరుతున్నాడు. మీ కుమార్తె అసియాను అతను పెళ్ళాడతాడట. నేను మధ్యవర్తి పనిచేస్తాను. పెళ్ళి కుమార్తె ఒలికింద మీరుకోరినదిఇస్తాడు" అన్నాడు.

"ఒలి సమస్యలేదు. నా కుమార్తె అతని సొత్తే. అతను ఆమెను భార్యగా పరిగ్రహిస్తే దాన్ని నేనుమహాభాగ్యంగా పరిగణిస్తాను," అన్నాడు రాజు.

ఆరాత్రి వ్యవహారం అక్కడ ఆగిపోయింది.

మర్నాడు ఉదయం రాజు దర్బారు తీరి, షేక్ అల్ ఇస్లామ్ అనే అయనను ప్రత్యేకంగా పిలిపించాడు. పెద్దలందరి సమక్షంలో, నిండు సభలో జూదర్ తన కోరిక ప్రకటించాడు. రాజు తనసమ్మతి తెలిపాడు.

వెంటనే లగ్నపత్రం తయారయింది. జూదర్ రాజుకు ఒక సంచినిండా బంగారమూ, రత్నాలూ కానుకపెట్టాడు. బాజాలు మోగాయి. వివాహం జరిగింది. విందులూ, వినోదాలూ ఒకవంక సాగుతూ ఉండగానే జూదర్ రాజకుమార్తెతోసహా శోభనంగది ప్రవేశించి ఆమెను సొంతం చేసుకున్నాడు.

జూదర్‌కూ, రాజుకూ మధ్య చాలా కాలం సఖ్యం కొనసాగింది. తరవాత రాజు చనిపోయాడు. సైనికులు జూదర్‌ను తమకు సుల్తానుగా ఉండమని వేడుకున్నారు. మొతట అతను ఒప్పుకో

లేదు, కాని వాళ్లుపట్టుబట్టి అతనికి రాజ్యాభిషేకం జరిపేశారు.

అతను రాజవుతూనే, తన మామ గారిని సమాధిచేసిన చోట పెద్ద మసీదు కట్టించి, దానికినిధులు ఏర్పాటు చేశాడు. అతను తన అన్నలిద్దరినీ వజీర్లుగా నియమించాడు.

ఒక సంవత్సరం ప్రశాంతంగా గడిచింది.

అప్పుడు సాలిమ్, సలీమ్‌తో, "ఇలా మనం ఎంతకాలం జూదర్‌కు సేవలు చెయ్యాలి? మన జన్మకిక స్వతంత్రంగా బతికే యోగంలేదా?" అన్నాడు.

"వాణ్ణి ఎలా చంపుతావు ? వాడి ఉంగరమూ, సంచీ ఎలా సంపాదిస్తావు? అలాటి ఆలోచన నువే చెయ్యి, నాకన్న చురుకైన బుర్ర నీది,'' అన్నాడు సలీమ్,

"సరే, నేను వాణ్ణి చంపినాక నేనే సుల్తానును కావాలి. ఉంగరమూ సంచీ నాకే ఉంటుంది. అయితే నువు నాకు వజీరుగా ఉండి, వాటివల్ల లాభం మటుకు పొందవచ్చు. ఏమంటావు?"

సలీమ్ అందుకు సమ్మతించాడు.

సాలిమ్ జూదర్ వద్దకు వెళ్ళి, "తమ్ముడూ, నీకు విందుచేసి ఎంతో కాలమయింది. ఇవాళ చీకటిపడ్డాక మా ఇంటికి భోజనానికి వస్తావా?"అన్నాడు.

"ముందు ఎవరి ఇంటికిరాను?" అని జూదర్ అడిగాడు.

"ఇవాళ మా యింటికి రా. రేపు చిన్నన్న ఇంటికి పోదువుగాని.''

వెంటనే జూదర్ సాలిమ్ వెంట అతను ఉండే భాగానికి వెళ్లాడు. అతనికి జరగనున్నది ఏమాత్రమూ తెలీదు. అతను మొదటి ముద్ద మింగాడో లేదో అందులో ఉండిన విషానికి అతనిశరీరం చిట్లిపోయి, కండలు వెళ్లుకొచ్చాయి.

సాలిమ్ అతని చేతినుంచి మంత్రపు ఉంగరాన్ని తీయటానికి వేలు కోసెయ్యవలసి వచ్చింది. అతను ఉంగరాన్ని రుద్దగానే భూతం ప్రత్యక్షమై ''ఏం సెలవు?'' అని అడిగాడు.

"నా తమ్ముడు సలీమును చంపి, వాడి శవాన్ని ఈ శవంతోబాటు సేనాధిపతుల ముందు పడెయ్యి," అన్నాడు సాలిమ్.

భూతం అతను చెప్పినట్టే సలీమును కూడా చంపి, విందుచేస్తున్న సేనాధిపతుల ముందు రెండు శవాలనూ పడేశాడు. వాళ్ళు తినటంమాని, రెండు శవాలనూ గుర్తించి, కలతపడి పోయారు.

ఆ సమయంలో సాలిమ్ అక్కడికి వచ్చి, వాళ్లతో, "మీరు విచారించక, భోజనాలు కానియ్యండి. జూదర్ మంత్రపుటుంగరం ఇప్పుడు నాది అయింది. ఈ ఉంగరం తాలూకు భూతం ఇప్పుడు నా బానిస. నాకు పోటీగా ఉండకుండా సలీమ్‌ను చంపించేశాను. వాడు ద్రోహి, మాయావీనూ.



జాదర్ చనిపోవడంచేత నేనే రాజును. మీరు నన్ను రాజుగా ఆమోదిస్తారా? లేక భూతం వాతపడతారా?'' అన్నాడు.

"మిమ్మల్ని రాజుగా ఆమోదిస్తాం" అన్నారు వాళ్ళు.

సాలిమ్ తన తమ్ములకు ఉత్తర క్రియలు జరిపించి, వైభవంగా పట్టాభి షేకం చేసుకుని, తన తమ్ముడి భార్యను పెళ్ళాడాలన్న కోరిక ప్రకటించాడు.

"ఆమె నాలుగునెలల పదిరోజుల పాటు వైధవ్యదీక్ష జరిపిన అనంతరం అలాగే పెళ్ళాడవచ్చు" అన్నారుసభికులు.

"అలాంటి మూఢాచారాలలో నాకు నమ్మకంలేదు. నేను ఈ రాత్రే ఆమె వద్దకుపోతున్నాను,'' అన్నాడు సాలిమ్.

కాజీలు విధిలేక వివాహపత్రం రాశారు. కొందరు వెళ్ళి ఆసియాకు ఈ సంగతి తెలిపారు.

ఆ రాత్రి సాలిమ్ తనగదిలోకి వచ్చి నప్పుడు ఆసియా అతనికి సంతోషంగా స్వాగతం తెలిపి, తాగటానికి అతనికి షర్బత్ ఇచ్చింది. అది తాగుతూనే సాలిమ్ చచ్చిపడిపోయాడు. అతని పేగులు వెళ్ళుకొచ్చాయి.

ఆసియా అతనిచేతి మంత్రపు టుంగ రంతీసి, దానివల్ల మరే ఘోరాలూ జరగ కుండా, దాన్ని ముక్కలుగా చితక కొట్టేసింది. అలాగే ఆమెమంత్రపుసంచిని కూడా రెండుగా చించి, షేక్ అల్ ఇస్లామ్‌ను పిలిచి, జరిగినదంతా చెప్పి, "మరోసుల్తానును ఎన్నుకోండి" అన్నది.

ఇలా కథపూర్తిచేసి షహరాజాద్, "తరవాత ఏమయిందో నాకు తెలియదు. కాని ఇంతకన్న కూడా అతివిచిత్రమైన కథ మరొకటి ఉన్నది" అంటూ తెల్లి వారుతూ ఉండటంచూసి, మౌనం వహిం చింది.

ఆ కథకూడా వినాలన్న కోరికతో రాజు ఆమె శిరశ్ఛేదాన్ని ఆనాటికి వాయిదా వేశాడు.

# జాగరూకుడు




**మధురాంతకం రాజారాం**

చెప్పకుండా పెట్టకుండా వచ్చిపడింది రామలింగంపైన—బంధువుల మూక గాదు, ట్రాన్స్ఫరు ఆర్డరు!

ఐనా రామలింగానికి ఆనందమే కలిగింది. వచ్చింది ట్రాన్స్ఫరే అయినా అమావాస్యతో కలిసివచ్చిన తద్దినంలా దానిలో ప్రమోషను గూడా అంతర్లీనమై వుండడమే అందుకు కారణం.

అందరూ వుద్యోగాలు చేయడం వేరు. రామలింగం వుద్యోగం చేయడం వేరు. అసలు ఏ పనైనా మెలకువతో చేయడం రామలింగం స్వభావం. ఆ మాటకొస్తే మెలకువా, దూరదృష్టి- అలాటివన్నీ కలిసికట్టుగావచ్చి యితఃపరం బెరుగమని రామలింగాన్ని ఆశ్రయించాయని గూడా చెప్పుకోవచ్చు అంతెందుకూ,

ఏరు ఏడామడల దూరంలో వుందని చెప్పండి—పంచ పైకెగగట్టి రామలింగం ఆ క్షణంనుంచే అప్రమత్తుడై పోతాడు!

మానవుడు తెలివితేటలు కలిగివుండడం వేరు. అవి తనకున్నాయన్న ఎరుకను కలిగివుండడం వేరు. రామలింగం దగ్గర ఈ రెండు గుణాలూ పుష్కలంగా వున్నాయి.

రామలింగం ఉద్యోగ నిర్వహణకొక ఉపమానంకోసం ఆలోచించినట్టయితే నూటనాలుగు డిగ్రీల టైఫాయిడ్ జ్వరం తటాలున స్ఫురిస్తుంది. శరీరంపైన స్పృహ వున్నంతవరకూ రోగికి తనకు జ్వరం కాస్తున్నదన్న విషయం తప్పితే మరొక ధ్యాస వుండదు. ఆ స్పృహ దప్పిన తర్వాత పలవరింపులూ, కలవరింతలూ ప్రారంభమౌతాయి, రామలింగాన్ని ఆవేశించిన ఉద్వేగజ్వరంలో గూడా అలాగే రకరకాల పలవరింపులూ, కలవరింతలూ వున్నాయి. వాటిల్లో ముఖ్యమైనది ప్రమోషను కలవరింత! ఆఖరుకు ఎలాగైతేనేం రోగికోరిన పథ్యాన్నే వైద్యుడు అనుగ్రహించినట్టు రామలింగానికి వున్నట్టుండి ప్రమోషను లభ్యమైంది!

కవరులోంచి బయటపడిన కాగితాన్ని ఒకటికి రెండుసార్లు చదువుకున్నాడు రామలింగం. ఐనా తన కళ్ళను తనే నమ్మడం ఏమంత సబబని యిద్దరు ముగ్గురు సహోద్యోగులకు చూపించాడు. వాళ్ళందరూ ప్రత్యక్షరాన్నీ పరిశీలించి రామలింగానికి ప్రమోషను వచ్చినమాట అక్షరాలా నిజమేనని ఏకగ్రీవమైన నిర్ధారణకు వచ్చారు.

"దొరకదు, దొరకదు" అనుకున్న పెన్నిధి దొరికిన తర్వాతనే అసలు సమస్య ప్రారంభమౌతుంది గాబోలు! ఆ పెన్నిధిని భద్రపరచడ మెలాగన్నదే ఆ సమస్య. సరిగ్గా రామలింగాన్ని గూడా అలాటి గడ్డు సమస్య ఒకటి ఎదుర్కొంటోంది. నాలుగు రోజుల్లో తను కొత్త వుద్యోగాన్ని అప్పగించుకోవాలి. ఆ లోపల యిక్కడి పనులన్నీ పూర్తిగావాలి. ఉపకరణాలను పదిలపరచడంలోనూ, రిజిష్టర్లు మెయింటెయిన్ చేయడంలోనూ తన కేకోశానా ప్రాలుమాలిక లేదు గనుక తను ఆఫీసునుంచీ రిలీవు గావడమేమంత కష్టంగాదు. కానీ వూరినుంచీ బయటపడడమెలా గన్నదే యిప్పుడు జవాబుతోచని చిక్కు ప్రశ్న! అర్ధరాత్రివేళ చడీచప్పుడూ గాకుండా పొలిమేరలు దాటకుండే దాటుకోవచ్చు. కానీ తనకు ట్రాన్స్ఫరు వచ్చిన సంగతి గాలిలా వూళ్ళో వ్యాపించిందనీ, ఆ వార్త చెవిని బడిన తర్వాత తీవ్రమైన నిగావేసి వుందరనీ అనుకోడానికి వీల్లేదే; ఒకవేళ చచ్చీచెడి ప్రస్తుతానికి గండం గడిచి బయటపడినా, వీళ్ళు తనను వెంటాడి ఆ కొత్త వూళ్ళో తన పరువు ప్రతిష్టలను రచ్చబండపై వేలం వేయడానికి పూను

కోరని నమ్మకమేముంది? అబ్బే, అసలే తనది అపరబుద్ధి! అది చెపినట్టల్లా వినడం కంటే కొరివితో తలగోక్కోవడమే మేలు!

కుర్చీలో కూర్చున్న రామలింగానికి క్షణక్షణానికీ చిరాకు హెచ్చిపోతోంది. మొదట ఈ చిరాకును వదిలించుకుంటే గానీ ఆలోచన ముందుకు సాగేట్టులేదు...

ఆఫీసులో వున్నంత సేపూ ఈ చిరాకును వెలుపలికి విరజిమ్మడానికి తన కెలాటి అవకాశమూ లభ్యంకాదని రామలింగానికి తెలుసు. హద్దుమీరితే ఆఖరుకు బంట్రోతుగాడు కూడా 'నువ్వెంత' నీ తాహతెంత' అని తిరగబడడానికి వెనుదీయడు. అందువల్ల యిప్పుడున్న దొక్కటే ఉపాయం...

ఆఫీసు వదిలిపెట్టి చరచరా యింటికి వచ్చాడు రామలింగం.

"ఏమేవ్! ఇలా రా." భార్యను కేకవేశాడు.

అన్నంలో తిప్పుతున్న గరిటెను అలాగే చేతబట్టుకుని కంగారుతో తబ్బిబ్బులౌతూ భర్త ఎదుటకు పరతెంచి వచ్చింది సుబ్బలక్ష్మి

"అదేమిటండీ! వేళకాని వేళప్పుడు ఇలా వచ్చేశారు! ఏం జరిగింది?"

"ఏం జరగాలో అదే జరిగింది! రావలిసిందేమో వచ్చింది. రాగానే ఏమైంది? ముందు నుయ్యి. వెనుకగొయ్యి. నాలుగు రోజుల్లో అక్కడికి వెళ్ళాలి. ఎలా



వెళ్ళడం! ఏం చేయడం! ఆడదానిమాట వినవే వినగూడదు. విన్నానా! విన్నందుకు తగిన శాస్తి జరిగిందీ!"

ఇప్పుడు వచ్చిందేమిటి? నాలుగు రోజుల్లో ఈయన ఎక్కడికి వెళ్ళాలి? ఈయన ఆడదానిమాట విన్నానంటు

న్నారుగదా। ఏ ఆడదానిమాట? ఎప్పుడు విన్నారు?— ఏమీ అర్థంకావడంలేదు సుబ్బలక్ష్మికి। చదువగానే అర్థం బోధ పడకుండా చదివినకొద్దీ క్రొత్త క్రొత్తగా అర్థాలు బోధపడే ఖండకావ్యంలాంటిది రామలింగం ప్రసంగం. పదేళ్ళ సాహచర్యం మాట దేవు డెరుగుగానీ, భర్త మాటల ధోరణి సుబ్బలక్ష్మికి ఏమీ అర్థం గాకుండా నిత్యనూతనంగానే వుంటోంది।

''అదిగో, ఋంగముఖం పెట్టేశావు। నీ బుర్ర కెక్కి తేగదూ। నాకు ట్రాన్స్ఫరూ, ప్రమోషనూ రెండూ ఒక్కసారిగా వచ్చాయే వెర్రి మొగమూ!...''

"అబ్బబ్బ, పుత్ర పుణ్యానికి ఎంత గాబరా పెట్టేశారండీ। ఇంకేం, బిచాణా సర్దుకుంటే సరిపోతుంది।"

"ఊఁహూ। బిచాణా సర్దుకుంటావూ। అంత తేలిగ్గా వుందన్నమాట నీ కీ వూరు విడిచి వెళ్ళడం। అసలు నిన్ను బస్సులో యెక్కనిస్తారా అంట!..."

"ఎక్కనివ్వరూ। ఎవడికండీ అన్ని గుండెలు!..."

"తెలుసు తెలుసు. వీరనారి ఝాన్సీరాణి అటు, నువ్విటు! కానీ నీకు కొన్ని సంగతులు బొత్తిగా తెలియటంలేదు. మునుపటి కెవతో వాల్మీకి పెళ్ళాంగూడా యిలాగే 'నువ్వు దొంగతనం చెయ్, దోపిడీ చెయ్. దాంతో నాకు సంబంధం లేదు. నాకు పొట్ట నిండితే చాలు నా అవసరాలు తీరితే చాలు' అన్నదట!"

"ఇప్పుడు నే నేమన్నానండీ!"

"ఇంకేమనాలి? శెట్టిగారి కొట్లో వంద రూపాయల అప్పుందని తెలియదూ! బట్టలకొట్టుకి అరవైరూపాయలు ఇచ్చుకోవాలని తెలియదూ! ఇవిగాక చిల్లర బాకీలు వందరూపాయలదాకా వున్నాయని తెలియదూ! వాళ్ళ డబ్బు వాళ్ళకు అణాపైసలతో సహా ముట్టితేగానీ మనల్ని యిల్లు కదలనివ్వరని వూహించుకోలేవూ?"

"నిజమే కాదండీ మరి! ఎవరి జాగ్రత్త వాళ్ళది!" గోడకు చేరగిలబడి పరధ్యానంగా అనేసింది సుబ్బలక్ష్మి.

"అన్నావూ! చెప్పానుగా! ఇదంతా ఆ వాల్మీకి పెళ్ళాం తరహాయేనని। ఒక వైపున వచ్చిన జీతమంతా మిగిలించి, ఓ గొలుసు చేయించి నీ మెడలో వేస్తే అందుకు నువ్వు నా కిచ్చే కితాబు యిదన్నమాట...''

అంతకూ యింతకూ కంట నీరు బెట్టుకోవడం సుబ్బలక్ష్మి స్వభావం! చీర చెంగుతో కళ్ళు తుడుచుకుంటూ ఆమె "నాకు గొలుసు కావాలని నే నెప్పుడైనా అడిగానటండీ। ఎలాగోలాగ సంసారం గడుపుకపోతే చాలునని నేనంటే మీ అంతకు మీరే గొలుసు చేసిపెట్టారు..."

"అయితే అదీ నా తప్పేనన్నమాట!"

"పోనీ తప్పంతా నాదే ననుకోండి! ఇప్పుడీ గొలుసును అమ్మి ఆ అప్పులిచ్చేస్తే సరిపోదూ!"

"ఇదిగో సుబ్బులూ? నీ కంటికి నే నంత చేతకానివాడిలా కనిపిస్తున్నాను గదూ!"

"నావల్ల కాదు బాబూ! మీ కొక నమస్కారం. తలకు, వేస్తే మొలకు మొలకు వేస్తే తలకు! అవతల ఆ అన్నం చిమిడి పోయిందో ఏమిటో..." వంటగదివైపు పరుగెత్తబోయింది సుబ్బలక్ష్మి.

"ఇదిగో, పోదువుగానీ ఆ గొలుసు తీసి యిలా యివ్వు..."

"ఎందుకూ?"

''అందుకు కాదులే? మరొకందుకు" —రెండు పేటల బంగారపు గొలుసును జేబులో వేసుకుని గడపదాటి వీధిలో పడ్డాడు రామలింగం.

ప్రతి చిన్న విషయానికీ బెంబేలు పడిపోతున్నట్లే కనిపించినప్పటికీ, ఈ తెచ్చికోలు కంగారుకూ, ఆందోళనకూ అట్టడుగున రామలింగం గొప్ప లౌకికుడు. వెనుకా ముందూ చూడకుండా అప్పులు చేస్తూ, చేసిన అప్పుల్ని చెల్లించే ప్రయత్నాన్ని ఎప్పటికప్పుడే వాయిదా వేసుకుంటూ, కాలహరణం చేయడానికెన్ని వుపాయా లున్నాయో, అన్ని వుపాయాలూ రామలింగానికి క్షుణ్ణంగా తెలుసు. అలా కాకుండా బెడిసి కొట్టి తప్పనిసరి పరిస్థితుల్లో అప్పులు చెల్లించవలసివచ్చినప్పుడు డబ్బు పుట్టించుకునే వుపాయాలుగూడా రామలింగానికి తెలిసినవే? ఏ విధంగా చూచినా రామలింగం జాగరూకుడు.

రామలింగం బయల్దేరింది జగన్నాధంగారి ఇంటికి. సమయానికి ఆయన యింటిపట్టునే ఉండడమూ, తనను సాదరంగా ఆహ్వానించి విశేషాలేమిటని అడగడమూ రామలింగానికిసానుకూల సూచనలుగా గోచరించాయి.

"మరేం లేదండీ! ఒక చిన్న సహాయం కావలసివచ్చి..." అంటూ మెల్లగా ప్రారంభించాడు రామలింగం.

''చెప్పండి. సందేహమెందుకూ?" అన్నారు జగన్నాధంగారు.

"ఉన్నట్టుండి నాకు ట్రాన్స్‌ఫరు వచ్చింది..."

"మీకా? ఆఫీసులో అందరుండగా మీ కెందుకు వచ్చిందండీ ట్రాన్స్‌ఫరు?..."

"పైగా ప్రమోషనుగూడా లెండి!''

"ఓహో, అలాగా! చూడారా రామలింగంగారూ! మీరు వెళ్ళిపోతున్నందుకు విచారం, ఐనా ప్రమోషను వచ్చి వెళ్తున్నందుకు సంతోషం, రెండూ ఒక్కసారిగా కలుగుతున్నాయి నాకు! అందుకే కాబోలు పెద్దలు అంటుంటారు—సుఖదుఃఖాల్లో దేనికి దాన్ని వేర్వేరుగా అనుభవించడానికి వీల్లేదని! అవి పాలూ నీరులా కలిసి వుంటాయి. మనం మానవులం. ఆ మిశ్రమాన్ని సేవించవలసిందే-తప్పదు?"

ఈ సభ మెప్పుమాటలకేమిలె మ్మను కున్నాడు రామలింగం. ఐనా ఇంత అతి వినయమా! ఔనులే, యిది ధూర్తుల లక్షణం. పోనీ ఎవడి పాపాన వాడే పోతాడు. మనకేమో మన పని నెరవేరితే చాలు!

"ఈమధ్య కుటుంబంలో కొన్ని చిక్కులు వచ్చి ఎక్కడి బాకీలు అక్కడే నిలిచిపోయాయి. కామిశెట్టిగారికీ, బట్టల కొట్టు సింగయ్యగారికీ, నూటయాభై రూపాయలు యిచ్చుకోవాలి. ఇవిగాక యింకా చిల్లర బాకీలు వందరూపాయల దాకా వున్నాయి...ఈ నగదు మీ దగ్గ రుంచుకుని ఓ రెండువందలరూపాయ లిచ్చారంటే ఈ యిక్కట్టులోనుంచీ కోలుకోగలను..."

"అదేమిటండీ రామలింగంగారూ! ఏదో సహాయమంటూ ప్రారంభించి అచ్చంగా వ్యవహారసరళిలోకి దిగేశారే! యథాశక్తిగా సహాయమైతే చేయగలను గాని నేను నగలు తాకట్టుంచుకుని అప్పు లిచ్చేవాణ్ణిగానే!"

రామలింగానికి తన పాదాలక్రింద నేల కరిగిపోయి బోర్లగిల పడిపోతు న్నట్టు తోచింది. అమ్మో, ఈ జగ న్నాధం ఆకు కందక, పోకకు పొందక తప్పించుకో చూస్తున్నాడల్లే వుంది. ఇతడి ముందరి కాళ్ళకే గనుక బంధాలు వేయ లేకపోతే తన పేరు రామలింగమే కాదు!

"అబ్బే, తమ విషయం నాకు తెలియదటండీ! ప్రస్తుతం మీ దగ్గర డబ్బు ఉండవచ్చు, ఉండకపోవచ్చు. 'రామలింగం మీకు అచ్చుకోవలసిన అప్పులకు నేను హామీపడుతున్నాను' అని మీరు వాళ్ళ కొకమాట చెబితే చాలు. ఇక నగ విషయమంటారా! కీడెంచి మేలెంచడం మంచిది. నాపైన మీకు పరిపూర్ణమైన విశ్వాసముంది నాకు తెలును. కానీ నాకు నమ్మకంలేనిదల్లా— నాపైన్నే ననుకోండి! మనసు కోతిలాంటి దంటారు. అది వక్రించదని నమ్మక మేముంది? పైగా నగ మీ దగ్గరుంటే అప్పుసంగతి ప్రతిక్షణమూ జ్ఞప్తిలో వుంటుంది. అంచేత తొందరగా అప్పు తీర్చే మార్గాలను అన్వేషించడానికి వీలుంటుంది..." జేబులోని గొలుసుతీసి టేబిలుపైన వుంచి గడగడా పాఠం ఒప్పజెప్పి తన తావులో కూర్చున్న బుద్ధిమంతుడైన కుర్రాడిలా కూర్చు న్నాడు రామలింగం.

జగన్నాధంగారు తెల్లబోయారు. కార్యంపైన కన్నుకలిగి వుండడం మంచిదే! కానీ రామలింగం కొంత నిల కడగా తనను అర్థంచేసుకోడానికి ప్రయ త్నించివుంటే బాగుండేది. ఇతడు తన దగ్గరికి కూడా అప్పుకోసమే వచ్చాడు, ఇస్తాను—యివ్వను అన్నమాట తన నోటినుంచీ రాకముందే నగను గురించి ప్రస్తావించాడు. పైగా తనకు నమ్మకం లేనిది తన పైన్నేనని బుకాయిస్తాడు.






నిజానికి జగన్నాథంగారు తాకట్టు లేకపోయినా అప్పులివ్వగలరు. తోటి మానవులంపైన ఆయనకాపాటి విశ్వాస ముంది. కాదు గీదని ఏ మొండిఘట మైనా ఎగ్గొట్టడానికి ప్రయత్నిస్తే చెవులు పిండి తన డబ్బును వసూలుచేసుకునే తాహత్తు గూడా జగన్నాథంగారికి కద్దు!

కానీ ఇంత తెలివితేటలను ఒలక బోసిన రామలింగంతో ఎక్కువగా మాట్లాడ్డం జగన్నాథంగారి కిష్టంలేక పోయింది. ఆయన గొలుసు చేతికి తీసు కుంటూ "అలాగే వాళ్ళతో చెబుతాను లెండి రామలింగం గారూ! ఐతే ఒక విషయం. మీ రూహించినట్టు ప్రస్తుతం నాదగ్గర డబ్బు లేదు. వీలుచూచుకొని మీరు డబ్బు పంపండి. ఎవరి డబ్బు వాళ్ళకు ముట్టజెప్పి నేను మీ నగను మీకు చేరవేస్తాను. అంటే ఈ లావాదేవిలో నేను మధ్యవర్తిని మాత్రమే నన్నమాట!" అంటూ మునిగినట్టే మునిగితేలి గట్టున కూర్చున్నారు.

ఈసారి తెల్లబోవలసిన వంతు రామ లింగానికి వచ్చింది! ఐనా అతడు తేలు కుట్టిన దొంగలా కాసేపు గుటకలు మింగి "అలాగలాగే! దయవుంచండి. సెలవిప్పిస్తే వెళ్ళొస్తాను" అంటూ పైకి లేచాడు.

*       *       *

రామలింగం ట్రాన్స్‌ఫరు వచ్చిన వూరికి వెళ్ళాడు. ఉద్యోగంలో ప్రవేశిం చాడు. ప్రతిరోజూ ఆఫీసుకు వెళ్ళి వస్తు న్నాడు—కానీ ఇవన్నీ నిద్రలాంటి అవ స్థలో జరిగిపోతున్న పనులు. శరీరం యాంత్రికంగా ఈ పనులన్నీ చేసుకు పోతుండగా మెలకువలో మెలకువగా ఉన్న అతడి బుర్రలోని ఆలోచనలన్నీ అప్పుతీర్చడమెలాగన్న ప్రశ్నపైన్నే కేంద్రీకరింపబడ్డాయి. నెలసరి కుటుంబ

వ్యయంపైనఅతడొక పర్యాలోకనం జరిపి నిర్దాక్షిణ్యంగా అనవసరపు ఖర్చులన్ని టినీ కత్తిరించి పారేశాడు. రోజుల తరబడి మార్కెట్టు ముఖం చూడకపోయినా తిండి దిగకపోదనీ, ఆకలిగొన్న కడుపుకు గంజే అమృతమని భార్యకు నచ్చజెప్పాడు. "పొదుపు పొదుపు అని పదేళ్ళనుంచీ చెబుతుంటే నీకు అర్థమైంది గాదు. 'ఈ రోజు వంగదేశం ఆలోచించింది, రేపు భారతదేశమంతా ఆలోచిస్తుం'దని ఒక సామెతవుంది. ఈ మాట ఎంతవరకూ నిజమోగానీ, నేను పదేళ్ళకు మునుపు చెప్పినమాటనే ఇప్పుడు గవర్నమెంటు చెబుతోంది" అంటూ ప్రభుత్వంవారి పొదుపు కార్యక్రమ పథకాన్ని తన వాదానికి వూతగా తీసుకున్నాడు. ఉదయం పదిగంటలకల్లా భోజనంచేసి తను ఆఫీసుకు వెళ్ళిపోయిన తర్వాత యింటికీ పెరటికీ చెదరిగి శరీరానికి లేనిపోని అలత పెట్టుకోకుండా శుభ్రంగా ఒకచోట కూర్చుని విస్తర్లు కుట్టుకోవడం ఎంత మంచిదనో సహధర్మచారిణికి విశదీకరించాడు. ఇరుగు పొరుగు అమ్మలక్కలను గూడా ఇంటికి చేరదీసి ఎవరి కిష్టమైన మాట వారికి చెప్పి, నాజూగ్గా పని చేయించుకునే సదుపాయాలను గూడా సూచించాడు.

ఆ యీ జాగ్రత్తలవల్ల రెండు మూడు మాసాల్లోనే అప్పులన్నీ జెల కడిగివేయడానికి కావలసినంత డబ్బు ప్రోగుచేయగల్గాడు రామలింగం.

ఓ రోజు రాత్రి రామలింగం రెండు గంటలప్పుడు మేలుకున్నాడు కొంతసేపు పడకపైన ఇటూ అటూ దొర్లి ఆ తరవాత భార్యను గూడా లేపాడు.

"ఏమిటండీ మీరు మరీనూ!" అంటూ సుబ్బలక్ష్మి గోడవైపుకు ఒత్తిగిలి పడుకుంది.

"అదికాదే సుబ్బులూ! ఈ ఆంధ్ర ప్రదేశం యింత విశాలంగా వుండడంవల్ల ఎన్ని చిక్కులున్నాయో తెలుసా?''

"ఏమిటో నబ్బా! మీకు వెయ్యి ఆలోచనలండీ పాడూ!"

"ఓసి వెర్రిమొగమా! మనం అప్పుతీర్చి మన నగను విడిపించుకోవాలి గదా! అక్కడికి వెళ్ళిరావాలంటే రైలు చార్జీలకే పదిరూపాయలు చాలవు. పది పదిహేను రూపాయలు ఎవరు తిన్న పాడో చెప్పు!"

"పోనీ, మనియార్డరు చేసేయ గూడదూ!"

"చెయ్యొచ్చు, నాకు అదే ఆలోచన. కానీ మనం పంపిన డబ్బును తన అవసరాలకు వాడుకుని ఆ జగన్నాథం నిమ్మకు నీరెత్తినట్టు కూచుంటే..."

"అందు కిప్పుడేం చేయదలచుకుంటున్నారు?"

"అదే ఆలోచిస్తున్నాను..."

మరునాటి వుదయం రామలింగం

పోస్టాఫీసుకు వెళ్ళాడు. నాలుగు కార్డులు కొని ప్రతి కార్డుపైనా "ఈ రోజు జగన్నాధంగారికి యమ్. ఓ. ద్వారా డబ్బు పంపుతున్నాను. మీకు నేను యిచ్చుకోవలసిన బాకీని తక్షణం వారి దగ్గర నుంచీ పుచ్చుకోగలరు" అని వ్రాసి పోస్టుచేశాడు. ఒకటి కామిశెట్టికి, మరొకటి సింగయ్యకు మిగిలినవి మిగిలిన ఋణదాతలకు!

జాబుల్లో సూచించినట్లు ఆ రోజు మనియార్డరుగూడా చేశాడు రామలింగం. కూపనులో "మీ సహాయానికి కృతజ్ఞుణ్ణి. డబ్బు చేరగానే బంగారపు గొలుసును రిజిష్టర్డు పార్సెలు ద్వారా పంపగోరుతున్నాను'' అని సంతకంతో పూర్తి చేశాడు.

వీధి నాటకంలో రాజుగారి రాకను తెలిపే చోపుదారికి మల్లే ఈ జాబులన్నీ మనియార్డరుకంటే ముందుగానే చిరునామాదారులకు చేరిపోతాయి. చేరగానే వాళ్ళు జగన్నాధాన్ని ముట్టడించేస్తారు. ఎవరి బాకీ వాళ్ళ కివ్వకుండా ఈ పద్మవ్యూహంనుంచీ ఎలా తప్పించుకోగలడు జగన్నాధం!









* * *

రామలింగం పాలిటికి ఒక్క వారం రోజులు బరువుగా దొర్లిపోయాయి. ఆ వారం పొద్దుగునా టపాకోసం సరాసరి పోస్టాఫీసు దగ్గరికే వెళ్ళి కాచుక కూర్చునే వాళ్ళల్లో రామలింగమూ ఒక్కడుగా జమయ్యాడు. అలా పోస్టాఫీసు ఎదుట గుమిగూడిన వాళ్ళకందరికీ ఏ కార్డులో కవర్లో వచ్చిపడుతున్నాయి. తనకు మాత్రం ఏమీ రావడంలేదు. బావిలో రాయిపడితే బుడగలైనా పైకొ

స్తాయి, ఆ మాత్రానికైనా నోచుకోలేదా తన మనియార్డరు!

ఆ పరిస్థితిలో అంతకంటే ఓర్పు వహించడం రామలింగానికి దుస్తరమై పోయింది. అంతవరకూ తను లోకాన్ని గురించి ఎంతో మంచిగా తలపోసినట్టు, ఉన్నట్టుండి దారుణమైన దాని నగ్న స్వరూపం తన కళ్ళ పొడగట్టినట్టు అత దూహించుకోసాగాడు. ఆఫీసులో అతడి చేతికి వచ్చిన రిజిష్టర్లలోనూ. ఫైళ్ళలోనూ కొట్లూ దిద్దులూ పెరిగిపోతున్నాయి. క్రింది గుమాస్తాలపైనఅతడి రంధ్రాన్వేష ణకు ఒక మితమంటూ లేకపోతోంది. ఇంటికివెళ్తే సరేసరి, శ్రీమతిపైన ధాము ధూములే! ఇక రాత్రుల్లోనా శవిస్తే కంటికి కునుకుపట్టదు!

త్వరగా వచ్చి చేరకుండా రామ లింగాన్ని యిన్నిపాట్లకు అగ్గంచేసిన ఆ రిజిష్టర్డు పార్సెలు, ఓ రోజతడు పోస్టాఫీసుకు బయల్దేరబోతుండగా స్వయంగా తనే యింటిని వెదుక్కుంటూ వచ్చేసింది!

"ఇదిగో సుబ్బులూ! ఎలాగైనా జగ న్నాధం మంచివాడే! పార్సెల్ వచ్చే సింది" అంటూ రామలింగం లోపలికి పరుగు తీశాడు.

"ఏదీ, విప్పండి చూద్దాం" అంటూ సుబ్బలక్ష్మిగూడా హాల్లోకి వచ్చేసింది.

రామలింగం కుర్చీలో కూర్చున్నాడు. సుబ్బలక్ష్మి అలమారా తెరిచి పేనాకత్తి తీసుకొచ్చింది.

"చూడ్డానికి ఈ పార్శిలు మరీ పెద్ద దిగావుంది కదండీ!"

"ఉండొద్దూ మరి! అలాగే వుండాలి." పార్శిలును ఛేదించే ప్రయత్నంలో నిమగ్నుడయ్యాడు రామలింగం.

ఒక్కింత శ్రమతో పై మూత వూడి పోయింది. రామలింగం పైపైని తుక్కు కాగితాలు విదిలించేశాడు.

"అదేమండీ! ఈ పార్శిల్లో!" యింకొక పార్శిలా సుబ్బలక్ష్మి భర్తవైపు ఆశ్చ ర్యంగా చూచింది.

ఆ మాటా నిజమే! దాక్ పీసుల పెట్టంత సైజులోవున్న మొదటి పార్శిల్లో నుంచి రెండోది బయటపడింది. ఇదొక డబ్బారేకుల పెట్టె!

"మరే మనుకుంటున్నావు జాగ్రత్త పడటమంటే!" రామలింగం ఆ పెట్టె గూడా తెరిచేశాడు. ఓ కర్పూరపు బిళ్ళల డబ్బా దృగ్గోచరమైంది.

సుబ్బలక్ష్మి కళ్ళు కుంభాకార కట కాల్లా పైకొచ్చేశాయి, హఠాత్తుగా రామ లింగం నాలుక పిడచగట్టుకపోయింది.

ఆ డబ్బా తెరవగానే మళ్ళీ అందులో గూడా ముద్దులు మూటగట్టే మరొక చిన్నపార్శిలు!

"సుబ్బులూ," తెరిచిన నోరు తెరిచి నట్టే వుండిపోయింది.

సుబ్బలక్ష్మికి ఎక్కడలేని వుక్రోషం




పుట్టుకొచ్చింది. ఆమె ముద్దులు మూటగడ్తున్న ఆ చిన్న పార్శిలును వేనాకత్తితో ఛిన్నాభిన్నంగా కోసేసింది!

దానిలోనుంచీ బయటపడింది బంగారపు గొలుసు కాదు - మామూలురకం అరవై పుల్లల చీటా సైట్ అగ్గిపెట్టె!

"ఇంకేం గొలుసు బాబూ!" సుబ్బలక్ష్మి అగ్గిపెట్టె తీసింది. అందులో నుంచీ జాగ్రత్తగా మడతబెట్టిన ఓ చీటీ క్రిందికి జారింది.

"చదువు సుబ్బులూ! ఏం వ్రాశాడో చదువు!"

"ప్రియమైన రామలింగంగారూ!

"మీరు ఈ వూరునుంచి వెళ్ళిపోవడానికి ముందుగా నన్ను కలుసుకున్నప్పుడు 'నా పైన నాకే నమ్మకం లేదనుకోండి' అంటూ ఓ ఆణిముత్యంలాంటి మాట సెలవిచ్చారు. కానీ అప్పటి మీ మాటలనుబట్టి, ఆ తరువాత జరిగిన సంఘటనలబట్టి ఆలోచించగా మీకు మీపైన తప్పితే మరొకరిపైన నమ్మకం లేదన్న విషయం నాకవగతమైంది. అవకాశం దొరికితే ప్రతిరెండవ వ్యక్తి మోసగాడుగా పరిణమించవచ్చునని మీరు భావించడం విచారకరం! కొండొకచో అపాయకరం గూడా!

ఈ అమూల్యమైన హితవులు మీకు చేరుతున్న విధానం వల్లనైనా కలకాలం జ్ఞప్తిలో వుండగలవని ఆశిస్తున్నాను.

మీరు ఎదుటివాణ్ణి విశ్వసిస్తే ఎదుటివాడు మిమ్మల్ని విశ్వసిస్తాడు. అది లేనప్పుడు యిది లేదు! నిజాన్ని యింత నిర్మొగమాటంగా చెబుతున్నందుకు మన్నించండి. మీ నగ మీకు చేరినట్లుగా రివెన్యూ స్టాంపుమీద సంతకంచేసి మీరు రసీదును పంపిన తక్షణం మీ గొలుసు మీకు రిజిష్టర్డు పార్శిల్లో సురక్షితంగా పంపబడును.

ఇట్లు,
జగన్నాథం."

---




ఆరుసంవత్సరాలబట్టీ ఆ దే ప ని గా రామం ఉత్తరాలు రాస్తున్నాడు, "మాకోసరం ప్రత్యేకంగా నీవు ఎలాగూ రావు...గుంటూరు వచ్చినప్పుడైనా నీ పాదధూళితో మా గృహాన్ని పావనం చేయవోయ్, భగవాన్లూ!" అంటూ.

నిజమే! వాడి మాటను అనివార్య కారణాలవల్ల ఇంతవరకూ త్రోసివేయ వలసివచ్చింది. నేను గుంటూరు వెళ్ళి నప్పుడల్లా వాడిని కలుస్తున్నమాట వాస్తవమేగాని, వాడికి పెళ్ళయి, తన సంసారం అంటూ ఒకటి ఏర్పరచుకొని, దాన్నే పిల్లలూ అనే దీపాలతో వెలిగించు కుంటున్నా నేను వీలుచూసుకొని వాడింటికి వెళ్ళలేకపోయానూ అంటే — క్షమించరాని నేరమే అవ్వవచ్చు — వాడాలాంటి మిత్రుడు మరి!

ఈసారి ఎలాగైనా వాడిదగ్గరకు వెళ్ళిరావాలి అనుకున్నాను...అందుకే గుంటూరులో చదువుకుంటున్న మా

అమ్మాయి నా కోసరం బెంగపడింది అని మా అక్కయ్య రాసిన ఉత్తరాన్ని చూచుకొని, రెండు గుడ్డలు బ్రీఫ్‌కేస్‌లో పడేసుకొని బయల్దేరాను. ఎలాగో రామందగ్గరకు వెళ్లాం అనుకుంటున్నాను కాబట్టి వాడికి ముందుగా ఉత్తరంకూడా రాయలేదు.

అందునా మనస్సులోని కోరిక వాడిని సర్ప్రైయిజ్ చేయాలని!

గుంటూరులో ఓ రోజంతా మా అమ్మాయితో కాలక్షేపమయింది. ఉన్న నాలుగురోజులూ ఊరూరా తిరగటంతోటే సరిపోతుందని మా అక్కయ్య విసుక్కుంటున్నా పట్టించుకోకుండా రెండోరోజు మధ్యాహ్నమే భోజనంచేసి రామందగ్గరకు బయల్దేరాను.

రామందగ్గరకు వెళ్ళాలి అంటే ముందు తెనాలి వెళ్ళాలి. ఆపైన వాడు నివసిస్తున్న ఓ పల్లెకు బస్సులో వెళ్ళాలి. అక్కడ వాడు ఓజిల్లాపరిషత్ స్కూల్లో టీచర్‌గాపేరుస్తున్నాడు. నా లెఖ్ఖప్రకారం ఈ ప్రయాణాలన్నీచేసి వాడి వాకిట్లో నాలుగుగంటలకు వుంటానని ఆశించాను.

మనం అనుకున్నవన్నీ అయితే ఇంకా చెప్పుకునేటందుకు ఏమున్నది. సూర్యుడు పడమటి కొండల్లోకి పారిపోతూ చంద్రుడికి తెల్లజెండా ఎత్తేశాడు గూడా. ఆపైన తెనాలిలో రామందగ్గరకు వన్ను తీసుకువెళ్ళే బస్సు రాత్రి ఎనిమిదిగంటలకు దడదడలాడుతూ వచ్చి ఆగింది. కుస్తీపడితేగాని టిక్కెట్టు దొరకలేదు ... ఆపైన సీటు వెనకగా మూలన...

ఇంతా ఏడ్చివెంటనే బయల్దేరిందా... ఊహూ... లేదు ... మరేదో బస్సు కాన్సిల్ అయిందట...అందుకని రెండు ట్రిప్పులూ కలిపి తొమ్మిది దాటింతరువాత...

రాత్రి పదిగంటలప్పుడు చెట్లగుబుర్ల మధ్యగావున్న ఆ స్టేజీలో... వండు వెన్నెల్లోకి చేతులూపుకుంటూ దిగాను. రాత్రి పదిగంటలూ అనేది ఇలా వుంటుందని ఆ క్షణంవరకూ అనుభవంలేదు. హైదరాబాద్‌లో, మంచి సెంటర్‌లో వుండే కొంపలో వుండే నాకు అప్పటి అక్కడి వాతావరణం రాత్రి పన్నెండు గంటలప్పుడు గూడా కనబడదు.

సరిగ్గా ఆ సమయాన అక్కడికి ఫర్లాంగు దూరంలోవున్న ఆ గ్రామం కురుస్తున్న తెల్లని వెన్నెల్లో చచ్చిన మనిషిని స్మశానానికి మోసుకువెళ్లేటందుకుగాను ఓ నల్లటి పెట్టెలో పెట్టినట్లున్నది.

ఇప్పుడు వెళ్ళి రామాన్ని లేపాలి. ఆయనగారి ధర్మపత్నికి వంటపని అంటగట్టాలి. ఇంతవరకూ చూడని ఆమె నా ఈ అర్థరాత్రి రాకను ఎలా తీసుకుంటుందో ... విసుక్కుంటుందో, విచారిస్తుందో...

ఏమైనాకానీ ... రామాన్ని కలవ

పోతున్నాననే సంతోషం ఆమెమీద భయానికి దుప్పటిని కప్పివేసింది.

రాక రాక వస్తున్న నా ఈ రాకకు వాడు అమితానందాన్ని పొందుతాడనేది ఖాయమే!

మట్టిరోడ్డుమీద బూట్ల అడుగులు మెత్తగా పడుతున్నాయి.

ఊరికి సింహద్వారంలా పెద్ద మర్రి చెట్టు, కాపలాదారుడిలా పక్కనే దేవాలయం...దాని ముందుగా సన్నని బాట ...ఊళ్లో కాలుపెట్టాను—సగం పడి పోయిన మట్టిగోడలతో యిళ్ళు ... ఆ గోడలమీదుగా పూరిపాకలు ... గొడ్లు, పేడ ... అదోవిధమైన వాసన — ముందుకునడుస్తున్నాను ఆ నరసంచారం లేని వీథిలో...

రాత్రి పదిగంటలప్పుడు — యింటి యజమానిదావగా ఎవరికివారు దుఃఖంతో ముడుచుకు పడుకొనివున్న కొంపలో తిరుగుతున్నట్లున్నది. అదో నయం— అమావాస్య కాలేదు!

చీకట్లో మిణుకుమిణుకు మంటున్న దీపంలా నాలుగురోడ్ల కూడలిలో ఓ పెద్ద అరుగుమీద నలుగురు మనుష్యులు కూర్చొని కనబడ్డారు.

నేను వాళ్ళదగ్గరికే నడుస్తున్నట్లుగా అడుగులువేసి వాళ్ళ ముందు చేతులు కట్టుకుని నిలబడ్డట్లుగా నోరుతెరిచి అడిగాను.

"రామారావుగారిల్లు కావాలి!"

"పంతులుగారా!" అందులో ఒక తను ఓ క్షణం తదేకంగా నావంకే చూచి అడిగాడు.

"అవును...స్కూలుటీచరే!"

"ఆయన నిన్ననే ఈ ఊరునుంచి వెళ్ళిపోయారు కదండీ ... బదిలీ అయి పోయింది!" ఒకతను కాస్త ముందుకు వంగుతూఅన్నాడు. "మీకు తెలియదా!"

"అరె!...నిజమా?"

రామాన్ని చూడబోతున్నాను అనే ఆనందమంతా ఒక్క క్షణంలో ఆవిరై పోగా ఒడలంతా ఎండి బీటలువారి పోయింది.

ఇదెక్కడి నిజం?

"ఏ వూరు వేశారు?"

చెప్పారు. అక్కడికి పదిమైళ్ళ దూరంలో మరేదో వూరు.

తలెత్తితే ఆకాశంమీద చంద్రుడు అందంగా కనిపిస్తున్నాడేగాని—ఆయన గారు కురిపిస్తున్న మంచుమాత్రం నా గుండెల్ని చుట్టి మెలిపెడుతుంది.

ఇంత రాత్రిపూట ఇప్పుడెక్కడికి వెళ్ళాలి?

ఎంత వెన్నెలున్నా రాత్రి రాత్రే... భయం భయమే... నాకు కాని, నాకు తెలియని ఆ ప్రదేశంలో ఈ రాత్రిపూట నేనేం చేయాలి? ఇదే ఏదో బస్తీ అయి వున్నట్లయితే ఇంతగా ఆలోచించవలసిన అవసరం వుండేదేగాదు. పదిరూపాయలు

నావి కావూ అనుకుండే డన్‌లప్‌పిల్లో, పరుపు, పైన ఫ్యాను...మళ్ళీ మాట్లాడితే స్నానానికి వేడినీళ్ళు ... విందు భోజనం...

తటపటాయిస్తూ, అలాంటిది వుండదని, ఖచ్చితంగా తెలిసీ "ఈ ఊళ్ళో హోటల్‌గానీ ఏమైనా వున్నదా?" అని అడిగాను వాళ్ళనే.

అందులో ఒకతను మొరటుగా నవ్వి "మీ దే వూ రు పంతులుగారూ ?" అన్నాడు.

"వుంటున్నది హైద్రాబాద్...ప్రస్తుతం వచ్చింది గుంటూరు నుంచి!"

"ఇక్కడెక్కడా హోటల్ లేదండి!" పెద్దగా నవ్వాడు. 'ఎక్కడికైనా వెళ్దామన్నా బస్సుగూడా లేదు!"

"మరి!!" ఏంచేయమంటారూ అన్నట్లుగా వాళ్ళవంకే నిస్సహాయంగా చూదాను.

"మునసబుగారింటికే వెళ్ళండి!"

"వెళ్ళి?"

"ఆయనే ఒక చాపఇస్తారు...కాసిని మజ్జిగచుక్క ఇస్తారు ... నాలుగేళ్ళు ఆయనగారింట్లో వున్న పంతులుగారికి మీరు స్నేహితులాయె!"

"వారిల్లు ఎటో చూపిస్తారా?"

—ఆ సమయంలో వాళ్ళ సలహాను పాటించడంకంటె నేను చేయగలిగింది మాత్రమేమున్నది?

అందులో చిన్నవాడుగా వున్నవాడు లేచి నిలుచున్నాడు చేతికర్రతో.

"నా వెంట రండి!"

చీకటిదారి, చుట్టూ ఎడారిలా వున్నది ఆ క్షణాన నా పరిస్థితి. ముందుగా నా రాకను వాడికి తెలియబరచనందుకు నా మీద నాకే కోపమొచ్చింది. 'ఎలాంటి పిచ్చిపని చేశాను' అని అనుకున్నాను.

ఎంత విసుక్కున్నా, కోపగించుకున్నా—నీళ్ళబయటపడ్డ చేపలా గిలగిలలాడటం మించి చేయగలిగిందేం వున్నది?

పెద్దమండువా ఇల్లు. ముందు అంతా ఖాళీస్థలం. ఇంటిముందు వాకిటికి అటూ ఇటూ పెద్ద అరుగులు...చూరు క్రిందగా అరుగుమీదగా పెద్దబెంచీ వేసివున్నది.

నన్ను వెంటబెట్టుకు వచ్చిన మనిషే ఆ యింటి తలుపు తట్టాడు.

తలుపు తీసింది సాక్షాత్తూ మునసబుగారే!

—లేకపోతే ఆ నిలువెత్తు విగ్రహం ఇంకెవరిదై వుంటుంది?

"ఈయన వెళ్ళిపోయిన పంతులుగారికి స్నేహితుటట ... ఆయన వెళ్ళిపోయిన సంగతి తెలియక వచ్చారుట!"

ఆయన సింహం నోరులాంటి ఆ వాకిటినుండి బయటకు వచ్చారు. నన్ను ఎగాదిగా ఒక్క క్షణం చూచి, "ఏ వూరినుంచి వచ్చారు ?" అన్నారు. ఆయన కంఠానికి నేను — రాక్షసుడి

ముందు నిలబడ్డ మనిషిలాగానే అయ్యాను.

"మాది హైద్రాబాద్ ... ప్రస్తుతం గుంటూరునుంచి వచ్చాను!" ఇది రెండో సారి పెట్టిన రికార్డు.

"అలా కూర్చో!" అన్నారు ... ఆయన నన్ను—నాలాంటి ఆఫీసర్ని ఏకవచనంలో ఆజ్ఞాపించినా ఆయన వయస్సుకు పెద్దరికాన్ని ఇస్తున్నట్లుగా భావించి తలఒగ్గాను.

నాకు ఇల్లు చూపించటానికి వచ్చి నతను వెళ్ళిపోయాడు.

నేను బెంచీమీద కూర్చున్నాను.

ఈయన కంఠానికి — పాలేరు గాబోలు లేచి వచ్చి దూరంగా నిల బడ్డాడు.

"అరేయ్! ఈయనగారికి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళిచ్చి ... వంట యేర్పాట్లు చేయించు!"

"అబ్బెబ్బే...వద్దండీ...నే నిప్పుడేం తినను...తెనాల్లోనే అన్నీ అయినయి... కాస్త చోటు చూపించి, ఓ చిరిచాపపడేస్తే ఈ రాత్రికి కళ్ళుమూసుకొని తెల్లవారు తూనే వెళ్ళిపోతాను... వాడు ఇక్కడ లేడని నాకు తెలియదు...తెలిస్తే ఇలాంటి ఇబ్బందుల్లో ఇరుక్కుండేవాడినేగాదు!" అన్నాను.

"ఫరవాలేదులే ... కూర్చో ... అరేయ్! గ్లాసునిండా మజ్జిగ తీసుకు రారా!"

నేను మౌనం వహించాను — భోజ నానికైతే మొఖమాటపడ్డమాట వాస్తవమే గాని ... ఒకవైపు నుంచి మండు కొస్తున్న ఆకలిని ఈ మజ్జిగతోనైనా చల్లార్చక తప్పదు!

"ఏంచేస్తుంటావ్ హైదరాబాద్‌లో!"

—చెప్పాను ఉద్యోగం, జీతంకూడా కావాలని!

ఆ తరువాత ఆయనతో మాట్లాడిన ఒకటి రెండు గంటల్లో ఎప్పుడూ నన్ను ఆయన 'నీవు' అనలేదు—'మీరు' అనే మర్యాదగా మాట్లాడాడు.

"మీరు స్నేహితులా?" అడిగాడు.

"ప్రాణంతో సమానం!" అన్నాను నొక్కి పలుకుతూ.

ఆయన నవ్వాడు. ఎందుకు నవ్వాడో తరువాత పదినిముషాలకుగాని నాకు అవగతం కాలేదు.

"ప్రాణస్నేహితులు ఎప్పుడూ మీ గౌరవాన్ని పెంచేవాళ్ళే అయివుండాలి గాని...ఇలాంటి అల్లాటప్పాయ్ గాళ్ళు గాదు!" అన్నాడు...అప్పుడే పాలేరు తెచ్చి పక్కనపెట్టిన తోలుసంచీలోనుంచి పొగాకుకాడ బయటకుతీసి, చుట్ట చుట్టు కునేందుకుగాను తుంచుకుంటూ.

"క్షమించాలి!" ఆయన మాట్లాడిన తీరూ, కంఠమూ నామనస్సుకు కష్టాన్ని కలిగించింది... ఆవేశాన్ని నిగ్రహించు కున్నాను.

"మనసున్నది చూశావూ కోతిలాం



టిది... అందులో వయస్సులో వున్న
దైతే ఇంక చెప్పుకోవాల్సిందేవున్నది
— మనిషి మంచివాడే. కాదనను ...
ఒక్కమాట! ఇంత అర్థాంతరంగా మీ
ప్రాణస్నేహితుడు ఈ ఊరు వదిలి వెళ్ళి
పోవటానికి కారణం ఎవ్వరో తెలుసా?''
అన్నాడు.

నాకేమీ తెలియదుగనుక ఆయన
మొఖంలోకే చూస్తూ వుండిపోయాను.

"నేనే!" ఆయన ఫెళ్ళున నవ్వాడు.

నాకు విభ్రాంతి కలిగించింది ఆయన
మాట!

"మీరు నన్ను పాము అనండి —
నాకు అభ్యంతరంలేదు—పాము పగ
పట్టనంతవరకూ చాలా మంచిదే... పగ
కూడా ఎప్పుడు పడుతుందో తెలుసా
మీకు—తనజోలికి వస్తేనే!''

—నాకు తెలిసినంతవరకూ రామం
సాధుజంతువు ... ఆలాంటి రామం
రాజకీయ దురంధరుడులాంటి మునసబు
జోలికి-మరో మాటలో చెప్పాలంటే ఆ
ఊరికి రాజులాంటి ఆయన జోలికి—ఓ
ఈగలాంటి బడిపంతులు వెళ్ళటమా?

అసంభవంగాక అసంభవం!

నా మనస్సు ఆయన మాటలను నమ్మవద్దంటోంది.

కానీ—

పూర్తి వివరాలు తెలుసుకోందే ఎటూ నిర్ణయించుకోవటం కష్టం.

మజ్జిగ వచ్చింది. అంతకుముందే తెల్లటి ఇత్తడిచెంబుతో అక్కడ వుంచిన నీళ్ళతో, కాళ్ళూ చేతులు కడుక్కొని మజ్జిగ త్రాగాను.

జేబురుమాలతో మూతి తుడుచుకుంటుండగా "ఇక పడుకోండి పంతులుగారూ... ఎప్పుడనగా బయల్దేరారో!" అంటూ అంత విగ్రహమూ లేచింది — చుట్టను చివరి పీలుపు పీలుస్తున్నట్లుగా పొగను ముప్పుముప్పున వదులుతూ.

"క్షమించాలి! రామం చేసిన తప్పేమిటో తెలుసుకోవాలని నాకు ఆత్రంగా వున్నది!" అన్నాను కొద్దిగా ముందుకు వంగి.

ఆయన లోపలకు వెళ్ళేటందుకు ఒక్క అడుగువేసినవాడల్లా, నామాటకు ఆగి వెనక్కు తిరిగాడు ఆ గుడ్డివెన్నెల వెలుగులో ఆయన నా కళ్ళల్లోకి తీక్షణంగా చూస్తున్నట్లే అనిపించింది. ఆ చూస్తున్న తీరు నాకు కాస్త కలవరపాటునే కలిగించింది. ... లేనిపోయింది ఆ విషయం ఎందుకు ఎత్తానాఅని ఒక్క క్షణం అనుకున్నమాటా నిజమే...

...అయినా...ఆయన్ను అంతగా తలక్రిందులు చేసిన...వాడు చేసిన ఆ ఘోరమైన తప్పిదాన్ని తెలుసుకోకుండా వుండలేను!

కంఠం కంచుగంటలా మ్రోగింది.

"పెళ్ళయింది... పిల్లలున్నారు ... చేస్తున్న ఉద్యోగం మాట్టారుగిరీ...నలుగురికి ఇంత బుద్ధీ, జ్ఞానమూ చెప్పవలసినవాడు ... కడుపుకు కావాల్సిన నాలుగు మూకల కోసరం నలుగురి తలల్లోనూ నాలుకలా మెలగవలసినవాడు ... అలాంటివాడు నిప్పుతో చెలగాట మాడతాడా?...వచ్చిన వయస్సు మనిషి మనస్సును పెంచేదిలా వుండాలి ... చిన్నది...దానికేం తెలుసు...అందమైన ఆడది కనబడితేచాలు నాశనం చేయాలి అనుకోవటమే ... సరోజ అమాయకత్వాన్ని ఆసరాగాతీసుకొని, చదువు చెబుతున్నాననే మిషపెట్టి వల విసరటమే... దాని జీవితాన్ని ఆర్పివేయాలనుకోవటమే!"

నేను భయం భయంగా అడిగాను:

''సరోజ ఎవరు?"

"నా కూతురు!"

మరుక్షణాన ఆయన నా ముందు లేడు. ఆయన వెళ్ళింతరువాత అర క్షణం కూడా ఆయింటి సింహద్వారం తెరిచిలేదు!

* * *

తరువాత పాలేరు చాప ఎప్పుడు పరిచాడో తెలియదు. దానిమీద ఓ పెద్ద తివాచీ ఎప్పుడు వేశాడో తెలియదు.



అలాగే మౌనంగా శూన్యంలోకి చూస్తూ కూర్చుండిపోయాను అక్కడే.

ఎప్పుడో ఎక్కడో కుక్కల అరుపులు నన్ను మేల్కొలిపినయి.

జావలా జారిపోతూ ఆతివాటీమీదకు ఒరిగిపోయాను.

ఇదెక్కడి ఘోరం?

రామం ఇంత నీచానికి దిగజారాడా?

— అందునా పెళ్ళయి, ఆపైన తండ్రయి, పదిమంది పిల్లలకు గురువయి...

ఇది నమ్మదగ్గ విషయమేనా?

ఏమో...

తెల్లటి వెన్నెల పుచ్చపువ్వులా వున్నది. వెన్నెలంటే నాకెంతో ఇష్టం ...కాని ఆ క్షణాన ఆ వెన్నెల కిరణాలే అగ్నిశిఖల్లా చుట్టుముట్టి నా ఒళ్ళంతా మంటలు రేపుతున్నాయి. నాకు అశాంతి కలిగిస్తున్నాయి. అలజడి కలిగిస్తున్నాయి.

నిద్ర రావడంలేదు...కళ్ళు మంటలు పుడుతున్నాయి...

చికాకుగా అటూ యిటూ ఊరికినే పొర్లాడుతున్నాను.

...అసలు ఇక్కడికి రాకుండా వుంటే...రామాన్ని చూడాలని అనుకోకుండా వున్నట్లయితే...

రామం!

ఎందుకలా మారిపోయావురా నీవు?

ఎందుకలా దిగజారిపోయావురానీవు?

దగ్గర్లో ఏదో అలికిడి ... ఎవ్వరో నడుస్తున్నచప్పుడు...సన్నని మెత్తని అడుగులు...

కళ్ళుతెరిచి తలెత్తి నలువైపులా పరికిలిస్తే...

నిజమే...

ఓ స్త్రీ!...

ఇంత రాత్రిసమయంలో వంటరిగా అక్కడకు వచ్చిన ఆమె నాకు విభ్రాంతినే కలిగించింది

ఎవరామె!

ఉలిక్కిపడుతున్నట్లుగా లేచి కూర్చొని కళ్ళు రెపరెపలాడిస్తూ చూస్తు న్నాను.

ఆమె వచ్చి ఎదురుగ్గా నిలబడింది.

"నేను సరోజనండి!"

ఆ అమ్మాయి సన్నగా వున్నది పొడుగ్గా వున్నది. ఎర్రగా వున్నది.

నాకు ఏంమాట్లాడాలో అర్థంకాలేదు. ఆ అమ్మాయి ముఖంలోకే చూస్తూ వుండిపోయాను.

"తెల్లవారింతరవాత మీరు మాష్టారి దగ్గరికి వెళతారా?"

"వెళతాను!"

"అయితే ఈ ఉత్తరం ఆయన కిస్తారా?" అంటూ మడతపెట్టిన కాగితాన్ని నా కందించింది.

తడబడటమూ నా వంతే అయింది.

"అలాగే!"

ఆకాగితాన్ని నా చేతిలోవుంచి ఒక్క క్షణంగూడా వుండలేదు ఆ అమ్మాయి అక్కడ. వడివడిగా అడుగులు వేసు కుంటూ, వెన్నెల్లో జలతారులా మెరుస్తూ అరుగు చివరకువెళ్ళి పక్కవాకిలి వైపుకు వెళ్ళిపోయింది. ఆ తరువాత తలుపు కిర్రుమన్న చప్పుడు...

మునసబు నిలువెత్తు విగ్రహం నా కళ్ళముందు నిలబడింది.

—ఆయన చెప్పిందంతా నిజమా?

లేకపోతే ఈ అమ్మాయికి ఇప్పుడు రామానికి ఉత్తరం రాయాల్సిన అవసరం ఏమున్నది.

...నిజంగానే వాళ్ళిద్దరికీ...

—ఊహించలేకపోయాను.

వాడి ఉద్యోగానికే పెద్దపేరు తెచ్చే వాడు ఎంత నీచానికైనా దిగజారగలడు అనిపించింది.

నాకు ఆత్మీయుడైన రామం జీవితంలో అంతగా చెడిపోవటం నిజంగా నేను సహించలేని విషయమే!

చలి జివ్వున నరాల్ని— రామాన్ని గురించిన బాధలాగానే లాగుతున్నది.

తిరిగి తెల్లవారేటంతవరకూ—అంత వరకూ పట్టిన కలతనిద్రకూడా పట్ట లేదు...బిక్కుబిక్కుమంటూ...మానసి కంగా ఓడిపోయి...మీది మీదికి వస్తున్న చలికి భయపడుతున్నట్లుగా ముడుచు కొని పడుకున్నాను!

* * *

మునుసబుగారింటినుండి బయటపడి

...సన్నని ఇరుకురోడ్లను దాటుకుంటూ ...ట్రంక్ రోడ్డు ఎక్కేటప్పటికి ఏడు గంటలుదాటి అరగంట అయింది. అప్ప టికే సూర్యుడు తనలోని ఎర్రదనాన్ని తగ్గించుకొని కరుకుదనాన్ని పెంచు కుంటున్నాడు.

వెళ్ళి బస్సుకోసరం సత్రం ముందున్న మర్రిచెట్టుకింద పదినిము షాలు నిల్చోవాల్సి వచ్చింది. సత్రం ముందు బావిపక్కగా వున్న రొచ్చు నాలో ఆ వూరుమీది పేరుకున్న అస హ్యంలా వున్నది. ఎండిన మర్రిచెట్టు ఆకులు నేలమీదంతా ... రామంమీది ఆలోచనల్లా ... ఆవరించి గజిబిజిగా వున్నాయి.

దూరంగా బస్సును చూస్తూనే... అశాంతి నిలయానికి దూరమయి పోవచ్చు అన్నంత ఆనందం కలిగింది.

బయల్దేరేముందు మునసబుకు ఎదు రుగ్గా కూర్చొని...పాలేరు తెచ్చిఇచ్చిన పెద్దగ్లాసెడు కాఫీని ... డికాక్షన్ కంటే చిక్కటిపాలే ఎక్కువయి అదోవిధ మైన వెగటువేస్తుండగా ... ఇబ్బందిగా త్రాగుతుండగా...

"చూడండి పంతులుగారూ! మీ స్నేహితుడిని కాస్త జాగ్రత్తగా మసలు కోమనండి ... పొరబాట్లు ప్రతివాళ్ళూ చేస్తారు...చేసినవాటిని సరిదిద్దుకోవటం లోనే మనిషి గొప్పతనం వున్నది ... నేను చెప్పానని చెప్పండి!"

రామాన్ని చూసేటంతవరకూ ... ఆయన మాటలు నన్ను నాలా వుండ నీయలేదు ... మనస్సంతా చికాకు ... కోపం...అసహ్యం...దిగులు...భయం ...ఊఁహూఁ?...ఇదీ అని ప్రత్యేకంగా చెప్పలేను ... అదోవిధమైన అర్థంగాని తపన...

సరిగ్గా తొమ్మిదిగంటలకు ...రామం నన్ను చూస్తూనే పరుగెత్తుకుంటూ వచ్చి మీదపడి కౌగలించుకున్నంత పని చేశాడు.

"ఈ రోజు ఎంత సుదినం... ఎంత మంచిరోజు!" అన్నాడు. ఆ క్షణాన వాడికళ్ళల్లో నీళ్ళుగూడా తిరుగుతున్నట్లే అనిపించింది...అవి ఆనందభాష్పాలనీ నాకు తెలుసు...

"రారా సత్యం!...ఎంత హాయిగా ఉన్నదో తెలుసా ఈక్షణాన నామనస్సు ...నేను చెప్పలేనురా నా ఆనందాన్ని ...రారా నాన్నా! ఓయ్! శారదా!... ఇలా రావోయ్...ఎవరొచ్చారో చూడు ...మా సత్యం ... మా సత్యం వచ్చా డోయ్!" పెద్దగా రోడ్డుమీదనుంచే అరవ సాగాడు రామం.

నేను వాడిచేతిని చాలా ఆప్యాయంగా పట్టుకుని నడుస్తున్నాను. ఆక్షణాన వాడి కళ్ళల్లో వెలుగుతున్న సంతోషం నాకు గర్వకారణమే అవుతున్నది.

నిజంగా మిత్రుడంటే వాడే!

చూరు క్రిందగా తలవంచుకొని లోప లకు వెళ్ళాను.

రామానికి సరైనజోడీనే అనిపించేలా వున్న శారద నవ్వుతూ ఎదురువచ్చింది: "నమస్కారం అన్నయ్యగారూ? మీ మిత్రుడి గృహాన్ని ఈనాటికి మీ రాకతో పావనం చేశారు...రండి! రండి! చాలా సంతోషం!" ఆహ్వానించింది నన్ను.

ఆమె, ఆమె మాట తీరు ... ఆమె ఎవరో ఎప్పుడూ చూడని కొత్తవ్యక్తిలా అనిపించలేదు నాకు...దానికి కారణం రామం...అంతకుమించి వాడికీ నాకూ వున్న అనుబంధం ... నా గురించి ఎంతగా చెప్పాడో ఆమెకు వాడు!

"నాకూ చాలా ఆనందంగానే వున్నది ... ఈనాటి ఈ రాక!" అన్నాను... మనస్సంతా ఎంతో హాయిగా వున్నట్లని పించగా.

"అవునూ ... నేనిక్కడున్నానని ఎవరు చెప్పారు నీకు?" రామం కుతూ హలంగా నా ముఖంలోకి చూస్తూ అడి గాడు.

వాడి ప్రశ్న నన్ను... ఆనందశిఖ రాలమీదనుండి ఒక్క కుదుపు కుదిపి పాతాళంలోకి త్రోసివేసింది.

రాత్రి గుర్తుకు వచ్చింది. మునసబు గుర్తుకు వచ్చాడు. ఆయన మాటలు గుర్తుకు వచ్చినయి...ఆయన మాటల్లో రామంమీద రంగరించిన అసహ్యం గుర్తుకు వచ్చింది.

మనస్సంతా క్షణంలో గజిబిజి అయి బాధతో తడిసి ముద్దయింది.

"రాత్రి మీ పాతఊళ్ళో మునసబుకు అతిథిగా గడిపాను!" పేలవంగా నవ్వుతూ అన్నాను.

నా మాట వింటూనే ముడుచుకు పోయిన వాడి ముఖం నా గుండెల్లో ముల్లులాగానే గుచ్చుకున్నది.

"నన్ను ఇంకా తిడుతూనే వున్నాడా?" అన్నాడు బాధగా రామం.

శారద అక్కడ వుండలేనట్లుగా, మా మాటలు వినలేనట్లుగా వెనక్కి తిరిగి, బరువుగా అడుగులువేస్తూ నా గుండెమీద మరో దెబ్బకొట్టింది.

నే నసలే సెన్సిటివ్‌ని...

శారద ఎంతగా బాధపడుతు న్నదో?...

"అరేయ్ సత్యం! లోకులు కాకులురా...ఇదుగో తోకఅంటేఅదుగో పులీ అనేబాపతు ... లక్షమంది లక్ష అనుకుంటారు...ఒకటి చూసి, ఇంకేదో ఊహించుకొని, మరేదో చెప్పుకుంటారు ...కనుక ... అవన్నీ మరిచిపో ... నిజంగానప్పుడు నమ్మవలసిందీ, బాధ పడవలసిందీ ఏమీలేదు ... ఆ వెధవ గొడవంతా పోనీయ్‌లే గాని...కూర్చోరా పండూ! ఓయ్ శారదా!... కాఫీ కలుపు ముందు... ముందు కాఫీ ... తరువాత టిఫెన్...వాడు బస్తీవాడే...పెద్ద ఆఫీ సరు...పెద్ద బిందెనిండా కాఫీ కలిపి

అట్టేపెడితే నోరుతెరిచి నప్పుడల్లా ఓ గ్లాసెడు పోస్తుందవచ్చు ! ... అదిరా నాన్నా! చూశావూ...నేను బాధపడటం లేదు...బాధపడవలసిన అవసరం నాకు లేదు — దైవసాక్షిగా నేను చెబుతున్నాను ... నా కాలాంటి దురుద్దేశం ఎన్నడూ కలగలేదు...ఆ అమ్మాయిని కోరుకోనూలేదు ... సరోజను నా చెల్లె లనుకున్నానురా ... నా చెల్లెలురా ఆ అమ్మాయి!'' అన్నాడు ఆవేశంగా రామం.

తడుస్తున్న కళ్ళతో సిన్సియర్ గా చెబుతున్న వాడి మాటలను వింటుంటే వాడిని ఎలా నమ్మకుండా వుండాలో నాకు అర్థంకాలేదు.

అందుకే, "సో ... ఫర్ గెట్ దట్ ...మర్చిపో—ఆ ఊరిని మరిచిపో... ఆ మనుష్యులను మరిచిపో...ఆ అమ్మాయిని మరిచిపో...అది ఓ పీడకలే అనుకొని అంతా మర్చిపో!" అనునయంగా అన్నాను. జేబులోనుంచి అర్ధరాత్రి వెన్నెల్లో సరోజవచ్చి ఇచ్చిన కాగితాన్ని బయటకుతీస్తూ, ఒక్కసారి శారద లోపలికి వెళ్ళిందో లేదో అన్నట్లుగా తొంగిచూసి "సరోజ నీకు ఉత్తరం ఇచ్చిందిరా!" అన్నాను.

"ఏం రాసింది?" నిర్లిప్తంగా అడిగాడు.

"ఏమో చూడు!"

వాడు కాగితం అందుకున్నాడు.









మడతవిప్పాడు. వాడిచేతి వేళ్ళు వణకడం గమనించాను. వాడికళ్ళు ఆదుర్దాగా ఆ ఉత్తరంలోని అక్షరాలవెంట పరుగెత్తటమూ గమనించాను...ఒక్క క్షణంలో వాడి కళ్ళు పెద్దవయి ఆపైన తెల్లని మల్లెల్లా నవ్వినాయిగూడా.

"నీవు చదవరా సత్యం!" నవ్వుతూ నా చేతికే తిరిగి యిచ్చాడు.

"అవసరమా?"

"అందులో రహస్యాలేం లేవు!" గూడ ఎగరవేసి నవ్వాడు. "శారదా! ఇటు రా—సరోజ ఉత్తరం రాసింది!" పెద్దగా పిలిచాడు.

క్షణం సంశయించినా, చదవటానికే నిర్ణయించుకున్నాను.

"మాష్టారూ!"

నా మూలకంగా మీ కెంత అపవాదు ...నన్ను మన్నించరూ!

—సరోజ."

* * *

టిఫెన్ తినడం అయింది. ఆపైన మళ్ళీ కాఫీ.

శారద సరదాగా...భర్తకు మిత్రుడనయి, అంతకుముందు ఎన్నడూ చూడని నన్ను ఎంతో ఆదరంగా, గౌరవంగా చూస్తోంది; కొత్తదనం లేకుండా...వంట యింట్లో కూర్చొని నంగినంగిగా మాట్లాడకుండా ... నేను ఆ యింట్లో కొత్తవాడిలా ఇబ్బంది పడకుండా... ప్రవర్తిస్తోంది.

పిల్లలు యిద్దరూ దీపాలే...

పదిగంటలవుతూండగా, రామం గుడ్డలు మార్చుకుంటూ, "కొత్తగదా! ఒక్కసారి స్కూలుకు వెళ్ళి, హెడ్మాస్టర్ గారికి కనబడి రెండుక్లాసులు తీసుకొని వస్తాను ఇదిగో, ఈ పుస్తకాలు చదువుకుంటూ కూర్చో!" అంటూ పాతమాగజైన్ల కట్టనొకదాన్ని నా ముందు పడేశాడు.

"నేను మధ్యాహ్నం వెళతాను!... పంటిగంటకల్లా వచ్చేస్తెయ్!" అన్నాను. అసలు అన్నీ కలిసివచ్చి, రాత్రే వాడిని చూడటం తటస్థించినట్లయితే ఈపాటికే బయల్దేరి వుండేవాడిని...

రామం, శారదా ఇద్దరూ ఒక్కసారే 'గంయ్' న లేచారు. కాదంటే కాదని మొండిగా తల అడ్డంగా ఊపసాగారు.

నా ఇబ్బందులన్నింటినీ నేను ఏకరువుపెట్టుకోక తప్పలేదు.

...ఈసారి మంగళగిరి వెళ్ళి మా నాన్న చస్తూ నాకిచ్చిన రెండెకరాల పొలంసంగతి చూడవలసిన అవసరం వున్నది...రెండేళ్ళబట్టీ సరిగ్గా పండి చావటంలేదంటున్నాడు రైతు — నేను వెళ్ళడంవలన వాడు పండటంలేదంటున్న పొలంలో కొత్తగా, మరింత ఎక్కువగా పండేదేం లేకపోయినా అదోతృప్తి...

నా కారణాల లిస్టుతోవాళ్ళను అంగీకరింపచేయటం నాకు కాస్త కష్టతరమయిన పనేఅయింది. ఈసారి వచ్చినప్పుడు తప్పకుండా రెండురోజులు వుంటానని మాట యిచ్చాను — అంతే గాకుండా సకుటుంబంగా గూడా వస్తానని వాగ్దానంచేశాను...పైపెచ్చు ఎండాకాలం శెలవల్లో వాళ్ళేగనక వస్తే నేనూ వారంరోజులు శెలవుపెట్టి అందరంకలిసి



హైద్రాబాద్‌ను అన్నివైపులా చూడ వచ్చు అనిగూడా ఆహ్వానించాను.

రామం వంటిగంటకల్లా వస్తానంటూ స్కూలుకు వెళ్ళాడు.

పిల్లలతో కాసేపు మాటలు చెబుతూ కూర్చున్నాను...రామం యిచ్చిన పాత పుస్తకాలను తిరగవేస్తూ కాసేపు కాల క్షేపం చేశాను ... కాసేపు అలా రోడ్ల మీద తిరిగివద్దామా అనిపించింది నాకు.

శారద వంట యింట్లోనుంచి వచ్చింది.

"రాత్రి మీ మిత్రుణ్ణి గురించి ఆ మునసబు ఏమన్నాడు అన్నయ్య గారూ?" అన్నది — ఆమె ముఖంలో బాధ అద్దంలో స్పష్టంగా ప్రతిబింబి స్తోంది.

నా మనస్సుకూ కష్టంగానే వున్నది. "పోనీయమ్మా! రామం ఎలాంటివాడో నాకు తెలుసు ... ఇప్పుడు కాదుగదా

ఎప్పుడూ అలా ప్రవర్తించడు వాడు ...ఆ మునసబు మాటలను ఎవడు నమ్ముతాడు ... ఏ పాపమూ ఎరుగని సరోజగూడా ఎంతగా బాధపడుతున్నదో ఆమె రాసిన వుత్తరమే స్పష్టంచేస్తోంది ...ప్రదేశం ఎలాగూ మారారు గనుక ...దాన్నంతా ఓ చెడుకాలంలా భావించి మర్చిపోవటమే ఉత్తమం!"

"నిజమే అన్నయ్యగారూ!" అన్నది — ఆమె గొంతులోని విచారపు జీర నన్ను వివశుణ్ణి చేసింది.

ఒక్క క్షణం సంశయించినా, "రామంమీద నీకేమైనా అనుమానంగా వున్నదా?" అన్నాను చిన్నగా.

"ఛ!ఛ!" చాలా త్వరత్వరగా అన్నది. "దేవుడిలాంటి మనిషి ఆయన! ఆయనమీద అనుమాన మేవిటి ?" నొచ్చుకుంటున్నట్లే అన్నది.

"నిజం అది!"

కొద్దిక్షణాలు మా నడుమ నిశ్శబ్దమే రాజ్యంచేసింది.

"అన్నయ్యగారూ! ఒక్కొక్కసారి కొన్ని నిజాలను మనం మనస్సులో వుంచుకోనూలేమూ ...అటు బయటకు కక్కనూ లేమూ...అలాంటిదాంతో నే నేసిప్పుడు గిలగిలకొట్టుకు చస్తున్నాను ...ఎవ్వరికీ చెప్పుకోలేని నిజం !... నన్ను క్షమిస్తానంటే...మరొకరిముందు ముఖ్యంగా మీ మిత్రునిముందు— న యి జాంనూ అంట — బయటా... చిన్నగా ... లోతైన బావిలోనుండి మాట్లాడినట్టుగా అన్నది.

ఉత్సుకతతో ఆమె ముఖంలోకి చూడసాగాను.

"ఈ గొడవకంతటికీ కారణం నేను!"

"అదేవిటి?" నోరు తెరుచుకొని ఆశ్చర్యపోవటం నా వంతే అయింది.

"--మరేంచేయమంటారు చెప్పండి ...అసలే పల్లెటూరు...నా అనుకున్న వరొకరు లేని వూరు ... ఊరుకు పెద్ద యిన ఆ మునసబు ఎత్తుగోడల ఇంటిలో మరో మనిషికి కంటబడని కాపురం... ఎవరికి చెప్పుకోగలను నా బాధ?"

"ఏవైంది?"

"ఆ మునసబు ఆకలి విషపుచూపుల నుండి నన్ను నేను రక్షించుకోవటానికి ఓ బడిపంతులు ఏవిధంగా సహాయపడ గలడో నాకు అర్థంకాలేదు ... ఎదురు తిరగ్గలడా? ఎదిరించగలడా? ...అసలు ఎదురు తిరిగితే ఎదిరిస్తే—ఈ కుంకుమ కైనా నేను నోచుకొని వుండగలనా— మరోభయం...కుమిలి కుమిలి ఏడుస్తూ —అసలు విషయం దాచి — అనారోగ్యంగా వుంటున్నదంటూ మరో వూరికి ట్రాన్స్‌ఫర్‌కి ప్రయత్నించమని రక రకాలుగా పోరాను ... మీ మిత్రులు ప్రయత్నమయితే చేశారుగాని...బడి




పంతులు కోరికగూడా ఈడేరటమా ఈ ప్రపంచంలో...నాకు ఏంచేయాలోతోచ లేదు...మునసబు పంజా విసురు రోజు రోజుకూ దగ్గరవుతోంది—నాకు పగలే రాత్రులవుతున్నాయి—చీకటి—భయం జలదరింపు ... తప్పించుకోలేక నానా అవస్థలూ పడుతున్న స్థితిలో మెరుపులా ఓ ఆలోచన వచ్చింది!" నా ముఖం లోకి చూస్తూ అంతబాధలోనూ చిన్నగా నవ్వింది.

ఒక్క క్షణం మౌనం తరవాత మళ్ళీ నోరు విప్పింది — కొత్త ఊపిరి తీసుకున్నట్లుగా: "సరోజకు ఈయన గారు ట్యూషన్ చెబుతున్నారు ... అది ఆసరాగా తీసుకొని, కావాలని అనుమా నాస్పదమైన పరిస్థితులు ఏర్పరచి, వాళ్ళిద్దరూ అమాయకంగా నవ్వుకుంటు న్నప్పుడు...ఆ దృశ్యాల్ని మునసబు భార్యకు చూపించి నాలోని భయాల్ని ఆమె బుర్రలోకి ముల్లుల్లా గుచ్చాను... అది మరుక్షణంలోనే ఆఘమేఘాలమీద వెళ్ళి మునసబు తలలోకి ఎక్కింది... సరోజ పెళ్ళికావాల్సిన పిల్ల ... నానా రభస చేసుకుంటాడా...అంతే! రాజు తలుచుకుంటే ఇంకేమున్నది... ఆయన అలా జిల్లా కేంద్రానికి వెళ్ళటం ... ఈయనగారికి ఇలా ట్రాన్స్‌ఫర్ ఆర్డర్సు రావటం...అంతా కన్నుమూసి తెరిచే లోపలే జరిగిపోయింది!" హాయిగా నవ్వింది శారద.

## కథాసుధాసాగరం

పాప ౧౦



### 23

అమ్ముని ఎత్తుకొని అలా తిప్పుకొద్దా మని సాగరం బయల్దేరాడు. ఫాల్గుణ మాసాంతం, సాయంకాలం, గాలి ఆహ్లాద కరంగా ఉన్నది. బజారురస్తాగుండా వెళ్తుంటే పెద్దకొట్టు పాపరాజు పిల్చి, అమ్ము చేతుల్లో చాక్లెట్లు పెడుతూ "అంతా నీ పోలికేనయ్యా...! ఆడపిల్ల గౌను తొడిగినా వేంటి అబ్బాయికి!!" అన్నాడు. సాగరం వినిపించుకోకుండా కొట్టులోకి చూస్తూ, ఆరుపైసలు యిచ్చి అగ్గిపెట్టె యిమ్మన్నాడు.

"ఇదేంటయ్యో! నీ ఫేక్టరీ అగ్గిపెట్టె నువ్వు కొనుకోడం ఏటి?!" అన్నాడు పాపరాజు.

"ఫేక్టరీ పెట్టించడం నా వంతు. అది పనివాళ్లది. నేనూ కొనుక్కోవలసిందే! ..." అంటూ అగ్గిపెట్టె జేబులో వేసుకొని సాగరం రిక్షాకోసం చూస్తూంటే, పాపరాజు దగ్గిరిసావచ్చి, "సిన్నమాట ...మరేంలేదు, అగ్గిపెట్టెలు పెద్దలాటుగా కావాలి; కావలిస్తే చిల్లతమ్మకంపెట్టి ఆరు పైసాలచొప్పునే టోకుకి ఆ ధరే యిస్తాం వంటున్నారు! పెట్టెలమీద లేబిల్ అంటించనక్కర్లేదు గూడా. అది కొంత మిగులు మీకు,...నువ్వేమంటావో మరి ...?" అన్నాడు మెల్లిగా.

"అదా సంగతి! ... పుల్లలు బాగా వెలుగుతున్నాయి. పెట్టె నిండుగా ఉన్నాయి. పదిపైసలన్నా బంగార్లా చెల్లుతాయి. అంచేత లేబిల్ లేకుండా పెట్టెలు కొనుగోలుచేసి మరో రంగురంగుల బొమ్మ అంటించి యెక్కడ్నుంచో వస్తున్న మేలురకం సరుకని చెప్తూ పెట్టె పదిపైసలకో పన్నెండుకో అమ్ముతారు! అంతేనా?...పాపరాజుగారూ, అదిమాత్రం జరగదు. మేమే రేపట్నుంచి వెల పెంచుతున్నాం! ఆ లాభం కూడా పనివాళ్లకే దక్కించారు. మీరు ఇలాగ అడగకపోతే ఆరుపైసలుగానే ఉండిపోను. మీ వల్ల చాలా ఉపకారం జరిగింది. చాలా కృతజ్ఞతావందనాలు... , అని సాగరం అంటూంటే పాపరాజు సర్దుకొని "ఇదేంటయ్యో, నన్నంటున్నావ్! మా వోళ్లాకరు అడిగి సూడమంటే అడిగాను గాని...," అని నసుగుతూన్నంతలో సాగరం రిక్షాఎక్కి అమృతలక్ష్మిని వొళ్లో కూర్చోబెట్టుకొని పోనివ్వమన్నాడు రిక్షా వెళ్తూంటే చాలామంది తరిచి తరిచి పోలిక చూస్తూండడం కనిపెడ్తూనే ఉన్నాడు.

ఎప్పటికీ ఒక్కలాగే ఉన్న సంత బయలు కలియజూస్తూ రిక్షా దిగి ఎదురుగా ఉన్న దుకాణంకెళ్ళి, అమ్ముకు సరిపడే ఫ్రాకుతీసి, వెలచూసి డబ్బిస్తూంటే దుకాణంమీద కూర్చున్న నూకరాజమ్మ వెలవెలపోతూ, "మీ రెట్టించిన రెడీమేడులే కదా, డబ్బివ్వడవేంటి?" అన్నది.

"అందుకే కొంటున్నాను,...ఎవరు కుట్టారో, గౌనుమీద పువ్వులు, లత చాలా బాగున్నాయి! మరో రెండు రూపాయలు ఎక్కువ వెల పెట్టవలసింది!" అన్నాడు సాగరం.

"ఈ కాశింకోట ఊళ్లో అందరూ కొనగల్గినట్టుంటే నే తప్ప ఎక్కువ ధర కెవరు కొంటారు బాబూ!" అన్నది నూకరాజమ్మ.

"అలా అని చేతిపని చేసిందానికి కిట్టుబాటు లేకపోతే ఎలామరి? మరొకరు లాభానికి అమ్మపిల్లేని ధర పెట్టవలసిన

అవసరం యిప్పుడిప్పుడే నాకు తెలిసిందిలే!..." అంటూ సాగరం గౌను తిప్పిచూస్తూ, "అబ్బో! 'అమృతలక్ష్మి' అని పేరుకూడా ఎంబ్రాయిడరీచేసి ఉందే! చాలా బాగా కుదిరింది" అన్నాడు.

నూకరాజమ్మ ఒక బురదనీటిరంగు జాకెట్ తీసింది. దానిమీద రంగు దారాల్తో రెండు పడవలు కుట్టిఉన్నాయి; బుటాలుగా వర్లగింజలు కూడా బంగారు దావంతో..."అహా! అచ్చ నిండు గోదావరి నదిలాగే ఉన్నది. పనితనం మరీ బాగున్నది!" అన్నాడు సాగరం.

"మా కోడలుపిల్ల కుట్టింది బాబూ! రాజమండ్రి పిల్లలెండి:" అన్నది నూకరాజమ్మ. సాగరం జాకెట్ వెల యివ్వబోగా, "అది బహుమానం! డబ్బుచ్చుకోను, అమ్మగారి కివ్వండి!" అన్నది నూకరాజమ్మ.

"బహుమానాలు పంచడానికా దుకాణంమీద కూర్చున్నావు? వీల్లేదమ్మా!" అంటూ సాగరం డబ్బు లోపలకు వెట్టి! "అమ్మకంబట్టి కమీషనుకదూ! అమ్మకం బాగుందా? కమీషను సరిపోతుందా?" అనడిగాడు.

"ఇప్పుడిది కొంత అదరువుంది గనక వరవాలేదు—'' అంటూ అమ్మని పరకాయించి. ''అమ్మలు అంతా నాన్న పోలికే! అబ్బాయవ్వాల్సింది గాని— పేరేంటి బాబూ?'' అనడిగింది నూకరాజమ్మ.

"అమృతలక్ష్మి." అన్నాడు సాగరం.

"ఆఁ! అమ్మాయి పేరూ అదే! 'అమృతలక్ష్మి రడీమేడు దుస్తులు'..." అంటూ ఆవిడ ముచ్చటపడుతూంటే రిషా ఎక్కి తిరుగుముఖం పట్టించాడు సాగరం, అమ్మని దాస్తున్నట్టు కూచోబెట్టుకొని.

ఇంటికొచ్చి అమ్మని గోదావరి కందిస్తూ, ''గోదా! ఈ పిల్లను మరి తిప్పను—అంతా ఒకటే గోల. నాన్న పోలికట! అబ్బాయవ్వాల్సిందట! మొగపిల్లాడేనట!..." అన్నాడు విసుక్కుంటూ. గోదావరి వస్తున్న నవ్వు ఆపుకొంటూ పెదాలు బిగపట్టింది.

"ఇవేంటో చూశావా?" అని సాగరం కాగితం విప్పి గౌను, జాకెట్టూ చూపిస్తూ 'అమృతలక్ష్మి దుస్తులు' అన్నాడు, "ఉగాదికి తల్లీ కూతుళ్లు అలంకరించుకోండి," అని వాటిని యిస్తూ, జేబులోంచి అగ్గిపెట్టె తీసి ''ఇది 'అమృత అగ్గిపెట్టె,' ఈ 'అమృత' అగ్గిపుల్లతో వెలిగించిన పొయ్యిమీద ఇందింటా అమృతభాండం కుతకుతలాడుతూండాలి! మన అన్నపూర్ణ అమృతపూర్ణగా వెలుగుతూ ఉండాలి!" అన్నాడు.

చాలా సేపట్నించి నవ్వు అణిచిపెట్టుకున్న గోదావరి మరి ఆపలేక పెద్ద

పెట్టున పగలబడి నవ్వేసింది. సాగరం నిర్ఘాంతపోయి, "అంత నవ్వులాటగా ఉన్నాయా...?..." అన్నాడు ఎందుకు నవ్విందో తెలియక.

"అబ్బే అందుగ్గాదు—ఇందాక అమ్మని తిప్పనన్నారే, అందుకు నవ్వొచ్చి ఆపుకొన్నా ఆగిందికాదు. ఇప్పుడు రెట్టింపుగా వచ్చేసింది...రోజూ రిక్షామీద షికార్లు తీసికెళ్దామనుకున్నారు గాని, అయిందామీపని! ఇలాగే ఉంటుంది యీ సృష్టికథంతా! ఒకటి చేయబోతే ఇంకోటి ఎదురౌతుంది!"— అంటూ గోదావరి అమ్మను అక్కున జేర్చుకొని మంచంమీద జేరబడింది.

"గోదావరీ! కథ!... అమృతానికి అమృతాలు పెడుతూ వింటూండు. ఇదే ఆఖరి కథ..." అంటూ సాగరం చెప్పడం మొదలు పెట్టాడు...

"ఇప్పుడు భూగోళం ఎక్కడ ఉందో అదే స్థానంలో కుజగోళం ఉండేది అప్పుడు. అది ఊహకు అతీతమైన కాలం. అసలు కాలం అనేదే లౌకికమైన భ్రమ. అతి సమీపంలో ఉన్న రెండు గెలాక్సీల మధ్య నిలబడితే అక్కడ కాలం అనేదిలేదు! ఆదిమధ్యాంత రహితమైన ఆ శూన్యంలో చలనం అనేది ఎటూ కనిపించదు. ఆ నిశ్చలతత్వాన్నే 'శివం' అన్నారు.

కాలం అని మనం అంటున్నదంతా సూర్యుడిచుట్టూ వేర్వేరు కక్ష్యల్లో తిరుగు




తున్న గోళాళ గమనంవల్ల ఏర్పడినదే! మన కాలానికి భూమి కొలబద్ద.

ఇప్పుడు భూమి సూర్యుడిచుట్టూ తిరుగుతున్న కక్ష్య—'జీవకక్ష్య'; సూర్య కుటుంబంలో జీవోత్పత్తికి మిక్కిలి అనుకూల శీతోష్ణస్థితిగల కక్ష్య

ఇదొక్కటే. మొదట భూమి ఇంతకంటే చాలా పెద్దది. సూర్యుడికి యింకా దగ్గరగా ఉండేది. కుతకుతమని బెల్లంపాకం ఉడుకుతున్న స్థితిలో ఇటూ అటూ జరుగుతూ ఒకసారి సూర్యుడికి మరీచేరువగా జరిగినప్పటి ఆకర్షణా సంయోగంలో, ఆ ఉష్ణోగ్రతకి పాలు పొంగిపడినట్టు కొంత ముద్ద త్రుళ్ళిపోయి ఇప్పుడు మన భూగోళం తిరుగుతూంటున్న జీవకక్ష్యలో పడింది. భూమినుండి విడిపడిన ఆ ముద్ద గోళంగా సూర్యుడి చుట్టూ తిరుగుతూ క్రమక్రమంగా గట్టిపడి కుజలోకం అయింది. అందుకే కుజగ్రహాన్ని భూపుత్రుడు అనీ, 'కుమారం', 'అంగారకం' అనీ అన్నారు ఈ సంగతి శివ పురాణంలో వేరే మాటల్లో ఉంది. అప్పుడు కుజగ్రహం గ్రహంకాదు, ఇప్పుడు మనం ఉన్న భూమిలాంటి ప్రపంచం.

కుజలోకం పరిమాణం చిన్నది అవడంవల్ల గమనవేగం చాలా హెచ్చుగా ఉండేది. మన కాలప్రమాణంలో చెప్పాలంటే, సంవత్సరకాలంలో కుజలోకం ఎన్నోసార్లు సూర్యుణ్ణిచుట్టివచ్చేది. పరిభ్రమణవేగం కూడా హెచ్చే, మన రోజుకి ఎన్నోరోజులు దొర్లేవి.

కుజలోకం గమనవేగంలాగే దాని మీద పరిణామదశలు కూడా త్వరత్వరగా జరిగాయి. మన మనుష్యులవంటి 'కుజష్యులు' తయారై ఉచ్ఛదశకు చేరుకున్నారు. కుజమ్యుల పురోగమనం సూటిగా సాగింది ఇప్పుడు మన మనుష్యులు యింకా ఊహించలేనివాటిని ఎన్నిటినో కుజమ్యులు సాధించారు. వైజ్ఞానికంగా మహోన్నతస్థితిని అందుకున్నారు. సముద్రంలో పెద్ద నౌకలు పెట్టి పంటలు పండించారు. సముద్ర జలాన్ని అనుకూలంగా మార్చుకున్నారు సూర్యరశ్మిని శక్తిగా ఉపయోగించుకున్నారు. పరమాణువు కీలకాన్ని విడగొట్టి కుజషి బానిసగా చేసుకొన్నాడు రోదసిలో ఇళ్లుపెట్టుకొని విహరించారు పురోగమనం అంతటితో ఆగకుండా ఆవలిగ్రహాలమీద దాడిచేశారు. గురువునూ శుక్రుణ్ణీ తొక్కివచ్చారు. కాని ఏ గ్రహంకూడా జీవికకు ఉపకరించదని మరోగ్రహానికి వలసపోయే ప్రయత్నాన్ని కుజమ్యులు విరమించారు. కుజజనని అయిన భూమి ఉడుకుతున్న స్థితి నుంచి చల్లబడి జీవకక్ష్యలోకి వస్తేనే తప్ప మరొక జీవలోకానికి అవకాశం లేదని తేల్చుకొన్నారు.

కుజమ్యులు ఎంత ఉన్నతస్థితికి చేరుకోదల్చారంటే, కుజలోకంలో ప్రాంతాలు, దేశాలు, తత్వాలు లేవు. అంతా ఒకే ఒక కుజప్రపంచం. జాతులు లేవు. అంతా ఒకే ఒక్క కుజ జాతి. రంగు భేదంలేదు. అంతా ఒకే అంగారకారుణవర్ణం. ఆరాటాలు పోరాటాలు సమసిపోయినవి. స్వంత ఆస్తి అనే పదంలేదు

అన్నిటిమీదా అందరికీ సమానహక్కులు బాధ్యతలు ఉన్నాయి. ప్రకృతిసిద్ధమైన ఆడ-మగ వర్గాలే తప్ప వేరేవర్గాలు లేవు. ప్రతి కుజషి స్వేచ్ఛాజీవి. ప్రతి కుజమ్యుడు, ప్రతి కుజషిణి సర్వ స్వతంత్రులు. కుజమ్యులకు అసాధ్యమంటూ ఏదేలేదు. అన్నీ తమచేతుల్లో ఉన్నాయని వాళ్ల నమ్మకం. అతీతమైన శక్తి, దేవుడు మొదలైన ఊహలన్నీ పటాపంచలైపోయాయి. కుజలోకం చిన్నదవడంవల్ల ఒక్కటే పాలనా వ్యవస్థ ఏర్పడి అరమరికలు లేకుండా దివ్యంగా సాగడానికి అనుకూలమైంది-కాని, ఒకే ఒక్క సమస్య మిగిలి పెరిగిపోయింది

కుజలోకం అసలే చిన్నది, విజ్ఞానం యెంత పెరిగినా, ప్రగతి ఎంత సాగినా సమస్య పరిష్కారంకాలేదు. అదే పెరిగిపోతూన్న కుజమ్యజనసంఖ్య!

ప్రకృతి ఆడ మగ సంబంధం అనే తీయటి వలపన్ని, జీవినుండి జీవి రావడమనే తంత్రంతో మాయాజాలం చేస్తున్నది. జీవినుండి జీవి అనే సూత్రం తొలగాలి!

అప్పుడు కుజప్రపంచాన్ని అతి సమర్థవంతంగా నిర్వహిస్తూన్న కుజాగ్రణి-కుజషిణి. అప్పటికే కుజషిణులు మహోన్నతస్థితిని చేరుకున్నారు. ఐతే ప్రకృతి చేసిన అన్యాయం అంతా ఒక్కటే, 'అదే-మాతృత్వం! అందుకు తగ్గ శారీరక, మానసిక తత్వాలున్నా. వీటినుండి విముక్తిపొందనిదే కుజషిణి పరిపూర్ణజీవి కాలేదు. ఈ ప్రకృతి శాసనాన్ని రద్దుచేసినప్పుడే కుజషిణుల స్వాతంత్ర్యం అనే మాట సార్థకమౌతుంది! కుజషిణిని మాతృదేవత అనీ, ప్రకృతి శక్తి అనీ మభ్యపుచ్చడానికి వీలులేదు! కుజషిణి తన్ను తాను మార్చుకోగల శక్తి సామర్థ్యాలను కాదనడానికి ఎవరి తరమూ కాదు! అని కుజషిణీ మహాసమాఖ్యలో కుజాగ్రణి చేసిన ఉద్ఘాటన అంతటా ప్రసారమైంది.

ఆ సందేశం కొత్త చైతన్యాన్ని కలిగించింది. కుజ వనితలు మగవారిలాగే బలసామర్థ్యాలుగల శారీరక మానసిక పరిణామాన్ని సాధించే ప్రక్రియను విజయవంతంగా సాధించారు. స్త్రీలు పురుషులుగా మారడం ప్రారంభించారు. దాంతో కుజలోకం రెండు వర్గాలుగా చీలిపోయింది.

ప్రకృతిని అనుసరిస్తూనే సరిదిద్దుకోవాలని ఒక వర్గమూ, ప్రకృతిని భేదించి ఛేదించి కొత్తలోకాన్ని సృష్టిని నెలకొల్పాలని రెండోవర్గమూ అన్నారు. కొత్త కుజమ్యులు-పాత కుజమ్యులు అని రెండుగా చీలిపోయారు. కొత్తకే బలం హెచ్చుతుంది ఎప్పుడూ! కుజషిణులు స్త్రీత్వం నుండి విముక్తిపొందడానికే ఎగబ్రాకారు. కుజషిణి—కుజమ్యుడు అనే తేడా లేకుండా చేసుకోవడం వారి చేతు

ల్లోనే ఉందని నిరూపించుకున్నారు. కొత్త వర్గంవాళ్లు పాతవర్గంవాళ్లని గబ్బిలాలన్నారు; పాతవర్గ కుజషిఋలు చీకటిలో చిక్కుకున్న విలాసినులన్నారు.

రెండు వర్గాలమధ్యా వాదోపవాదాలు, పోటీ, సంఘర్షణ చెలరేగాయి. కొన్నాళ్ళకు కుజలోకం ఏమౌతుంది? కుజమ్యులకు వారసులెవరుంటారు? అన్న ప్రశ్న వచ్చింది. పాతవర్గంవాళ్ళు అందుకోసమే మేము; మా వర్గాన్ని కాపాడుకుంటాము అన్నారు. కాని పాతవారికి నిలువ నీడలేకపోయింది. వాళ్లని అంటరానివాళ్ళుగా క్షుద్రజీవులుగా వెలివేశారు.

కొత్తవర్గంవాళ్ళు ఊరుకోలేదు. శాస్త్ర విజ్ఞానం ఊరుకోనివ్వదుగదా మరి! ఎంత వెళ్ళినా తరుముతూనే ఉంటుంది. అమరత్వాన్ని సాధించాలని పరిశోధనలు ప్రారంభించారు.

రెండు వర్గాలు ఆశ్చర్యపడేట్లుగా మధ్య మరో వైజ్ఞానికవర్గం లేచి ప్రయోగాలు సాగించి, లేబరేటరీలో కుజజీవి ఉత్పత్తిని విజయవంతంగా సాధించింది! కుజలోకానికి వీళ్లే వారసులు! భావి కుజ పాలకులు! అని వాళ్లని చూపింది. వారి పేరు కుజులు – కౌదలు – అంగారులు అన్నారు. వీరికి తల్లి తండ్రి అంటూ ఉండరు. లేబరేటరీయే జనని. విజ్ఞానమే తండ్రి, ఆడ, మగా, సుఖాలు ఆకర్షణలూ అన్నీ ఉంటాయి. గర్భధారణ ఉండదు. కౌజుడు కావాలన్నా, కౌజి కావాలన్నా లేబరేటరీ యిస్తుంది అంగారులు బలంలోనూ, సుఖానూ కుజమ్యుల కంటే శక్తివంతులు.

పాత, కొత్త వర్గాలు రెండూ నశించినా ఫర్వాలేదు, కుజలోకానికి ఎంత మంది అవసరమో అంతమందిని మాత్రమే సృష్టిచేసుకోవచ్చు. రెండు వర్గాలమీద మూడో వర్గంగా వచ్చిన కుజజులు విజయం సాధించారు. కుజజులు పెరిగి పెద్దవారై వారికివారే కుజజులను తయారుచేసుకోవడం మొదలు పెట్టారు. వర్గబలం పెంచుకొన్నారు. పాత కొత్త వర్గాలు కలిసిపోయి మొత్తంగా కుజమ్యులది ఒక వర్గమూ, అంగారకులది మరో వర్గంగా మళ్ళా కుజలోకం రెండు వర్గాలుగా చీలింది, దేవ దానవ గణాలుగా.

కౌజులు తాము అయోనిజులమనీ, స్వయంభవులమనీ దేవతలమనీ చెప్పుకున్నారు. కుజమ్యులను అనాగరికులనీ, రాక్షసులనీ పిల్చారు. దేవదానవ యుద్ధాలు జరుగుతూండేవి. పాత కుజమ్యులు అంగారులను రాక్షసజన్ములంటూండేవారు. ఆ లెక్కన రాక్షసులే విజయంసాధిస్తూ దారుణకాండలు జరుపుతూండేవారు. ప్రకృతిసిద్ధంగా పుట్టిన కుజమ్యుల్లో ఏం రుచికనిపించిందో అంగారులకు, ఆ ఆడవాళ్ళనీ మగవాళ్లనీ ఎత్తుకుపోతూండేవారు. అవసరం తీరాక



విడిచిపెట్టడమో చంపడమో చేస్తూండే వారు. అంగారకుల ప్రాబల్యం మరీ మితిమీరి, కుజమృలను జంతువులను వేటాడినట్టు వేటాడి, దొరికిన వాళ్ళను కాలుస్తుండేవారు.

అంగారులెంత పురోగమించినా కాల ధర్మాన్ని తప్పించుకోలేకపోయారు. దేవతలం అని చెప్పుకొంటున్న కౌజులు అమరులు కాలేకపోవడం వారికే సిగ్గని పించింది. ప్రకృతిని ఎదుర్కొని అన్నీ సాధించదల్చారు ప్రతిసృష్టిచేయదల్చారు కాని చావులేకుండా సాధించలేక పోయారు. దానవులనిపించుకోబడుతున్న కుజమృల్లాగే కుజజులూ చస్తూన్నారు.

దేవ దానవ గణాలు ఒక రాజీకివచ్చి ఉమ్మడిగా అమృతత్వాన్ని సాధించడా నికి పరిశోధనలు చేసి చేసి చివరకొక నిర్ణయానికొచ్చారు. కుజగోళాన్ని మరి కొంతమేర శీతలత్వానికి తర్లించుకు వెళ్ళితేనేగాని అమృతత్వం అందుబాటు కాదన్నారు. మరోమార్గం లేదని ఏక గ్రీవంగా అనుకున్నారు. అందుకోసం కుజలోకాన్ని ఆవరించిఉన్న వాతావర ణం కరిగించి, రోదసిని చీల్చుకొని మరి కొంతదూరానికి నెట్టుకుపోవచ్చునని బ్రహ్మాండమైన ప్రయత్నంతో ఘోరాతి ఘోరమైన ఇంధనాల్ని పేల్చి, అంత రిక్షంలో ప్రళయాన్ని కల్పించారు. అందువల్లనో, మరెందువల్లనో పాలవెల్లి అనబడే మన జ్యోతిర్మండలంలో పెద్ద సంక్షోభం చెలరేగింది. ఆ క్షీరసాగర మథనంలో కుజగోళం జీవకక్ష్యలోంచి పట్టుతప్పిపోయి చాలా దూరంగా వెళ్ళి పోయింది. ఆదే సంక్షోభదశలో ఉడుకు



పోలికలు

దుకుబూరెలాగున్న భూగోళం ఒక్క దూకున జీవకక్ష్యలో వచ్చి పడి కుదురు కుంది. ఆ సమయంలోనే కొంత ముద్ద చిన్న గాజుబంతిలాగ భూమిని అంటి పెట్టుకున్నట్టు చుట్టూరా ప్రదక్షిణచేయడం మొదలుపెట్టింది. అంటే భూమికి చంద్రగోళం అనే ఉపగ్రహం ఏర్పడిందన్నమాట.

భూగోళం వేడితగ్గి పైభాగం గట్టిపడి యీ పృధ్విగా మారింది. జీవం ఉత్పన్నమైంది. ఇప్పుడు సూర్యుడిచుట్టూరా తిరుగుతున్న జీవకక్ష్య దాని స్వంతం అయింది.

కుజగోళం అవసరమైనదానికంటే అతి శీతలత్వంలోకి కొట్టుకుపోయి మరింత ముకుళించుకుపోయి మంచుతో పేరుకుపోయింది. ఆ విధంగా కుజలోకచరిత్ర అంతరించిపోయింది. కుజగ్రహంగా అలా తిరుగుతూనే ఉన్నది. అక్కడ ఏముందో యింకా తెలీదు. తెరిస్తే ఆ కుజగ్రహం పొరల్లో కుజజ. కుజమ్యల అవశేషాలు దొరకవచ్చు.

ఒక జీవలోకం అంతరించడం, అదే స్థానంలో మరొక జీవలోకం అవతరించడం జరిగింది. అదే మన భూమి, భూలక్ష్మి; క్షీరసాగరమధనంలో పుట్టిన అమృతమూ అదే; ఈ కక్ష్యలో తిరుగుతూన్నంతకాలమూ, మాతృత్వం యీ పుడమిని ఉన్నంతకాలమూ యీ పృధ్వి అమృతలక్ష్మి"— అంటూ సాగరం చెప్పడం ఆపి అటు చూశాడు.



మీద కట్టి ఉన్న పాలవెల్లి పందిరికి వేలాడుతున్న రంగుల లక్కపిడత బొంతుల్నీ, గిలిగిచ్చి కాయల్నీ, గాజు బుడ్లనీ చూసుకొంటూ అమ్మ నవ్వుతూ కేరింతాలు కొడుతూ ఆడుకొంటూన్నది.

"మన అమృతలక్ష్మిలాగే అనంతాకాశంలో చుక్కలతో, గ్రహాలతో ఎప్పుడూ ఎప్పటికీ పసిదానిలాగ తిరుగుతూ ఆడుకొంటున్న మన భూమి అమృతలక్ష్మి!" అన్నాడు సాగరం.

అంతవరకూ నోరు తెరుచుకొని వింటూన్న గోదావరి, "అమృతలక్ష్మి పేరుమీద ఎంత కథ అల్లారండీ!' అన్నది.

"అల్లడమేమిటి!! ఇలా జరగలేదని, ఎవరైనా అనగలరా? ఇలాగే జరిగిందని నేను అనుకోలేదుగాని' ... గోదావరీ! ముఖ్యమైన పనులు చాలా ఉన్నాయి. లాభదృష్టి, లోభదృష్టి రాకుండా చూసుకోవాలి. అమృతలక్ష్మితో నీకూ ఓపిక ఉండదు; అంచేత ఇప్పటికి మన కథానందసాగరం కట్టిపెడదాం! ... ఏదో ఆటగా చెప్పిన మన కథానందసాగరం కథలు పొల్లుగా కనిపించినా—చాలా గట్టి విత్తులే అని గర్వంగా చెప్పగలను!" అంటూ సాగరం ముగించాడు.





# మేం చేసిన తప్పు మీరూ చేస్తారా?!

అవసరాల రామకృష్ణారావు

(గత సంచిక తరువాయి)

అల్లంతదూరంలో పార్కు చేయబడి బీచ్ రోడ్డున కారు ఆగిఉంది. సముద్రపు ఒడ్డున కూచున్నారు దయామయీ, యాలిసూ...

"నన్నెక్కడికో తీసికెళతానన్నారుగా మదర్, వెళదామా?"

"మరెక్కడికో కాదు, ఇక్కడికే."

'ఎందుకూ? ఇలాంటప్పుడు సముద్ర పొడ్డుకి ఎందుకూ?'

"ఎందుకో చెబ్తాను విను... ముందు నువ్వు సముద్రంలో పడు. తర్వాత నేను పడతాను!"

యాలిస్ ఆ జవాబుకి అర్థం చెప్పుకో లేక తల్లడిల్లిపోయింది. హతభాగ్యులు బతకడానికి హాస్యోక్తులు అవసరమే. కాని దేనికైనా సమయమూ సందర్భమూ అంటూ ఉండవా! ఎదుటగా కనిపిస్తున్న దానికంటె గంభీరంగా ఉంది దయామయి మొహం.

మళ్ళీ దయామయి మొదలుపెట్టింది.

"మూడు నెలల క్రిందట ఆ ఆదివారం ఇప్పుడు జరిగినంత స్పష్టంగా గుర్తుంది నాకు. చర్చినుంచి ఇంటికి వస్తున్నాను. ప్రమాదవశాన నువ్వు నా కారుకింద పడ్డావు. శలవుదినం నాడు, అందులోనూ ఏదైనా ముఖ్యమైన పండుగ కలిసివచ్చిననాడు, ఆ బజారు ప్రాంతంలో ఇలాంటి యాక్సిడెంట్లు సర్వసహజం. అందులో అంతకుముందు నుంచీ మా డేవిడ్ హారన్ కొడుతున్న

ప్పుడు, మా నంబరు లన్నప్పుడు ఎవరైనా ప్రమాదం జరిగితే మా మనుషుల్ని ఇచ్చి ఆస్పత్రికి పంపేస్తాం. కాని సౌమ్య సిల్లిన నీ మొహం చూడగానే ఎందుకో నా గుండె చెమ్మగిల్లింది. ఇన్నాళ్ళూ బందీ చేసి ఉంచిన నాలోని అనురాగమనే అల్లరి పిల్లకి అప్పుడే అనుకోకుండా స్వేచ్ఛ లభించిందా అన్నంత ఆనందంకలిగింది. మళ్ళీ 'డిటాచ్ మెంట్' మీద గంటలకొద్దీ ఉపన్యసిస్తాను. ఏం లాభం? అభిమానం ఎంత చెడ్డది! దురభిమానం ఎంతగుడ్డిది! ఎన్ని గ్రంథాలు తిరగేస్తే ఏం ప్రయోజనం? ప్రేమకి నేనెంతగా మొహం వాచి ఉన్నానో రుజువయిపోయింది కదా! నువ్వు మా యింటికి వచ్చి రాగానే నా కథంతా ఒక్కమారు ఎలా చెప్పేసుకున్నానో చూశావు కదా!"

దుఃఖం ఆపుకోలేకపోయింది ఆమె.

"ఊరుకోండి మదర్!"

"ఎలా, ఎన్నాళ్ళని ఊరుకోనుయాలిస్? నీ రూపంలో మళ్ళీ మా మెర్సీ మా యింటికి వచ్చిందని మురిసిపోయాను. నా జీవితం ఒక కొలిక్కి వచ్చేసింది. మహా బతుకుతే ఇంకో పదేళ్ళు బతుకుతాను. ఈ పదేళ్లూ జన్మజన్మలకి సరిపోతుందని నిన్ను చూడగానే ఆశించాను. ఆశ అనేది మనిషికి పాశం అని బోధించే నేనెంత మూర్ఖురాల్ని! అది మనిషికి శ్వాస!... ఎంత ఆశిస్తేమాత్రం ఈ మూణ్ణెల్లల్లో నీతో ఏంఅనుభవించాను? నువ్వు తెచ్చిన ఒక ఖరీదయిన బట్ట కట్టుకోవు. ఇచ్చిన ఒక్క స్వీటూ నోట్లో పెట్టుకోవు. కారూ, టెలిఫోనూమెయిన్‌టెయిన్ చేస్తున్న ధనవంతురాల్ని నేను. కాని నా చేత్తో నేను ఒక్కటిచ్చి నీచేత అవుననిపించలేక పోయాను. పైగా నువ్వు చేసే పనిలేదు, చేయని పనిలేదు!... ఎక్కడ నేనిచ్చింది ఊరికే తినెయ్యవలసివస్తుందో అని దానికి పదింతలుగా ఏదో ఒక పనిచేసి బాకీ తీర్చేసుకుంటూ ఉంటావు. పోనీ అలాగైనా నా కళ్లెదుట ఉంటే అంతే చాలని సర్వశక్తులూ కూడదీసుకుని సరిపెట్టుకుంటే 'ఇక్కడుండడం నాకు చాలా కష్టంగా ఉంది' అని ఇవాళ స్పష్టంగా నీ నోటితో నువ్వు చెప్పేవు. మధ్యాహ్నం కాఫీ టిఫినూ ఇచ్చి నెలకి పదిరూపాయ లిచ్చినా నీకు చాలు! చివికిపోయిన నీ తల్లిలాంటిదానికి మాత్రం కారూఫోనూ ఇచ్చి నెలకి వెయ్యి రూపాయిలిచ్చినా చాలదు!!"

దయామయి వెక్కి వెక్కి ఏడ్చేసింది.

"మీ మనసుని బాగా నొప్పించినట్టున్నాను. నన్ను క్షమించండి. నిర్భాగ్యురాల్ని. నేనెక్కడ ఉంటే అక్కడ దుఃఖం తప్ప సుఖం లేనట్టుంది. నన్ను రక్షించి, ఆసరా కల్పించి, నన్ను సుఖపెట్టడానికి ఏదైనా చేద్దామని ప్రతిక్షణం తహతహలాడే మీ ఔదార్యాన్ని బతికున్నన్నాళ్ళూ కృతజ్ఞతతో గుర్తుంచుకుంటాను. కాని ప్రేమ వేరు. కర్తవ్య

నిర్వహణ వేరు. నాకు నన్నుగా బతక నివ్వండి. అంతగా మనసు దెబ్బతిన్నా ఇంకా బతికి ఉన్నానంటే నేను చెయ్య వలసిందేదో ముఖ్యమైన దొకటి మిగిలి ఉందనే అర్థం. మీరు పడమన్నా ఇక నేను సముద్రంలో పడను. మీరు తగి లేసినా మీ ఇంటి గడపదాటి ఇవతల పడను. ఇక వెళదాం రండి. నా మటుకు నన్ను ఎంతో సంపాదించుకోనివ్వండి నన్ను ప్రేమించకుండా ఉండలేనివారు, నా దారికి అడ్డెలా రాగలరు మదర్?"

యాలిస్ లేచి చెయ్యి అందించింది. యాంత్రికంగా లేచి ఆమెను అనుసరిం చింది దయామయి.

## 3

ఆ తర్వాతి మూడునెలల కాలంలో దయామయి అవస్థ ఏలాంటిదో చెప్ప లేముగాని ప్రభుదాసు కొత్తగాపడ్డ చిక్కు మాత్రం గమనించదగ్గది. అవడానికి అన్నదమ్ములేగాని శామ్యూల్, ప్రభు దాసుల ప్రకృతులు పూర్తిగా వేరు. శామ్యూల్ స్వతహా ఉద్రేకి. ఏమాత్రం సుఖమొచ్చినా దుఃఖమొచ్చినా అతను భార్యతో చెప్పుకుని తేలికపడందే ఉండ లేడు 'అందుకే 'నాకు పిల్లలు ఇద్దరు కారు, ముగ్గురూ' అనుకుంటుంది, అతని భార్య ప్రశాంతి. ఇక ప్రభుదాసు మన స్తత్వం అన్నగారికి పూర్తిగా వ్యతిరేకం. తన దమవేమో' అటలేమో అంతే... రోజుకంతా కలిపి పది పదిహేను మాటలు అతని నోటివెంట రావడం బ్రహ్మాండం.

నెలకి ముప్పై రూపాయలు ఇచ్చే పద్ధతిమీద శామ్యూల్ పిల్లలిద్దరికీ ఇంటి దగ్గర అల్ఫాబెట్, కొద్దిగా అర్థమెటిక్ చెప్పడానికి నియమితురాలైంది యాలిస్. పొద్దుట ఎనిమిదింటి పదివరకూ. మళ్ళీ సాయంకాలం ఆరు మొదలు ఏడు వరకు తను మెట్రిక్ లెక్కలు చెప్పించు కుంటుంది కృపానంద్ దగ్గర. బలవంతంమీద పదిరూపాయలు పుచ్చు కునేలా ఒప్పించింది.

ఎందుకోగాని యాలిస్ రాకపోకలు ప్రభుదాసు గుండెలమీద గాఢముద్రలే వేశాయి. సాయంకాలం ఆమె రాకపోక లతో తనకేం సంబంధంలేదు, ఆ వేళకి తను ఏ టెన్నిస్ కోర్టులోనో ఉంటాడు గనక.

పదిన్నరవరకూ తనకు కాలేజీ లేదు గనక పగలు ఎనిమిది మొదలు పది వరకూ తను ఇంట్లో ఉండిపోక తప్పదు. ఆ రెండుగంటలూ తను యాలిస్‌కి సంబంధించిన న్యూసెన్సో డిస్టర్బెన్సో అది భరించక తప్పడంలేదు. ఆ రెండు గంటలూ మాత్రమేనా? పొద్దుట తెల్లా రింది మొదలు ఆమె ఎప్పుడొస్తుందా అని ఎదురుచూడ్డంతోనే సరిపోతోంది. అంత వరకేనా, ఆ ముందురాత్రి సహా మర్నాడు యాలిస్ వస్తుందిగదా అని తనకి తను ధైర్యం చెప్పుకోడంతోనే

అయిపోతోంది. ఇన్నాళ్ళ కాలజ జీవితంలోఎప్పుడూ ఎవరికోసమూ కొట్టుకోని తన మనసు ఎందుకింతగా యాలిస్‌కోసం చలించిపోతోందో అతనికే అర్థంకాలేదు.

సాధారణంగా యాలిస్ తెల్లని నేత చీరలు తప్ప కట్టదు ఏ రంగు జాకట్టు వేసుకుంటుందో తెలీడానికి కూడా వీల్లేకుండా పమిట నిండుగా కప్పుకుని ఉంటుంది. చేతులకి చెరో రబ్బరు గాజు తప్పితే మరే నగలూ ఆమెకు ఉండవు. కాని ఏ ఖరీదైన దుస్తులూ,నగలూ ఇవ్వలేని సహజ సౌందర్యం ఆమెకుంది. దాన్ని చూసి మెచ్చుకుని ఆమెకు మనసర్పించిన ప్రభుదాసు, ఎప్పుడూ లేనంత షోకుగా రోజుకి ఒకలా ఎందుకు తయారవుతున్నాడో అతనికే అర్థంకావడం లేదు!

సూటిగా చూసినా ఏమీ అనుకోదు. ఎదురుగా అడ్డుగా నిల్చున్నా తలవంచుకుని దారి తప్పించుకుని వెళ్ళిపోతుంది. పోనీ చురుకుతనం శూన్యమా అనుకుంటే కథలూ కబుర్లూ చెబుతూ, ఆడుతూ పాడుతూ అలరిస్తూ ఎంతకఠినమైనవిషయమైనా పిల్లలకి నిమిషాలమీద కరతలామలకం చేసేస్తోంది. ఫలానాఅనిపోల్చుకోలేని ఆమెలోని గొప్పతనమే ప్రభుదాసుని బలీయంగా ఆమెవైపు లాగే ఆకర్షణ అయి కూచుంది. 'ఆమె గత చరిత్ర ఏమిటో, ఎలాంటిదో!' అన్న అనుమానమైనా రాలేదు ప్రభుదాసుకి. అందమైన పాపాయి [illegible] జన్మ ఏమిటో, ఎలాంటిదో!' అని ఎవరైనా అనుకుని పాపాయిని చిన్నచూపు చూస్తారా,అన్నంత ఫ్రీగా, బోల్డ్‌గా స్వీకరించింది అతని మనసు ఆమెని.

అన్న శామ్యూల్ బోళాతనం అతనికెప్పుడూ సరిపడదు. మామయ్య కృపానంద్ అంటే గౌరవమూ ప్రేమా ఉన్నాయిగాని తగినంత చనువులేదు. అయినా హైస్కూలు పనులతో అతనికెప్పుడూ తీరుబడే ఉండదు. ఇంకేమాత్రం మిగిలినా అంత దూరమూ వెళ్ళి దయామయి ఇంట్లో కూచుంటాడు. ఇవి చాలక ఈ మధ్య ఆ అమ్మాయికి లెక్కలు చెప్పడం ఒకటీ. అతన్ని కలుసుకోడానికేకుదరడంలేదు. ఎటొచ్చీ ఇంచుమించు తన భావాలు కలది ఇంట్లో ప్రశాంతి వదిన ఒక్కర్తే ఒక వయస్సువాళ్లు గనక - వాళ్ళలో ఆలాంటి పట్టింపులూ లేవు గనక ఇద్దరూ ఒకర్నొకరు పేరు పెట్టి పిల్చుకుంటారు ఈ యాలిస్ విషయం అటో ఇటో తేల్చుకోడానికి ఆమె తప్ప మరో మార్గం కనిపించలేదు ప్రభుదాసుకి. యాలిస్‌మాట దేవుడెరుగు. అసలు ఈ విషయంలో వదినగార్ని ఎలా కదపాలో అతనికి అర్థంకాలేదు. అయిదారు రోజులు ఆలోచించి - చిక్కుపడిన దారపు ఉండకి ఏ చివరా ఎంతకీ కనిపించకపోతే తెగించి ఓ చోట కట్ చెయ్యడమేనా మంచిదనే నిశ్చయానికి వచ్చాడు.

శామ్యూల్ ఇంకా లేచినట్లులేదు. కృపానంద్ పెరట్లోకివెళ్ళేడు. సమయం చూసి ప్రభుదాసు ప్రశాంతిని మేడమీదికి పిలిచేడు.

"ఇదేమి విడ్డూరం ప్రభూ, ఇంత ఉదయమే లేచికూచున్నావ్ ఇవాళ?" అంటూ ప్రశాంతి పైకి వచ్చింది.

"అలా కూచో శాంతీ. నీతో ఓ ముఖ్యమైన విషయం మాట్లాడాలి..."

ఆ తర్వాత ఏంచెప్పాలో ఎంత ఆలోచించినా అతనికి తోచలేదు.

"ఎప్పుడూ లేంది ఎందుకు ప్రభూ అలా నీళ్ల నములుతున్నావ్, ఏమిటి కథ?"

"అదికాదు శాంతీ, దయామయి ఆంటీ వాళ్ళింటికీ మనింటికీ ఎంత దూరముంటుందంటావ్?"

"బాగుంది ఆదా నీకు కావలసినముఖ్య విషయం? మైలురాళ్లులేవే దారిలో, ఏమిటి సాధనం? పోనీ టేపు పట్టుకుని బయల్దేరకపోయావా అందినకాడికి ఇంటింటికీ కొల్చుకుని, కలుపుకుంటూ వెడితే పోలే?"

"చాలా చక్కగా ఉంది శాంతీ నీ జవాబు? నీలాంటివారినే ఒకర్ని ఈ చెట్టుమీద కాకులెన్నుంటాయని అడిగారుట. అదేనుంత కష్టం. ఆ సంఖ్యని పదెట్టి గుణించి ఆఖరి సున్నా చెరిపేస్తే పోలే? అని జవాబిచ్చారుట."

కుర్చీలో కూచున్నాడు ... ప్రశాంతి.

"బాబూ, ఇప్పుడే ఏడుంపావు అయింది. పిల్లలిద్దరూ లేస్తే నన్నింక నిలబడనివ్వరు. మంగమ్మకి వంట పురమాయించాలి. ఎనిమిదో గంటకల్లా పిల్లల్ని ముస్తాబుచేసి ప్రైవేటుకి సిద్ధం చెయ్యాలి. మాటవరసకైనా ఒకరోజైనా ఆలస్యంగా రాదుకదా ఆ టీచరమ్మ!"

"కూచో... కూచో... ఆ టీచరమ్మ గురించి మాట్లాడ్డానికే నీకు అవకాశంకల్పిద్దామని పైకిరప్పించాను."

"పాపం, నామీద ఎంత జాలి నీకు! ఏమిటీ, ఉన్నట్టుండి నీకు ఆ అమ్మాయి వైపు గాలి మళ్ళింది! అదా సంగతి, చెప్పావే కావు?"

"అదేం కాదుగాని సాటిమనిషి బాధ పడుతూంటే చూడలేకపోతున్నాను శాంతీ నేను! పాపం రెండుమైళ్ళదూరం నుంచి నడిచివస్తున్నట్లుంది ఆ అమ్మాయి. కూరల మార్కెట్ ఎలాగా ఆంటీ ఇంటివైపేగా! ఏడున్నరకి స్కూటర్ మీదవెళ్ళి కూరలు బాస్కెట్‌లో వేసుకుని..."

"వచ్చేటప్పుడు ఆ అమ్మాయినికూడా బుట్టలో వేసేసుకుని..."

"అబ్బ! నన్ను పూర్తి చెయ్యనియ్యి శాంతీ! పదింపావుకి ఎలాగా నేను కాలేజీకి బయల్దేరాలిగద ... మా కాలేజీ అటు వైపేగద... పాపం ఆ అమ్మాయిని వాళ్ళింట్లో డ్రాప్‌చేసి వెళిపోతే తప్పా?"

నవ్వుతూ చప్పట్లుకొట్టింది ప్రశాంతి.

"అహా! అహా! రోడ్డుమీద నడిచే అందమైన ఆడపిల్లలంటే మొగాళ్ళకి ఎంత జాలి! చూడు నాయనా ప్రభూ, మా యింటికి ఇద్దరు వంశాంకురాల్ని ప్రసాదించాను. మీ వదిన అంటేకూడా అందులో సగం జాలి అయినా ఉండ దనుకుంటాను నీకు."

"అయితే?"

"ఏంలేదు. మా అర్బన్ బాంకుకీ మనింటికీ ఎంత దూరం?"

"కాలేజీనుంచి వచ్చేటప్పుడు టేపు ఒకటీ కొని తెచ్చిపెడతానులే!"

"అంత శ్రమ వద్దుగాని మూడు మైళ్ళని నీకు తెలుసుననుకొంటాను."

"నాకేం తెలీదు. అయినా తెలుసుకో వాలని లేదు."

"తెలుసుకోక తప్పదు. ఇన్నాళ్లై ప్రతిరోజూ అంతదూరం వెళ్ళి వర్క్ చేసుకు వస్తున్నానుగదా, ఒక్కరోజైనా మీ వదినగార్ని స్కూటర్‌మీద డ్రాప్ చెయ్యాలని బుద్ధి పుట్టిందిటయ్యా నీకు?"

"నీకేం? రిషామీద వెడుతున్నావ్. మామయ్య కారుమీద తిరిగొస్తున్నావ్. నిన్నెందుకు డ్రాప్ చెయ్యాలి నేను?"

"అవును. నీ ఆర్గ్యుమెంటు సరిగ్గానే ఉంది. పాపం మన వంటమనిషి మంగమ్మ చీకటితోనే లేచి ఆరుమైళ్ళ దూరంలో ఉన్న వాళ్ళ పల్లెటూరినుంచి నడిచివస్తోంది అనుకుంటాను కొంచెం వృద్ధురాలుగాని అదీ స్త్రీమూర్తే. పొద్దున్నే లేచి అక్కడికి స్కూటర్‌మీద వెళ్ళి నువ్వెందుకు ఆమెని పికప్ చేసుకుని రాకూడదు?"

అని పకపక నవ్వేసి—

"సంగతి తెలిసిందయ్యా ప్రభూ! ఐ యామ్ వెరీ హేపీ... స్కూటర్ విషయం రానివ్వనని ప్రోమిస్‌చేస్తే నాకు తోచిన సహాయం చెయ్యకపోను. విష్ యు గుడ్ లక్"

అంటూ కిందకి తుర్రుమంది.

ఇది జరిగిన నాలుగోరోజుగాని యాలిస్‌ని ఆ విషయమై కదపడం కుదర లేదు ప్రశాంతికి... ఆ సాయంకాలం కృపానంద్‌దగ్గర ట్యూషన్ అయిపోయి ఆమె వెళ్లిపోతూంటే 'నేనూ అటే వస్తున్నా నుండండి. కూరలు తెచ్చుకోవాలి' అంటూ ఓ సంచీ పట్టుకుని యాలిస్ వెంటపడింది ప్రశాంతి. ఇద్దరూ కలిసి సగందూరం నడిచారో లేదో 'ఇక్కడ పార్కులో చల్లగా ఉంది. కాసేపు కూచుందామా?' అని ఆ గుబురు పొదల చాటున వో మూల కూచోపెట్టింది.

"ఇవాళ మిమ్మల్ని కొన్ని సంగ తులు అడగదల్చుకున్నాను. అభ్యం తరం లేకపోతే జవాబులు ఇస్తారా యాలిస్?"

''అభ్యంతరం లేకపోతే జవాబు లివ్వడానికేముంది ప్రశాంతీ, అలాగే!'' తనమాట తనకే తిప్పికొట్టిన ఆమె

నేర్పరితనానికి నివాళు లిచ్చింది ప్రశాంతి. అయినా అంత సుళువుగా ఆమెను ఆ రోజు వదలదల్చుకోలేదు.

"దయామయిగారింటికి రాకముందు మీరెక్కడుండేవారు యాలిస్? అన్నాళ్ల తెలివితప్పి ఆస్పత్రిలో ఉండిపోతే మీవాళ్లెవరూ రాలేదేం? మీ నాన్నగారు ఏంచేస్తూ ఉంటారు? మీ స్వగ్రామం ఏది?"

అన్ని ప్రశ్నలూ విని నిశ్చలంగా ఒక్కమారు కళ్లెత్తి ప్రశాంతి మొహంలోకి చూసింది యాలిస్. ఏమాత్రం తొట్రుపడకుండా అంది.

"నన్ను మన్నించి ఇంకేవేనా అడగండి ప్రశాంతీ!"

ప్రశాంతి కిక ఏం మాట్లాడాలో తోచలేదు

మరో అయిదు నిమిషాలు ఇద్దరూ నిశ్శబ్దంలో గడిపేరు.

మళ్ళీ ప్రశాంతే అందుకుంది.

"మనిషి మనసు ఏ సరుకుతో తయారయిందో నాకు తెలీదుగాని అదెప్పుడూ చేదు రుచుల్నే గుర్తుపెట్టుకుంటూ ఉంటుంది, ఎన్ని తీపిసంగతులున్నా సరే. నా మటుకు నాకుమా సవిత్తల్లి చిన్నప్పుడు ఎన్ని బాధలు పెట్టిందో అవే గుర్తుంటాయి పదెకరాల పొలం ఆవిడదే నాకు సంక్రమించిందని ఎప్పుడోగాని జ్ఞాపకానికి రాదు!"

ప్రశాంతి రెండుచేతులూ ఆప్యాయంగా పట్టుకుంది యాలిస్.

"ఎంత బాగా ఎక్స్ప్రెస్ చేశారు అక్కా" అంది అప్రయత్నంగా.

ఆ స్పర్శకి ఆ పిలుపుకి చలించిపోయింది ప్రశాంతి. తనింకా ఏ విషయమూ ఎత్తకుండానే తను కోరే సంబంధాన్ని సూచిస్తూ 'అక్కా!' అని యాలిస్ పిలవనే పిలిచింది ప్రభూ అభిప్రాయం బయటపెట్టడానికి ఇంతకన్న మంచి ముహూర్తం వేరే ఏముంది!

"లోకమంతా మోసగాళ్లుగా కనిపించిన సమయంలో 'ఇక ఇక్కడ స్థానమేముంది నాలాటిదానికి!' అనిపించేది ఒకప్పుడు. దయామయిగారి ఇంటికి చేరిన వేళావిశేషం ఏమిటోగాని రోజురోజుకీ మంచివాళ్ళ సంఖ్య ఎక్కువై ప్రపంచమంతా మరింత నివాసయోగ్యంగా తోస్తోంది. దురదృష్టవంతురాల్నని పొరబడాను. నేనెంత అదృష్టవంతురాల్ని ప్రశాంతీ!"

"ఆ అదృష్టపు పైమెట్టు గురించి మాట్లాడ్డానికే మిమ్మల్నిక్కడికి తీసుకువచ్చాను యాలిస్? అదంత బాధాకరం అయితే గతాన్ని తవ్వుకోవలసిన అవసరం ఏమీలేదు. దాన్లోని మంచి చెడ్డలు పురాతత్వ శాస్త్రజ్ఞుల పరిశోధనలకు విడిచిపెడదాం ఆర్నెల్లుగా మీ నడవడిని చూస్తున్నాం. మీ వ్యక్తిత్వాన్ని అంచనా



యువ

వెయ్యడానికి అది చాలు. ఇప్పుడు నేను చెప్పబోయేది జాగ్రత్తగా విని మీ అభిప్రాయం చెప్పండి. మా మరిది ప్రభుదాసు లేడూ?"

"ఎందుకు లేడూ, ఎదురుగుండానే ఉన్నాడు!''

ప్రభూ మాటవిని త్రుళ్ళిపడిలేచి నిల బడ్డారు వాళ్ళిద్దరూ. ఆలశ్యంలోని సస్పెన్స్ భరించలేక, స్కూటర్ మీద ఆవేళకి అక్కడ చేరుకున్నాడు ప్రభు దాసు. 'సమయోచితంగా' వాచీ చూసు కుంది ప్రశాంతి.

"అప్పుడే ఆరున్నరయిపోయింది. అంకుల్‌కి మందివ్వాలి. నేను వెడుతు న్నాను." అని ఎవరి జవాబుకోసం ఆగ కుండా గబగబా కనపడిన ఓ సైకిల్ రిషా ఎక్కేసి చెక్కేసింది ప్రశాంతి.

"కూర్చోండి, మీతో మాటాడాలి" అన్నాడు ప్రభుదాసు.

యాలిస్ కూచోలేదు

మిమ్మల్నేం అడగను. "మీరేం చెప్ప నక్కర్లేదు. నేనే కొన్ని విషయాలు మీతో చెప్పుకుందామనుకుంటున్నాను కాస్సేపు సానుభూతితో చెవి ఒగ్గితే చాలు, ప్లీజ్."

యాలిస్ కూచోకుండా ఉండలేక పోయింది.

"అమ్మయ్య, రక్షించారు. కోపంతో ఎక్కడ విసవిసా నడిచి వెళ్ళిపోతారో అని హడలి చచ్చాను. మీ కోపం చల్లార డానికి మరోమంత్రంకూడా వెయ్యదల్చు కున్నాను, కాదనరుగా?"

ప్రభుదాసు రెండు ఐస్‌క్రీమ్ కప్స్ కొని ఒకటి ఆమెకిచ్చారు. ఆమెకి పుచ్చుకోక తప్పలేదు.

''ఇంక వెళ్ళాలి ఇప్పటికే మదర్ నాకోసం ఆతృతగా చూస్తూంటారు."

"అయితే ఆతృతగా చూస్తూన్న వాళ్ళెరికోసమైనా మీరు బయలుదేరి వెళు తూంటారన్నమాట. అలా చూసేది నేనే అయితే?"

అనేసి నాలిక కరుచుకుని కొంటెగా ఆమెవైపు చూశాడు ప్రభుదాసు.

ఈసారి లేచి నిలబడింది యాలిస్. అతను చెయ్యి అడ్డంగా పెట్టేడు.

"ఏమిటి మీరు మాట్లాడుతున్నది? ఇటీజ్ టూమచ్... ప్లీజ్ స్టాపిట్" ఆ చిరుచీకటివేళా, పార్కులోని ఆ మారు మూల ప్రదేశమూ, అన్నిటినీ మించి నెంలతరబడి తను ఎదురుచూసిన స్త్రీమూర్తినిఅంతదగ్గరగా చూడగల్గడమూ అతన్ని వివశుణ్ణి చేశాయి. ఆమెను దగ్గ రగా తీసుకుని ముద్దుపెట్టుకోబోయాడు.

"ఛ ... ఏమిటి మీరు చేస్తున్నది? ఎవరనుకున్నారు నేను? ఇప్పటికే నే నొకరి సొత్తుని. మరొకరి తల్లిని."

అంటూ బలవంతాన వదుల్చుకుని కళ్ళ నీరు గ్రుక్కుకుని, బయటకువచ్చి పడింది యాలిస్.

ప్రభు తన చెవుల్ని తనే నమ్మలేక

పోయాడు. ఇది నిజమా? యాలిస్‌కి ఇది వరకే పెళ్ళయిందా? పిల్లకూడా ఉందా? అలా పిచ్చివాడిలా ఆ పార్కులో ఎంత రాత్రివరకూ కూచున్నాడో అతనికే తెలీదు! '

## 4

యాలిస్ ఒక నిశ్చయానికి వచ్చేసింది. కాగితమూ కలమూ తీసింది. తలుపు దగ్గరగా వేసింది. రాయడం మొదలుపెట్టింది.

అనురాగమయీ, దయామయీ!

నన్ను రక్షించడమేకాక నా కొక ఆశ్రయం కల్పించారు. ఈ ఆరునెలలూ నన్ను కంటికి రెప్పలా కాచుకున్నారు. కేవలం ఒక్క వాక్యంలో 'కృతజ్ఞురాల్ని' అని చెప్పి నన్నెలా మోసం చేసుకోమన్నారు! మీ ఆదరాభిమానాలు మాత్రం ఈ జన్మలో మరచిపోనని మాత్రం చెప్పగలను, అంతే.

నేను మీ యింటికి రాకముందు నిర్దాక్షిణ్యంగా వంచించబడ్డాను. అదిగుర్తించి ఆకఠోర సత్యానికి తట్టుకోలేకపోయాను. అది ఆత్మహత్యా ప్రయత్నం కాదు గాని... ఎదురు చూడని గుండెదెబ్బకు నిలబడలేకే ఆనాడు మీ కారుకింద పడి ఉంటాను.

నాకెవరూ లేరనుకున్నాను. ప్రేమ అనేది ప్రపంచంలో అపురూపమనీ, అలభ్యమనీ, ఎవరినైనాసరే అనుమానపు దృష్టితో చూడడం తప్ప మార్గాంతరం లేదనీ, నా గతం నాకు హితం చెప్పింది.

కాని నరకలోకంలోంచి నందనవనంలోకి అడుగుపెడుతున్నానని నా కప్పుడు తెలీదు. అనాథగా పుట్టిన నేను అనాథగా చనిపోవడం ఆ ప్రభువుకి ఇష్టంలేదనుకుంటాను. మీ ఇంటికి వచ్చిన ఈ కొద్ది నెలల్లో ఎందరు ఆప్తులు నాకు, ఎందరు కుటుంబ సభ్యులు నాకు!

మీరు, కృపానంద్, శామ్యూల్, కిరణ్, ప్రశాంతి, ఏసుబాబు, బేబీ...నేనెక్కడున్నా మరచిపోకుండా నన్ను చుట్టుకున్న ఈ తియ్యని తీగలు ఎన్నని!

అప్పుడు సాటిమానవుడు వేసినకాటు భరించలేకపోయాను. ఇప్పుడు మానవోత్తములందరూ ముంచితేల్చే ప్రేమ వాహిని భరించలేక ఉక్కిరి బిక్కిరి అయిపోతున్నాను మదర్!

మీకు మీరుగా బయటపడిపోయినా నా కోరిక మేరకు నా గురించి అడగని మీ సహనం ఎంత ఉన్నతమైనది!

ఇరవైయేళ్ళ నా గతాన్ని గురించి సందేహించకుండా ఉండగలిగి, ఆరు నెలల నా వర్తమానాన్నే నా నడవడికి గీటురాయిగా తీసుకోగలిగిన కృపానంద్ కుటుంబంలోని సభ్యులందరూ ఎంతటి దృఢ చిత్తులు!

ఇలాంటి అమృతహృదయుల మధ్య నేను ఉండగలనా?

మదర్! ఒక దుర్మార్గుడిచేత నాశనం

చెయ్యబడ్డ దౌర్భాగ్యురాల్ని నేను. చావ కూడదని నిశ్చయించుకున్నాక ఇంక నా బతుక్కి లక్ష్యం ఒక్కటే. నన్ను నాశనంచేసిన ఆ వ్యక్తిని నాశనం చెయ్య డమే హింసకు ప్రతిహింస జవాబు కానేర దని ప్రచారంచేసే మృదు స్వభావులు మీరందరూ. కన్నంవేసినవాడికి అన్నం పెట్టే కరుణాత్ములు మీరు. మీ అందరి మధ్యా ఉంటూ, పరమ కృపాళులైన మీ మొహాలు చూస్తూ వేసుకున్న పథకం నేను పూర్తిగా చెయ్యగలనా మదర్!

ఒక నిశ్చయానికి వచ్చేశాను. నేని క్కడ ఉండలేను.

ఈ రాత్రే ఎలా వచ్చినదాన్ని అలా వెళ్ళిపోతున్నాను.

మీ ప్రేమాభిమానాలు ప్రతిక్షణం రుచిచూస్తూ, నా గతాన్ని నాలోదాచుకుని ఇంకా నాలో నేనే దగ్ధం అవడం దుర్లభం...

కాబట్టి...

ఎవరో చెయ్యిపట్టి ఆపినట్టు టక్కున ఆగిపోయింది యాలిస్. ఆపినట్టు ఏమిటి, అంతవరకూ ఆ ఉత్తరంలోని ప్రత్య క్షరం ప్రత్యక్షంగా చదివి అంతకుమించి రాయనివ్వకుండా చెయ్యిపట్టుకు ఆపే సింది దయామయి.

"ఇలా హఠాత్తుగా రహస్యంగా మీ రెప్పుడు వచ్చేశారు మదర్?" అంది ఒణుకుతూ యాలిస్.

"అసలు నేనివాళ చర్చికి వెడితే గదా!"

"మరి కారులో ఎక్కడికి వెళ్ళినట్టు?"

దయామయి చెప్పింది.

ఇంటికి చేరుకున్నాక పార్కులో జరిగిందంతా వదినగారికి పూసగుచ్చినట్టు చెప్పేడుట ప్రభుదాసు. విషయం ఇంత వరకూ వచ్చిన తర్వాత ఇంక దాచడం మంచిదికాదని ప్రశాంతి అందర్నీ కూచో బెట్టి అన్ని విషయాలూ చెప్పేసిందిట. అందరికన్న ఎక్కువ కలవరం కనపరి చింది కృపానంద్.

అందులో ఆ మర్నాడు పొద్దుటి ట్యూషన్‌కి యాలిస్ రాకపోవడంచూసి ఆయన ఆందోళనకి అంతులేకపోయిం దిట. మూడునెలలై మొదలుపెట్టినా ఒక్కరోజుంటే ఒక్కరోడు కూడా ట్యూషన్ చెప్పడం మానలేదు ఆమె. ఆదివారంపూట రావద్దని బలవంతాన ఆమెని ఒప్పించగలిగినా ఏసూ బేబీ మాత్రం ఆ నిబంధనకి ఎంతమాత్రం ఒప్పుకోలేదు. అభిమానపూరితమైన యాలిస్ ఆలనకి అంతటా అలవాటుపడి పోయిన ఆ పసిప్రాణుల్ని ఆ ఒక్క రోజూ పట్టుకోడం బ్రహ్మ ప్రళయమై పోయింది! ఏదో తప్పుచేసినట్టు ఎవరి మొహానచూసినా ఆ ఇంట్లో ఆ రోజు విచారరేఖలే! ఇక ప్రభుసంగతి చెప్పనే అక్కర్లేదు, ఆ రోజు అతను మేడ దిగనే లేదు!

"ఏదో కబురుపంపి ఈరోజు సర్వీస్ కాన్సిలు చేసుకో. తిన్నగా నాదగ్గరకిరా. నీతో యాలిస్ గురించి మాట్లాడాలి" అని కృపానంద్ ఫోను చెయ్యగా దయా మయి కారుమీద వాళ్ళింటికి వెళ్ళింది వాళ్ళింట్లో ఆరోజు చిన్న రౌండుటేబిల్ కాన్ఫరెన్సులాంటిది జరిగింది

"ఆరునెలలపాటు ప్రతి ఒక్కరం ఆమెను ఆద్యంతం పరిశీలించాము. ఆమెకి వ్యతిరేకంగా చెప్పకోడానికి మనలో ఏ ఒక్కరికీ ఒక్కటంటే ఒక్క పాయింటు లేదు. అలాంటి ఆమె గత జీవితం కల్మషభూయిష్టమని నమ్మ డంఎలా?" అంటూ దయామయి మొదలు పెట్టింది.

"అయితే, అంతలోపం లేనిదేఅయితే, ఎన్నిసార్లు ఎందరడిగినా ఆ విషయం ఎందుకు చెప్పదామె?" ఇప్పటికే నేనొకరి సొత్తుని నేనొకరి తల్లిని" అనడం దేనికి? ఆమె క్షేమం కోరిన మనం ఆమెను పూర్తిగా అర్థంచేసుకుని సహక రించాలంటే ఆమె గురించి పూర్తిగా తెలుసుకునితీరాలి. నువ్వొకసారి ఎలా గేనా ఆమెను ఒప్పించి ఇక్కడికి తీసు కురా దయా!" అని కృపానంద్ చెప్పిన మీదట దయామయి ఇంటికొచ్చింది. ఆ పొద్దుటనుంచీ యాలిస్ మొహంలో మార్పుని కనిపెట్టిన దయామయి రహ స్యంగా ఆమె గదికి చేరి, ఆ లేఖ అంతా చదివింది. "కాబట్టి...ఇలాంటి పలాయ నాలన్నీ ఇక్కడితో కట్టిపెట్టి, కారెక్కు."

"అలాగే...కాని అందరిముందు నా కథ బయటపెట్టడం నావల్లకాదు. తల్లైనా దైవమైనా నాకు మీరే. మీకే చెబుతాను. ఎక్కడికి వెళ్ళక్కర్లేదు - ఇక్కడే ఇప్పుడే చెబుతాను" మొహం కడుక్కొని మంచినీళ్ళు తాగివచ్చి యాలిస్ తన గడచిన కథ చెప్పడం ప్రారంభించింది.

నేను ఎక్కడ పుట్టేనో తెలీదు. ఏ తల్లి ఏ దురదృష్టపు గడియలలో నన్నీ లోకంలోకి తీసుకువచ్చిందో నే నెరగను. నాకు జ్ఞానం వచ్చిందగ్గిర్నుంచీ నేనొక అనాధ శరణాలయంలో పెరిగేను. తల్లి అని పేరుగల వ్యక్తి అక్కడ లేకపో వచ్చు. కాని పెద్దదొరసానమ్మ మార్గ రెట్ ప్రేమాభిమానాలు ఉండగా ఆ లోటు ఎప్పుడూ కనబడేదికాదు. అక్క చెల్లెళ్ళు లేరనే చింతకూడా నన్నెప్పుడూ క్రుంగతీసేదికాదు. ఒక గ్రూపులో ఇరవైమంది ఆడపిల్లలకి తక్కువ కాకుండా ఉండగా ఇక ఏదిలభించలేదని బాధ! అందరు సవతితల్లులూ హృద యంలేనివాళ్ళు కారు. అన్ని అనాధ శరణాలయాలూ అనాదరణకి ఆటపట్టులు కావు. ఒక్కముక్కలో చెప్పాలంటే చీకూ చింతా లేకుండా హాయిగా ఆరోగ్య కరంగా పెరిగేను నేనక్కడ.

అప్పటికి నాకు పదహారేళ్ళు వెళ్ళే యేమో...అది ఒక శీతాకాలపు సాయం

కాలం. రిజల్ట్సు వచ్చాయనీ, జిల్లాలో మా సంస్థలోనే అన్నిటినకన్న ఎక్కువ శాతం ప్యాసయ్యారనీ అందర్నీ మేట్రన్ సినిమాకి తీసికెళ్ళింది.

వంటామె కొడుక్కి జ్వరంగా ఉందని ఆమెకు సాయంగా నేను ఉండి పోయాను. నేను వరండాలో కూచుని గదులు తుడిచే గౌరితో కబుర్లు చెబుతున్నాను. పాపం గౌరికి అంత చిన్న వయసులోనే ఏదో దిమ్మర్ల జబ్బుట. చేతివేళ్ళు చెప్పినట్టు వినవు. అందుకని దాని పరికిణీకి బొందు ఎక్కించి పెడుతూ అక్కడ కూచుంటే ఈవినింగ్ వాక్ కి కాబోలు అలా వస్తున్న మా మార్గరెట్ గారు నన్ను చూసి తెల్ల బోయింది.

"అదేమిటి యాలిస్, అందరితోపాటు నువ్వు సినిమా కెళ్ళలేదూ?"

"నాకేమిటో వెళ్ళబుద్ధి కాలేదండీ"

ఆ ఆర్ఫనేజ్ స్ట్రిక్టు ఆర్డర్సు ప్రకారం ఆడపిల్లల్ని కాంపౌండ్ వాల్ దాటనివ్వరు. ఎప్పుడు వీధిని పడదామా అని ఎదురుచూడని వాళ్ళుండరు. అందులో సినిమాకి వెళ్ళడమంటే ఎన్ని జన్మల తపఃఫలమో అని ఎదురుచూస్తారు అందుకనే నేను వెళ్ళకపోవడం అనేది అత్యాశ్చర్యంగా తోచి ఉంటుంది పెద్ద దొరసానమ్మగారికి

"అంతమందీ సరదాగా వెళ్ళిపోతే నువ్వొక్కర్తివీ బిక్కుబిక్కుమంటూ ఎలా ఉండిపోగలిగేవు యాలిస్?" అని అడిగింది.

"నేనుకూడా వెళ్ళిపోతే వంటామె ఏమైపోతుంది చెప్పండి? జ్వరంతో ఆవిడ కొడుకు ఎలా మూలుగుతున్నాడో వింటే ఎంత దయమేస్తుందో..."

"అయితే ఆ మూలుగే నీకు సినిమా పాటకన్న హితవుగా తోచిందన్న మాట...మొత్తానికి చిత్రమైన పిల్లవమ్మా నువ్వు...అవునుగాని నీతో మాట్లాడాలి. ఒకసారి నాతో మా రూంకి రా...'

బొందు ఎక్కించడం పూర్తి అయింది. గౌరికి పరిగిణీ ఇచ్చి నేను మార్గరెట్ గారితో ఆ కాంపౌండ్ లోపలే ఉన్న ఆమె క్వార్టర్సుకి వెళ్ళేను ఆమె బాయ్ చేత రెండు కప్పుల టీ కలిపించి తెప్పించి ఇచ్చింది. దగ్గిరగా వచ్చి నా తలమీద చెయ్యివేసి నిమిరింది.

"ఆర్ఫనేజ్ లో అన్ని వయస్సుల వాళ్ళు ఒక వందమంది ఆడపిల్లలేనా ఉంటారు. ఎన్నిసార్లు చెప్పినా నేను ఓ ఆఫీసరునన్న భావం వాళ్ళు మరచిపోరు. వద్దని చెప్పినా నా రూంకి వస్తే అలా గజగజలాడుతూ చేతులుకట్టుకు నిలబడతారు. నువ్వు చూడు ఎంత దర్జాగా కాలుమీద కాలేసుకు కూచుని టీ సిప్ చేస్తున్నావో...ఇంత చనువు నీ కెవరిచ్చారు యాలిస్?'

నేనేం మాట్లాడను? అభిమానంతో ఆమెను చూస్తూ కూర్చున్నాను.

'అసలు నీ స్థానం నాకు దూరంగా అలా కుర్చీలో కాదు. నువ్వు ప్రతిక్షణం నా నెత్తి ఎక్కి తొక్కుతూ ఉండే బాగుణ్ణనిపిస్తూ ఉంటుంది...ఛ...ఏమిటి నేను మాట్లాడుతున్నది? బాగుంది వరస ...నేనేం చెబితే అది చెయ్యడమేనా ఏమిటి? ఆ మాత్రం పెద్దా చిన్నా తారతమ్యం చూపించనక్కర్లేదూ? ఇచ్చిందే చాలని ఇంకా ఎంతసేపు ఊనపడతావ్ ఆటే? ఊఁ లేచి నిలబడు ...చేతులు కట్టుకో..." మూతి ముడుచుకుని హడావిడిగా లేచి నిలబడ్డాను నేను.

"నేను ఏందుకు పంపించానో అడగవేం, అంత పొగరు మోతు తనం ఉందేం వ్యవహారం? అన్నట్టు నీ పరీక్ష అయిపోయిందట కదూ?"

హఠాత్తుగా అభినయించిన ఆమె సీరియస్‌నెస్‌ని చెదరగొడితేగాని అక్కడుండబుద్ధి పుట్టలేదు నాకు.

"గతించిన ప్రతి ప్రాణి మళ్ళీ జన్మ ఎత్తుతుందని మతం చెబుతోంది గదా, పెద్దమ్మగారూ!"

"అయితే?" అంది కళ్ళు చిట్లించి మార్గరెట్.

"పోయిన పరీక్ష మళ్ళీ ఎప్పటికో అప్పటికి ప్యాసవక పోతుందా!"

నా హాస్యం పనిచేసింది. ఆమె పకపక నవ్వింది.

"కూచో, కూచో...నిన్నే...కూచోమంటే...నేను నిలబడమనగానే లేచి నిలబడిపోవడమే కాబోలు. ఇంక నీ సొంతబుద్ధి అంటూ లేదూ? అలాగేలే పరీక్ష దానిమటుకదే పాసవుతుంది, ఆ రోజు రావాలి. అంతే కదూ? ఈ ప్రీమెట్రిక్‌లోనే ఇది రెండోసారి నువ్వు ఉండిపోడం ఈ అర్ఫనేజ్ రూల్సు నీకు తెలుసునుగదా. మూడోసారి ఫేలయితే ఇక చదవనివ్వరు."

"అయినా ఎప్పుడూ ఇబ్బందే వస్తుందా పెద్దమ్మగారూ. ఈసారి నేను ప్యాసై తీరుతాను."

'ఏం ఇదివరకు రెండుసార్లూ ఇబ్బంది వచ్చే ఫేలయ్యావా? జున్నుముక్కలా తయారవుతున్నావు రోజురోజుకీ. నీకొచ్చిన ఇబ్బంది ఏమిటట?"

"నాకు కాదనుకోండి."

"మరెవరికి?"

"అబ్బ, ఇప్పుడవన్నీ ఎందుకు పెద్దమ్మగారూ!"

"చెప్తావా" చెంప ఛెళ్ళుమనిపించమన్నావా?'

"ఈ చెంపమీద ఎన్నిసార్లు మీరు ఛెళ్ళుమనిపించారో నాకు గుర్తేకాని, అంత శ్రమ మీకెందుకూ" చెప్తా వినండి.

యాలిస్ చెప్తోంది. మార్గరెట్ ఆసక్తితో వింటోంది.

(సశేషం)

# అనుబంధం

'హితశ్రీ'



తనువొచ్చి అ ర గ ం ట కావొస్తోంది.

వసంత ఇంకా రాదేం? చిరాకు పడ సాగాడు మూర్తి. నిమిషం గడవటం యుగంగా కనిపిస్తోందతనికి. ఫానుకింద కూర్చున్నా స్వేదబిందువులు అదృశ్యం కావటంలేదు. ముఖం తుడుచుకున్నాడు. అసలే ఎండగావుంది. దానికితోడు ఊపిరి బిగపట్టుకు కూచున్నాడు. జీవితం అంతకీ సంబంధించిన సమస్య! నిర్ణయంకావాలి. ఏమవుతుందో!

లోపల ఏదో చప్పుడైంది. వసంత వొస్తున్నట్టుంది! మళ్ళీ ఓసారి ముఖం తుడుచుకుని ఎదురుగావున్న నిలువుటద్దంలో చూసుకున్నాడు. క్రాపు సర్దుకున్నాడు. షర్టుకాలరు సరిచేసుకున్నాడు. చిరునవ్వు అభినయించాడు. సోఫాలో చేరగిలబడి కాలుమీద కాలేసుకు కూచుని పోజు అద్దంలో చూసుకున్నాడు. 'బాగానే ఉన్నావులే, ఫరవాలేదు' అని అద్దం అభయహస్తం ఇచ్చింది.

వసంత ఇంకారాలేదు. విసుగుపుట్టింది అతనికి. ఎంతసేపు అలా కూచోటం? లేచాడు. ఏంచేయాలో తోచలేదు. గది నించి బయటమేడమీదకి వచ్చాడు. అంతగా జనసంచారం వుండేవీధి కాదది. ఏమీ తోచలేదు. మళ్ళీగదిలోకి వొచ్చాడు. పచారుచెయ్యటం ప్రారంభించాడు. కాని చప్పుడుకి వసంత ఏమైనా అనుకుంటుందేమోనని చప్పున ఆగాడు. షెల్ఫులో నించి ఓ పుస్తకంతీసుకుని మళ్ళీ సోఫాలో కూలబడ్డాడు. చదవ బుద్ధిపుట్టలేదు. ఉబుసుపోకకి పేజీలు తిప్పాడు. ఏదో

కాగితం కిందపడ్డది. తీశాడు. ఉత్తరంలా వుంది. తనకెందుకనుకుంటూనే అదే మిటో చూశాడు. ముచ్చెమటలుపోశాయి. ప్రేమలేఖ. ఎవరో? ఒకక్షణం అతనికి కళ్ళుతిరిగాయి. భవిష్యత్తు చీకటిగా కని పించింది. మరికాసేపటికి అతనికి పరి స్థితి కొద్దిగా అవగతమయింది. వసంతని తను కాక ఇంకెవరో ప్రేమిస్తున్నారనేది రూఢి. తనకావిషయంగురించి పూర్వం వున్న అనుమానం ఇప్పుడు బలపడ్డది. అతని ముఖం ఎర్రబడ్డది. వసంత ఆ ఉత్తరాన్ని చింపిపారేయకుండా అలా పుస్తకంలో దాచివుంచటం అతనికి గుండెల్లో రైళ్ల పరుగెత్తించింది. అంటే, ఆమె ఆ ప్రేమికుడు ఎవరినో నిర్లక్ష్యం చెయ్యటంలేదని స్పష్టం. మూర్తికి ముఖం జేవురించింది. కొంపతీసి వాడే ఆమె ప్రేమకి పాత్రుడు కాడుకదా! అతని ముఖంలో ఈర్ష్య తాండవించింది. దైన్యం మూర్తీభవించింది. నిస్పృహ ఆవరిం చింది సర్వస్వం పోగొట్టుకున్న వాడి లాగా సోఫాకి చేరగిలబడ్డాడు.

ఎదురుగావున్న నిలువుటద్దంలోకి శూన్యంగాచూశాడు. తటాలున అతను ముందుకు వంగాడు.

"ఎందుకా వెధవఏడుపు?"

ఈ మాటలు ఎవరూ అనలేదు. కాని ఎవరో అన్నట్టుగా అతనికి అనుభూతి కలిగింది. తనమీద తనకే ఏవగింపు కలి గింది. 'ఛీ' అనుకున్నాడు. ఒకక్షణంలో అతనిలో అంతకిపూర్వం కలిగిన భావ సంచలనం అదృశ్యమైంది.

ఆ ఉత్తరాన్ని మామూలు తెల్లకాగి తంగాచూశాడు. మళ్ళీదానిని పుస్తకంలో పెట్టేశాడు. ఒకవేళ వసంత ఆ ఉత్తరం రాసిన అతన్నే ప్రేమించేట్టయితే తను చేసేదేమీలేదు. అదృష్టం అతన్ని వరిం చిందన్నమాట ఈర్ష్యపడటం తెలివి తక్కువ. కాని అలా జరక్కుండా తనే మైనా చెయ్యగలడా? అంటే అతనికంటె తన ఆధిక్యత రుజువుచేసుకోగలడా? మూర్తిఆలోచించాడు వసంతకి చెప్పాలి. ఎంతో నైపుణ్యంతో అనుభూతి అంది స్తున్నట్టుగా చెప్పాలి. నిజాయితీ వుట్టి పడేలా చెప్పాలి. తను ఆమెని హృదయ నైర్మల్యంతో ప్రేమిస్తున్నాడు. హృద యాధి దేవతగా ఆరాధిస్తున్నాడు. ఇది నిజం, అని ఆమె నమ్మాలి. నమ్మి తీరాలి. అలా తను చెప్పగలగాలి. ఆమె లేకపోతే తన జీవితం అంధకారసదృశం అని ఆమె తెలుసుకోగలగాలి. ఎలా? మాటలతో ఏమీ లాభంలేదు. ముఖంలో ఈ భావాలు ప్రస్ఫుటంకావాలి. దైన్యం, అసహాయత, ప్రేమ, ఆశ, నిరాశ ఇవన్నీ తాండవించాలి

మూర్తి ముఖం అద్దంలో చూసు కున్నాడు. మళ్ళీ, మళ్ళీ చూసుకున్నాడు. మూర్తీభవించిన దీనత్వంలా ఉంటేగాని ఆమె కరుణించదు. అలా ...మధ్య యుగంలోని ఇంగ్లీషు హీరోలు మోకాళ్ళ



మీద నుంచుని ప్రాధేయపడటం అతనికి జ్ఞాపకం వొచ్చింది. ఇంచుమించు అలా— అంతే..."

"ఏమిటా వెధవమొహం?"

మూర్తికి వీపుమీద కొరడాతో కొట్టి నట్టయింది. తటాలున ముఖభంగిమలు అదృశ్యమయాయి సోఫాలో మామూలుగా కూర్చున్నాడు.

తలుపు చప్పుడైంది. ఆతృతగా అటు వైపుచూశాడు. కర్టెన్ తొలగింది.

"చాలా సేపైనట్టుంది, వచ్చి?"

అంత ఎక్కువసేపు కాలేదని మాట వరసగా అనాలని అస్పష్టంగా గొణిగాడు మూర్తి. కనీసం ఇప్పటికైనా దర్శనం కలిగింది! ఒకక్షణం అటూ ఇటూ చూసి ఆమె ముఖంలోకి చూశాడతను. కొంప కూలింది! ఆమె తనచేతిలో పుస్తకం వైపు చూస్తోంది. ఎంత మతిమాలిన పని చేశాడు! అతను తనవైపు చూడటంతో వసంత దృష్టిమళ్ళించింది. ఆమెకు కోపం తెప్పించానని అతను మధనపడటం ప్రారంభించాడు. ఇవాళ అన్నీ తెలివి తక్కువపనులే చేస్తున్నాడు.

వసంత తాపీగా కుర్చీలో కూర్చుని అంది, 'పుస్తకం తిరగేస్తూ కూర్చున్నట్టున్నారు!'

అసలు పుస్తకం పేజీలు తిప్పలేదని అందామనుకున్నాడు. కాని అనలేక పోయాడు. అంటే మటుకు ఆమె నమ్ముద్దూ? పైగా అబద్ధాలకోరనే వాదు కొనితెచ్చుకోటం అవుతుంది. "ఊ(" నసిగాడు.

కొన్నిక్షణాలు నిశ్శబ్దంగా గడిచి పోయాయి. వసంత ఏదో పత్రిక పేజీలు తిప్పుతోంది. ఆమె వైఖరిచూస్తేఇహ ఆశ పెట్టుకోటం అనవసరం అనుకోవొచ్చల్లేనే వుంది! తనంటే ఏమాత్రం లక్ష్యం వున్నట్టు ప్రవర్తించటంలేదు. అయినా చివరిదాకా ప్రయత్నం చెయ్యకతప్పదు, అన్నాడు.

"నేను వొచ్చినపని మీకు తెలుసను కుంటాను."

"చెప్పందే ఎలా తెలుస్తుంది?"

"ఊహించివుంటా రనుకుంటాను."

"ఏదో ముఖ్యవిషయం మాట్లాడా లన్నారు."

మూర్తి ఉపోద్ఘాతం విరమించాడు. సూటిగా చెప్పాడు రెండుముక్కల్లో. తమ పరిచయంవల్ల తనకి ఆమెమీద ప్రేమ కలిగిందనీ, ఆమె ఒప్పుకుంటుందని ఆశిస్తున్నాననీ.

వసంత ఏమీ మాట్లాడలేదు. ఆమె ముఖంలోమటుకు అతనికి కొంచెం ఆశ్చర్యం కనిపించింది. అదే అతనికి అర్థం కాలేదు. ఈ పరిస్థితి వొస్తుందని ఆమె ఊహించలేదనుకోటం కల్ల. అతనామె వైపు ఆదుర్దాగా చూశాడు. వసంత మూర్తి వైపు ఓసారిచూసి తరవాత అతనిచేతిలో పుస్తకంవైపు చూసింది. ఎంతసేపటికి ఆమె మాట్లాడలేదు. ఆ పుస్తకం అలా చూడటంతో మూర్తికి ఒళ్లుమండింది. అతన్ని అపహాస్యం చేస్తున్నట్టుగా ఫీల యాడు. ఏమిటి ఆమె అభిప్రాయం?

"మీ అభిప్రాయం నిర్మొహమాటంగా చెప్పొచ్చు."

అయినా ఆమె మాట్లాడలేదు. దిక్కులు చూడటం మళ్ళీ ఆ పుస్తకంవైపు చూడటం— మూర్తి ఉండబట్టలేకపోయాడు. కసిగా అన్నాడు.

"ఈ పుస్తకంలో ఉత్తరం నేను చూశాను. క్షమించాలి. యథాలాపంగా చూశాను. రహస్యం అనుకోలేదు."

వసంత ఒక్కక్షణం ఆగి అంది,

"అయితే, సరే."

ఏమిటామె వుద్దేశం? మూర్తి యిహ ప్రశ్నలేమీ అడగదలుచుకోలేదు అతనిలో సహనం చచ్చిపోయింది ఆమె ప్రవర్తన నిర్లక్ష్యభావం చూసి అతనికి అరికాలిమంట నెత్తికెక్కింది పుస్తకం ఆమె ముఖంమీద విసిరికొట్టాలని బలీయంగా అనిపించింది. కాని తమాయించుకున్నాడు. వెంటనే అక్కడినించి వెళ్ళి పోవటం శ్రేయస్కరం అనుకుని లేచాడు.

"వెడుతున్నారా?"

ఊం(

"ఉండండి. కొంచెం షర్బత్ తీసుకుని వెడుదురుగాని."

ఆమె మాటలు మామూలుగానే అంది. కాని మూర్తికి వెటకారంగా వినిపించాయి. వసంతలో యింత నైచ్యం, ఇంత దురహంకారం ఉన్నాయని తనెప్పుడూ అనుకోలేదు. తనని కీలుబొమ్మని ఆడించినట్టు ఆడిస్తోంది. మోసపోయాడు. అహంభావంతో యిన్నాళ్ళూ తనచుట్టూ తిప్పించుకుంది. తను మహా అందగత్తె అని గర్వం. అందం వుంటే వుండొచ్చు. కాని అంత మిడిసిపాటు దేనికి? అందంతో తనలాంటి వాళ్ళని ఉసిగొలిపి చివరికి ఎందుకూ పనికిరాని వాళ్ళనిగా, భగ్న హృదయులాగా చేస్తే ఆమెకి ఒరిగేదేమిటి? తనలాంటివాళ్ళు తలుచుకుంటే... మూర్తి తనని తను మర్చిపోయాడు ఉక్రోషంతో సర్వం మర్చిపోయాడు. వసంత షర్బత్తు కలపటంలో నిమగ్నురాలయింది. ఆమెవైపు మత్తెక్కిన కళ్ళతో చూశాడు. నఖశిఖపర్యంతం చూశాడు. ఒక అడుగు ముందుకు వేశాడు...సమీపిస్తున్నాడు .. ఒక్కసారి చుట్టూచూశాడు అరె! ఎవతిదాముఖం? భీకరంగా, పైశాచికంగా, నెత్తురులా ఎర్రగా...మూర్తి అదిరిపడ్డాడు. ఆ ముఖం, ఒకక్షణం గుండె ఆగిపోయినట్టనిపించిం దతనికి. ఆ పైశాచికవదనం!...కాదు. కాదు—మనిషే! అమ్మయ్య. మూర్తికి మనసు మనసులో లేదు. తటాలున అతనికి పరిస్థితి అర్థమైంది. గిరుక్కున వెనక్కి తిరిగాడు.

వసంత షర్బత్ కలిపి వెనక్కి తిరిగి చూసింది. మూర్తి లేడు. ఎదురుగా నిలువుటద్దంలో కనిపించింది—మూర్తి గబగబా వెళ్ళిపోతున్నాడు.

'మూర్తిగారూ'

అతను వినిపించుకునే స్థితిలోలేడు. భుజంమీద చెయ్యిపడ్డది. వసంత! అతని ముఖం వివర్ణమౌతోంది.

"అంత కోపమైతే ఎలా?

అతను సమాధానంచెప్పేస్థితిలోలేడు.

"రండి."

వెనక్కి తిరిగితే—!

రుమాలు అడ్డంపెట్టుకుని అప్రయత్నంగా నడిచాడు మళ్ళీ గదిలోకి. ఎదురుగా నిలువుటద్దంలో — పాలిపోయిన ముఖం. పక్కన సహజసుందర వదనారవిందం.

"లైఫ్‌సైజ్ ఫోటోలా వుందికదూ!"

ఒకక్షణం అతనికి వసంత మాటలు అర్థంకాలేదు. తరవాత ఆమెవైపు అనుమానంగా చూశాడు. ఆమె చిరునవ్వు నవ్వింది.

"ఆ ఉత్తరం శుద్ధకల్పితం. మిమ్మల్ని పరీక్షించటానికి నేనేరాశాను. నేనురావటం ఆలస్యంచేస్తే మీరాపుస్తకం తీస్తారని నాకుతెలుసు. కాని ఎంత నిబ్బరమండీ మీకు! అంత నిస్పృహని ఎలా అణచిపెట్టుకున్నారు! పల్లెత్తుమాట అనలేదు. ఈర్ష్యపడలేదు కాని ఎంత నిరాశపడ్డారో మీ ముఖంచూస్తేనే తెలుస్తోంది. మిమ్మల్ని ఒప్పుకోననుకున్నారా?"

ఏమిటేమిటో అంటోంది వసంత. అద్దంలో ఇద్దరినీచూసి మందంగానవ్వాడు మూర్తి. కాని అతనికా అద్దమే ముసిముసిగా నవ్వినట్టనిపించింది.




'ఉద్యోగం ఉద్యోగం అని కలవరించి పోయారు తీరా అది కాస్తా వచ్చేప్పటికి చప్పబడి పోయారేంటి...'

'లేనిదానికోసం తాపత్రయపడటం సహజం అయితే కష్టపడి ప్రయత్నం చేసి సాధించటంలో వుండే ఆనందం, దయాధర్మ భిక్షంగా రావటంలో వుండదు...'

'మీరనుకున్నంత తేలికగా మాత్రం యీ ఉద్యోగం రాలేదు...'

'ఈ ఉద్యోగంకోసం నా పరువు ప్రతిష్ఠలు యెంతవరకు ఖర్చయినాయో అని నా ఆవేదన...'

'మీరంటున్న దేమిటో నాకర్థం కావటంలేదు. నేను చెయ్యరాని పనేమి చెయ్యలేదు భార్యగా నా బాధ్యత సక్రమంగా నెరవేర్చుకున్నాను. మీకు ఉద్యోగం యిప్పించాను. మీకోసం నేను ఉద్యోగం చెయ్యటం మానుకుంటు న్నాను... అదే నేను చేసిన తప్పవుతే

మీరు నన్ను క్షమిస్తారనుకుంటాను...'

'...సుగుణా, నామతి పోతోంది. నువ్వేం చేశావో చెప్పు...' 'నేను యేం చేశానని మీరనుకుంటున్నారో అది ముందర నాకు చెప్పండి...'

'నేను నిన్ను గురించి యేమనుకున్నా ఫరవాలేదు. కాని లోకం నిన్ను గురించి యింకోవిధంగా అనుకోవటం నేను భరించలేను...'

'నామీద మీకున్న అభిమానానికి చాలా చాలా కృతజ్ఞతలు...'

'సుగుణా నువ్వు నన్ను అపార్థం చేసుకోవద్దు. నీమీద నాకు పూర్తి విశ్వాసం వుంది...'

"నామీద మీకు అంతవిశ్వాసం ఉండ బట్టే, నేను యి త ధైర్యంగా చెయ్య గలిగాను...'

"నావిశ్వాసం ఆసరాచేసుకుని నువ్వు చెయ్యకూడని పని చేస్తావని నేను అను కోవటం లేదు..."

"మీకా విశ్వాసం పోయిన నాడు నే నేంచేసినా, మీకు అది చెయ్యకూడని పనిగానే కనిపిస్తుంది..."

'నువ్వేం చేశావో చెప్పమని అడగ టానికి ధైర్యం చాలకపోయినా నువ్వు చెబుతావనే విశ్వాసం మాత్రం నాకు గట్టిగా వుంది...'

'నాకు తెలుసుకోవాలనే పట్టుదల వున్నప్పుడు చెప్పకపోవాలనే దురుద్దేశం మాత్రం నాలో లేదు...'

'నువ్వు చెప్పకపోయినంత మాత్రాన నీమీద నాకున్న విశ్వాసం సడలుతుందని నువ్వనుకుంటావని నేను ఊహించటం లేదు...'

'మీకు నామీద వున్న విశ్వాసం యెంత గాఢంగా వుందో తెలుసుకోవటా నికి నా సహనాన్ని మీరు పరీక్ష చేస్తు న్నారనుకుంటాను...'

'నేను యెంతో ఆదుర్దాగా వేస్తున్న ప్రశ్నలకు యింత తాపీగా సమాధానాలు యిస్తూ ముందర నా సహనాన్ని నువ్వు పరీక్ష చేస్తున్నావు...'

'మీ సహనమే నాకు రక్ష. మీ విశ్వా సమే నాకు అండ..." ఈ రెండూ ఆసరాచేసుకుని సూటిగా గదిలోకి వెళ్ళి పోయాను. ఆయన వంటరిగా సోఫాలో కూర్చుని వున్నాడు. నేనూ వెళ్ళి ఆయన ప్రక్కగా కూర్చున్నాను. ఆయన కళ్ళల్లో కళ్ళుపెట్టి చూశాను. ఆయన విలవిలలాడిపోయాడు. నన్ను దగ్గరకు తీసుకుందామనే ఆవేశంతో కొంచెం ముందుకు వొరిగాడు...ముందర నేను వచ్చిన పని పూర్తి కావాలి. తర్వాత మీరు కోరిన పనిపూర్తి అవుతుంది అన్నాను...'

'ఆ తర్వాత...'

'అదుగో మళ్ళీ మీ సహనం అంతరి స్తోంది...'

"నా సహనం అంతరించటం లేదు తెలుసుకోవాలనే కుతూహలం ముందుకు వస్తోంది, అంతే..." తాపీగా అన్నాడు మోహన్.

'నామీద ఆయనకు పూర్తి విశ్వాసం కలిగింది. నేను కలిగించాను నామాటల్లో ఆయనకు యేదో ఆకర్షణ కనిపించింది. అదే ఆయన బలహీనత...'

'విశ్వాసం వుండటం బలహీనతే అంటావా...'

"ఆయనకు నామీద ఆ క్షణాన కలిగిన విశ్వాసం బలహీనతే అంటాను..."

ఆమె సూటిగా అతని కళ్ళల్లోకిచూసింది.

'చప్పున మీకు ఉద్యోగానికి ఆర్డరు కాగితం యిచ్చేశాడు. నేను ఒక తీర్చలేని వాగ్దానాన్ని చేసివచ్చాను. అది ఆయన నమ్మాడు. అంతే...'

'నమ్మినవాన్ని మోసం చెయ్యటం మహాదారుణం. నువ్వు చేసిన వాగ్దానాన్ని నెరవేర్చటం నీ విద్యుక్త ధర్మం. నువ్వెళ్ళు...'

'మతుండి మాట్లాడుతున్నారా...'

'నాక్కాదు వుండాల్సింది మతి. నీకు. నీ కుండాలి ఆ మతి ఆ వాగ్దానం చేసినప్పుడు... ఆ తీర్చలేని వాగ్దానం చేసినప్పుడు ... ఒకర్ని మోసంచేసి మనం లాభంపొందటం మహాదారుణం. నేను యిలాంటి దాన్ని సహించలేను...'

'ఉద్యోగం ఉద్యోగం అని పగలూ రాత్రిళ్ళు కలవరించిపోయారే. తీరా చేతికొచ్చిన తర్వాత జారవిడుస్తారా...'

'చాలామందిఉద్యోగం కేవలంజీవితం గడవటానికే చేస్తారు. మనకు అలాంటి అవసరం ప్రస్తుతం కనిపించటంలేదు. అయినా నేను ఒక ఉద్యోగం చెయ్యాలనే పట్టుదల పట్టింది కేవలం నా వ్యక్తిత్వాన్ని పెంచుకోవటానికి, లోకందృష్టిలో నేను కూడా సమర్థున్ని అనిపించుకోవటానికి. నాకు ఆత్మవిశ్వాసంలేని పని యేదీ చెయ్యను. చెయ్యలేను కూడా...'

'మీరు చాలా పొరపాటు పడుతున్నారు... ఈ ఉద్యోగం మీకెలా వచ్చిందో యెవ్వరికీ తెలీదు...అయినా నోరు మెదపలేదు. ఉద్యోగం యివ్వటం ఆయన వంతుగాని తీసెయ్యటం ఆయన తరంకాదు...''

'అందుకని...' చప్పున ఆగేశాడు ఎటూతోచక.

'ఎందుకు అంత యిదయిపోతున్నారు. మీకు అవమానం కలిగించే పని యెన్నడూ చెయ్యనని చెప్పాగా. తర్వాత యేం జరిగిందో చెపుతా పట్టండి... ఆయన దగ్గర ఆర్డరు కాగితం తీసుకువచ్చానేగాని నా మనస్సు మనస్సులో లేదు. కొయ్యబారిపోయాను. నేనుచేసిన పని సరిఅయినదికాదని నా అంతరాత్మ నాకు చెపుతోంది. మర్నాడు వస్తానన్న టైముకు సూటిగా ఆయనింటికి వెళ్ళాను. ఆయన గదిలో ఒంటరిగా సోఫాలో కూర్చున్నాడు. నేనూ వెళ్ళి ఆయన ప్రక్కనే కూర్చున్నాను...''

'ఆ...' మొహాన కారుతున్న చెమటలు తుడుచుకుంటూ తెరిచిన నోరు మూయకండా సుగుణ మొహంలోకి శూన్యంగా చూస్తున్నాడు.



'...నేను తీర్చలేని వాగ్దానాన్ని ముందు వెనకలు ఆలోచించకండా చేశాను క్షమించండి. ఈ ఆర్డరు కాగితం మీరే వుంచుకోండి. మావారికి ఉద్యోగం అక్కర్లేదు... అని గబగబ అనేసి చివాలున లేచాను... చప్పున నా చెయ్యి పట్టుకున్నాడు...' ఆమెకు దుఃఖం ఆగలేదు.

'రాస్కెల్... త...ర్వా...త...'

'అమ్మాయి కూర్చో అన్నాడు ... నువ్వు తొందరపడి యిక్కడికి వచ్చావు. ఎవరో ఏదో చెపితే నమ్మి యిట్లా రాకూడదు. మోహన్ రిటెన్ టెస్టు బాగా రాశాడు. ఇంటర్వ్యూలోకూడా ఫస్టే వచ్చాడు. అతనికి ఉద్యోగం ఇవ్వటానికి బోర్డు నిర్ణయించింది. అయితే నీ మూలాన నీ భర్తకు ఉద్యోగం వచ్చిందని నువ్వనుకుంటే నాకేమి అభ్యంతరం లేదు. నా బలహీనతవలన ఆ ఉద్యోగం వస్తుందనే నీ నమ్మకాన్ని తోసిపుచ్చటం నాకిష్టంలేక అట్లా చేశాను. అంతే...' ఆ సమయంలో నా మనసు ఎట్లావుందో యిప్పుడు చెప్పటం నాతరం కాదు... ఇహ ఈ ఉద్యోగాన్ని గురించి అపోహలన్నీ తొలగిపోయినట్టేగా...' ఆయాస పడుతూ అన్నది.

'ఇది కూడా నన్ను నమ్మమంటావా...' ప్రాధేయంగా అడిగాడు.

"మీ విశ్వాసమే నాకు పెద్దరక్ష...' అంతకంటె ప్రాధేయంగా అన్నది సుగుణ.




# ధ్వని-ప్రతిధ్వని

తిరుమల

ప్రయాణం అనగానే ఎంతో వుత్సాహంతో సామాను సర్దుకున్నాను. ఐదువందల మైళ్ళు జీపులో దారి పొడువునా మజిలీలు వేసుకుంటూ వెళ్ళడంలో వున్న హాయి ఆదరాబాదరాగా చేసే రైలు ప్రయాణంలో లేదు.

సామాను ట్రేయిలర్‌లో పెట్టి, దాన్ని జీపుకి తగిలించి ప్రయాణమయేను. అలవర్ పరిసరాలు వెనకపడ్డాయి. కొండచిలువలా పడున్న రోడ్డు-ఎత్తు పల్లాలు లేకపోవడంవల్ల తెప్పలా తేలిపోతూ పరుగెత్తుతూవుంది జీపు. వింజామరలు వీస్తూవున్నట్లు రోడ్డుకి యిరువేపులాగాలికి వూగులాడుతూవున్న వేప, మామిడిచెట్లు. ఎండ తీక్షణంగా వున్నా నీడలో ప్రయాణం హాయిగా సేద తీరినట్లువుంది. దూరంగా ఆకాశంతో కబుర్లు చెప్తూవున్న కొండలు-పచ్చని చీరకప్పుకున్న ప్రకృతి. రోడ్డు నిర్మానుష్యంగా వుంది - అప్పుడప్పుడు వచ్చే పోయే బస్సులు, లారీలు తప్ప.

సిరిస్కా-సమీపంలో పోతూవుంది

జీపు. పెళ్ళిపందిరిలో అల్లరిపిల్లల్లా చెట్ల కింద గోలచేస్తూ, గంతులేసే కొంత ముచ్చలు అంతా వన్యప్రదేశం. ఏనుగులు, సింహాలుతప్ప తదితర జంతువులు విచ్చలవిడిగా తిరుగాడే సిరిస్కాలోయ. వన్యమృగాల వనం (గేమ్ స్కాంచరీ) దగ్గరవుతూవుండగా ఆరుమాసాల క్రితం పులిని చూడాలని ఒక రాత్రి నేను పడ్డ యాతన జ్ఞాపకంవచ్చింది.

ఆ రోజు వార్డన్ 8 గంటలకే నన్ను తన జీపులో తీసుకుపోయాడు టైగర్ వ్యూకి. టైగర్ వ్యూ ఎత్తుగా ఒంటి స్తంభం మేడలావుంది. వన్యమృగాలు ఎటువైపునుండి వచ్చినా లోపలకూర్చుని నిశ్చింతగా చూడ్డానికి గదికి సిమెంటు గోడలస్థానే అద్దాలు అమర్చారు. అక్కడికి కొద్ది దూరంలో చిన్నకాలువ, దానికి అంటిపెట్టుకున్న సమతల ప్రదేశంలో చెట్టుకి గొలుసుతో కట్టిన మేక. పులిని చూసేటందుకు వచ్చేవాళ్ళు ఆ గదిలో గంటలకొద్దీ కూర్చోవలసి వస్తుంది. వాళ్ళకు అన్నివిధాలా సౌకర్యంగా వుండేందుకు సోఫాలు,టీపాయిలు,నాలుగు ఫోమ్ బెడ్సు అమర్చబడి వున్నాయి. చీకటిలో మేకను తినడానికి వచ్చే పులిని చూడ్డానికి పనికివచ్చే పెద్దలైటు గొడకు దగ్గరలో వుంది.

ఆ రోజు ఉదయం గేమ్ సేంచురీ గురించి అన్నీ వివరంగా చెప్తూ "పులిని చూడాలంటె ఒకోసారి రాత్రిఅంతా టైగర్ వ్యూలో పడిగాపులు కాయాలి సుమండీ" అంటూ వార్డన్ అన్నందున సరంజామా అంతా తీసుకునే వెళ్ళాం. హాట్ కేసులో యిద్దరికి సరిపడ్డ భోజనం, మటన్ చాప్స్, ఫ్లాస్కులో కాఫీ, విసుగుని వెంబడించేందుకు వుత్సాహప్రదాయిని-విస్కీ- ఐస్‌బాక్సులో దానికి కావలసిన సోడాలు.

మేం అక్కడికి చేరకముందే ఫారెస్టు జవాను మేకను కాలవగట్టున చెట్టుకి కట్టి, గదిలో తాగడానికి నీళ్ళుకూడా పెట్టి వెళ్ళిపోయాడు ట్రాన్సిస్టర్ ఆన్‌చేసి పులికోసం నిరీక్షణ మొదలు పెట్టేం. ఆ నిశీధిలో ఏ ఆకు ఆడినా ఏ కొమ్మ కదలినా సెర్చ్‌లైట్ ఆన్‌చేసి అటువేపు చూడ్డం, పులిమహారాజు కన పడకపోగా నిరాశతో గ్లాసులో విస్కీ పోసుకుని సిప్‌చేస్తూ మళ్ళా ఎదురు చూడ్డం.

అలా గంటలు దొర్లిపోయేయి. కాని ఫలితం కనుపించడంలేదు. అప్పటికే ఒక బాటల్ విస్కీ అయిపోయింది. వుండి వుండి మ్యూ, మ్యూ అన్న నెమళ్ల అరుపులు. ఎక్కడో దూరంలో అడవి దున్న రంకెలు, నక్కల వికృత నినాదాలు. కణుసు అరుపులకు మేలొ్కన్న పక్షుల గోల. నేనూ నాతో వున్న వార్డన్ తప్ప ఆ అడవిలో మరో మానవ మాత్రుడు లేడన్నది స్ఫురించగా అదో లాంటి భయంతో క్షణకాలం కదల

కుండా వుండిపోయాను. ఏ చిరుతపులో చెట్టుమీదనుండి దూకి గాజుగోడని పగలగొట్టి లోపలికి వచ్చేస్తే దాని బారి నుండి తప్పుకునే దెలా? నా పిచ్చికాని అంత ఎత్తులోవున్న మమ్మల్ని ఏ మృగమూ చేరుకోలేదు పోత పోసిన యినపద్వారం మూసి వుండగా ఏదో వూహించుకుని భయపడ్డం వెర్రితనం. చేతికి అందే దూరంలో రెండు డబుల్ బేరల్ తుపాకులు చూచి ధైర్యం పుంజుకున్నాను.

వాచీ నాలుగు గంటలు సూచిస్తూ వుంది. కాని పులిజాడే లేదు. తెల్లవారు జాము కావొచ్చింది. ఉషాసుందరికి స్వాగతంలా అడవి కోడివుంజు అరుపులు కూడా వినిపించేయి. ప్రకృతి బాగా చల్లబడింది. ఎంత వుత్సాహంతో వచ్చేనో అంత నిరాశ ఎదురైనందుకు విసుగు, చిరాకుతో సతమతమౌతూవున్న నన్ను శాంతపర్చడానికి.

"ఈవేళ రాలేదు కాబట్టి రేపుతప్పక వస్తుంది పులి. మీరు రేపుకూడా వుండి చూడండి. నేను పేమెంటు తీసుకోను." అన్న వార్డన్‌మాటలు నన్ను కొంతవరకు సాంత్వనపరిచినా, నాలో నేను నవ్వుకున్నాను-అతని దూరపు చూపుకి, తెలివికి. ఆ ఓదార్పు ఆటవికశాఖకు నేను చెల్లించిన ఫీజువల్ల కాదు- నాతో కలసి విస్కీ-పుచ్చుకు తాగినందుకు. మరో రోజు నేను అక్కడవుండిపోతే తనకు మరికొంత సత్‌సాంగత్యం లభిస్తుంది నిషాసుందరి బాహువుల్లో.

అలా ముగిసిన నా పులి సందర్శన యాత్రను జ్ఞాపకంచేసుకుంటూ వుండగా చల్లగాలికి కళ్ళు మూతలుపడ్డాయి. అలా ఎంతసేపు నిద్రపోయేనో తెలియదు జయపూర్ సమీపంలో ఆమేరుకోట కనుపించుతూ వుండగా మగతనుండి తేరుకున్నాను.

మధ్యాన్నం రెండు కావచ్చింది ఆకలిగావుంటే బజారులో ఓ పక్క జీపు పార్కు చేయించి డ్రయివర్‌ని కాపలా వుండమని క్వాలిటీ రెస్టారెంటుకోసం దిగేను. స్ప్రింగుతలుపు లాగి లోపలకు అడుగు పెట్టగా నాకు ఎదురైంది చీకటి లోపల అమావాస్యరాత్రిలా వుంది. కాలు ముందుకి కదిపితే ఏ కుర్చీకో డీకొంటా నని నిముషంపాటు అక్కడే ద్వారం దగ్గర నిల్చున్నాను. అప్పటికికాని కనుపించలేదు సీలింగులో అమర్చబడ్డ చుక్కల్లాంటి దీపాలు. ఏదో పాశ్చాత్య వాద్యసంగీతం మెల్లగా వినిపిస్తూవుంది. ఆమ్లేట్లు, మాంసంవేపుడు వాసనలు కలగాపులగంగా ముక్కుపుటాలకు సోకుతూవున్నాయి. కొండగుహలాంటి ఆలయబద్ధ వాతావరణంలో ఆర్తనాదంలో కాఫీ పెర్కులేటర్ చీత్కారం.

కష్టమర్సు అంతగాలేరు. చాలావరకు ఖాళీగా వున్నాయి టేబిల్సు. ఒక మూల వున్న సోఫాలో కూర్చుని వెజిటెబుల్




పులావ్, మాంసం కూర, సలాడ్ తెప్పించుకుని భోజనం ముగించి ఐస్ క్రీము ఆర్డర్ యిచ్చాను.

ఎందుకో ఐస్ క్రీముతోబాటు మా బాబు నా స్మృతిపథంలో మెదిలేడు. వాడికి ఐస్ క్రీమ్ అంటే ఎంతో యిష్టం. ఐస్ క్రీము యివ్వకపోతే ఫ్రిజ్‌లోవున్న ఐస్‌క్యూబుల్ని తినేసేవాడు. రాబోతున్న గడ్డురోజుల్ని, నేను పాల్గొనబోయే యుద్ధాన్ని, దానిలో ఎదురయ్యే యిబ్బందుల్ని వూహించుకుని, దేశం కాని దేశంలో ఒంటరిగా వదిలిపెడ్తే ఏ కష్టాంపాలౌతారోనని శ్రీమతిని, పిల్లల్ని వాళ్ళ తాతగారింటికి పంపించి, శత్రుసేనల్ని తరమడానికి యజ్ఞపశువులా నా వంటరి పయనం, యిప్పుడు వాళ్ళుండేది ఓ మారుమూల పల్లె. అక్కడ ఐస్ క్రీముకోసం ఎంతగా అల్లరిచేస్తూ వుంటాడో బాబు. ఆర్డరు రద్దుచేయాలని వెయిటర్‌ని పిలవబోతూ సగంలో ఆగిపోయాను సభ్యతగా వుండదని.

పత్రికల్లో వార్తలు, బంగ్లాదేశ్ సరిహద్దుల్లో ముక్తివాహిని చేసే దాడులు వాళ్ళకు మద్దత్తుగా మన సేనల చర్యలు, పశ్చిమ సరిహద్దులకు సేనల తరలింపు రానున్న యుద్ధానికి నాందిలా వుంది. బహుశా యుద్ధం అంటూ జరిగితే నాకు తిరుగు ప్రయాణం వుంటుందా? మళ్ళా క్వాలిటీలో యిలా తీరుబాటుగా కూర్చోగలనా? ఎన్నో ప్రశ్నాపరంపరలు నన్ను వేధించేయి.

ఒకసారి యుద్ధంలో మృత్యుముఖాన పడి, వినాశవిశాచాల వికరాల నృత్యం చూసిన నాలో ఆదోలాంటి భయం. నడిసముద్రంలో దిక్కుతెలియని ఒంటరివాడిలా, శూన్యంలో భ్రమించే ఏకాకిలా ఫీలయ్యేను. సూటిగా గుండెల్లోకి దూసుకుపోయే తుపాకీగుళ్ళు. బాగా

పండి కిందపడి ముక్కలు ముక్కలై పోయే గుమ్మడికాయమల్లే శరీరాల్ని చీల్చి తునాతునకలు చేసే గ్రెనేడులు, ఫిరంగులు. లేడిమూకల్ని తరిమే వేట కుక్కల్లా సైనికుల్ని వెంటాడి కాల్చి కుమ్మి చంపే టేంకులు, సైనికస్థావరాల్ని క్షణకాలంలో నేలమట్టంచేసి బూడిదగామార్చే బాంబర్లు కళ్ళముందు కనపించగా కళ్ళు మూసుకుని సోఫాలోకి జారిపోయేను.

"బేరర్ యిధర్" అన్నపిలుపునన్ను సుషుప్తినుండి లేపగా కళ్ళువిప్పి చూసేను. దివ్‌కోసం బేరర్ ఆశతో వడివడిగా నా పక్కన టేబిల్‌వేపు వెళ్తూవున్నాడు. వాడు ఐస్క్రీము ఎప్పుడు తెచ్చి పెట్టిపోయేడో అది నీరైపోయింది. ముట్టుకుని చూస్తే కప్పు చల్లగావుంది. దాన్ని తాగి బిల్లు చెల్లించి బయటపడ్డాను.

యింటినుండి తెచ్చుకున్న భోజనం తిని కునికిపాట్లు పడ్తూవున్న డ్రయివర్‌ని లేపి జీపు నడపమన్నాను. జీపు మంచి వేగం పుంజుకుంది. ప్రకృతిలో పచ్చదనం వెతికినా కనుపించదు ఆ పరిసరాల్లో. తేమ కరువై పటుత్వంలేని భూమి ఉపవాసం చేసి కృష్కించిన యోగుల్లా ఎక్కడో వందగజాలకో తుంబ చెట్టు భికారి చిరునవ్వులా ముళ్ళపొదలు. దిగంతాలవరకు కనుపించే యిసుక దిబ్బలు. నలుగురు కలసి అల్లరిచేసినా దూరంకాని స్థబ్దత అంతటా వ్యాపించి వుంది. అనంత సముద్రంలో పడవల్లా దూరంలో కనుపించే ఒంటెలు అది ఎడారికి వాకిలని తెలియజేస్తూ వున్నాయి.

ఢాం అన్న పెద్ద శబ్దంతోపాటు జీపు వెనకభాగం కుడివేపుకి ఒరిగిపోతూ జీపువేగం తగ్గిపోయింది. నాకు వెంటనే అర్థం అయిపోయింది జీపు వెనకటైరు పాడైపోయిందన్న విషయం. డ్రయివర్‌ని జీపు ఆపమన్నాను.

"స్పేరు వీలు ఎక్కించు" అన్న నా మాటలు అర్థంకానట్లు దీనానాథ్ దిక్కులుచూడ్డం నాకు కోపం తెప్పించింది.

"వీలు మార్చమంటే ఏమిటా దిక్కులు చూడ్డం" అన్న నా కరకుతనంకి వాడు భయపడ్తూ

"స్పేరు వీలులో గాలి లేదు సాహబ్. జయపూర్‌లో గాలి నింపాలనుకున్నాను. కాని మర్చిపోయేను. గాలిపంపు కూడా లేదు" అంటూ ఏడుపుముఖం పెట్టేడు.

అక్కడికి దగ్గరలో ఏ వూరూ వున్నట్లు లేదు, సహాయం కావాలంటే యిచ్చేవారు లేరు. బస్సుకానీ లారీకానీ రావడంలేదు. గోధూళివేళ కావచ్చింది. గుండ్రని అగ్నిగోళంలా మారి పశ్చిమాద్రిలోకి యింకిపోతూ వున్నాడు సూర్యుడు. దూరంలో ఎవరో ఒంటె మీద వస్తూవుండడం కనుపించగా ఆశగా అతని రాకకై నిరీక్షణం ఒంటె

మేంవున్నవేపు రావడం చూచేక అతన్ని పిలవమన్నాను దీనానాథ్‌ని.

రోడ్డు చేరుకుని వాహనం దిగి దగ్గరగా వచ్చి యూనిఫారంలోవున్న నాకు సెల్యూటుచేసి కరచాలనంకోసం చేయి అందించేడు ఆ వ్యక్తి. కరచాలనంచేస్తూ, తనపేరు రుధిర్‌సింగు అని చెప్తూవున్న అతని రూపురేఖలు నన్నెంతో ఆకర్షించేయి. వార్ధక్యంలో కూడా తాటిచెట్టులా నిలుచున్న అతని భారీశరీరం, పొడవైన ముక్కు, తెల్లగా నెరసిపోయిన గడ్డం, పసుపురంగు తలపాగాలోవున్న అతనిలో అదోలాంటి గంభీరత, సౌమ్యత కొట్టవచ్చినట్లు కనుపించేయి.

నేను మా పరిస్థితి చెప్పబోతూ వుండగా ఆ పని తనదైనట్లు మా సమస్య అతనితో చెప్పేడు డ్రయివర్ ధీనానాథ్.

"ఈ పాటిదానికే మీరు బెంబేలుపడిపోతారా? ఈ రాత్రికి మా గ్రామంలో నా అతిథిగా వుండండి. యిక్కడికి ఒక మైలు దూరం మా వూరు. అక్కడికి పోకరన్ పది మైళ్ళు. రేపు టైరు బాగుచేయించుకుని మీరు వెళ్ళిపోవచ్చు" అంటూ మా సమస్య పరిష్కరించేసినట్లు నా వేపు చూచేడు.

"మేం రేపు మధ్యాన్నంకి జైసల్మేరుకి యింకా వందమైళ్ళు దూరంలో వున్న మా కేంపుకి వెళ్ళిపోవాలి. అందుకు ఎలా చూచినా మేం తెల్లవారి 6 గంటలకి యిక్కడనుండి బయలుదేరిపోవాలి" అన్నాను రుధిర్‌సింగుతో.

"అలా అయితే మీరు నా యింట విశ్రాంతి తీసుకోండి. నేనూ మీ డ్రయివరూ ఏ లారీలోనో పోకరన్‌పోయి ఈ రాత్రికే టైరు బాగు చేయించుకుని వచ్చేస్తాం. అప్పుడు మీరు తెలతెలవారుతూవుండగా బయలుదేరి పోవచ్చు." అంటూ ఆశగా నావేపు చూస్తూవున్న రుధిర్‌సింగుని మనసులోనే అభినందించేను.

మైలుదూరం గాలిలేని చక్రంతో జీపు ఎలా నడపడం అన్నది మరో సమస్య అయి కూర్చుంది యింకో దారి కనపడక, మసకచీకట్లు కమ్ముకువస్తూవుండడంచేత ఏది ఎలా పోనీ-పీలుడ్రమ్ పాడైనా సరేనని జీపు మెల్లగా రోడ్డు పక్కనున్న యిసుకలో నడుపుకుంటూ పల్లె చేరుకున్నాం.

లెఖ్ఖకు పదియిళ్ళ గ్రామం అది. మట్టి గోడలపై నాలుగైదు అడుగులు పొడవు రెండు అడుగులు వెడల్పులో వున్న రాళ్ళను గోడలపై వుంచగా తయారైన యిళ్ళు అవి. పల్లెకు వంద గజాల దూరంలో ఓ నుయ్యి. నూతికి నాలుగు వేపులా నాలుగు గిలకలు. నూతికి అనుకుని పశువులు నీళ్ళుత్రాగడానికి రాళ్లతో కట్టిన కుండీలు నాలుగు

రుధిర్‌సింగు ఒక యింటిముందు ఆగి

"మొహిణా రెండుచెంబుల్లో నీళ్ళు తీసు కురా" అన్నాడు

మొహిణా బహుశా అతని భార్యో కోడలో అయివుండొచ్చు అనుకుని ఆ యింటివేపు చూచేను .రాళ్ళను వరుసగా పేర్చగా తయారైన ప్రహరీ గోడల మధ్య వుంది ఆ యిల్లు. దరిదాపుల్లో నేలమీద ఓ గడ్డిపోచకూడా లేక దూళి రేగుతూ వుంది అంతటా ఆ యింటికి కొద్ది దూరంలో నాలుగు ఆవులు తీరుబాటుగా పడుకుని మూతులుతిప్పుతూ వున్నాయి. ఈ ఎడారిలో ఏం తిని అంత పుష్టిగా వున్నాయి? బహుశా కండికి అందని, పాతాళంకి దారిలావున్న లోతుగల నుయ్యి నీళ్ళు తాగడంవల్ల నేమో వాటికి ఆ పుష్టి

గుండెలవరకు ముసుగులో ఓ స్త్రీ సిగ్గుతో ద్వారంవరకు వచ్చి రెండు నీళ్ళ చెంబులుపెట్టి తుర్రున లోపలకు జారుకుంది. ఆమె ఆకారం, శరీరసౌష్టవం, పొందికబట్టి ఆమె లేతప్రాయపు స్త్రీలా వుంది.

తరువాత రుధిర్‌సింగు చెప్పగా నా వూహ గురితప్పలేదని ఋజువైంది. మొహిణా రుధిర్‌సింగు కోడలు. తన కొడుకు పంజాబు సరిహద్దులో వుండడం చేత కోడలు తనకు సహాయంగా వుంటూ వంటా వార్పూ పొలంపనులకు చేదోడుగా అక్కడ వుంటూవుంది.

నా కోసం ఒక కుర్చీ తీసుకువస్తే దానిలో కూర్చున్నాను నాకు కొద్ది దూరంలో ఒక మంచంవేసి కూర్చోమంటే దీనానాధ్ ఒకంతకూ కూర్చోలేదు నా ఎదురుగా కూర్చోడానికి భయపడూ వున్నాడని.

"యిది యూనిట్ కాదుగా, కూర్చో. కొంతవిశ్రాంతి లభిస్తుంది" అని నేను అన్నతరువాత యిబ్బందిగా నానుండి ముఖం చాటు చేసుకుని కూర్చున్నాడు.

మొహిణాకాకుండా యింకా యింటిలో ఎవరున్నారో తెలుసుకోవాలనే నా వుత్సాహాన్ని అణగదొక్కుకున్నాను-అది నా హోదాకు సరితూగదని. అంతలో నా మనసులోని మాట పసిగట్టినట్లు స్వయంగా రుధిర్‌సింగు చెప్పుకొచ్చేడు తన విషయాలు.

"సాహబ్! నేను కూడా ఆర్మీలో మూడు దశాబ్దాలు వుద్యోగంచేసి సుబేదారుగా రిటైర్ అయ్యేను. నాకు ఒక కొడుకు, ఒక కూతురు కుమార్తెకు రెండు సంవత్సరాలైంది పెళ్ళిచేసి. యిక్కడికి ఐదుమైళ్ళ దూరంలో వున్న పలసణావాళ్ళ అత్తవారి వూరు. ఆమెకు సుస్తీగా వుందని కబురువస్తే ఈవేళ అక్కడికి వెళ్ళివస్తూవుంటే దారిలో మీరు కలిసేరు. వయసులో వుండగా వుద్యోగ రీత్యా నాకు దూరంగావున్నా నా కష్టాలు పంచుకుని రెండు రత్నాల్లాంటి బిడ్డల్ని కని నాకు ఎంతగానో సుఖపెట్టింది నా భార్య తీరా నేను వుద్యోగంవదిలి




యిక్కడికి చేరుకున్న తరువాత ఈ ఆఖరి రోజుల్లో తోడ గావుంటూ మనవల్ని ఎత్తుకోకుండా తనదారి తను చూసుకుని పరలోకాలకు వెళ్ళిపోయి ది. యిది అన్యాయం కాకమరేంటి?" అంటూ కళ్ళు మడుచుకుని మళ్ళా చెప్పడం ప్రారంభించేడు.

"ప్రభుత్వం నన్ను బా గా నే చూసింది ఇనాముగా పదిఎకరాలభూమి, పెన్షనూ- నాకేం లోటు లేదు- నాకు లేనిదల్లా ఏనుగులాంటి కొడుకు నా కళ్ళ ఎదుట లేకపోవడం ఎంతో చెప్పేను మావాడికి, ఈ ఉద్యోగాలు, ఈ దేశాటన వద్దు, వున్న పొలం చూసుకుంటూ భార్యతో నా కళ్ళముందు మసలమని. కాని వాడు లక్ష్యపెట్టకుండా తరతరాల నుండి వస్తూవున్న రివాజుగా సైన్యంలో చేరిపోయేడు. యిప్పటికీ అంటాడు, దేశంకోసం బ్రతకడంలో వున్న హాయి మరింకో వుద్యోగంలో లేదని యిక్కడి సంపద చూడ్డానికి నేను, మొహిణా వున్నాం అన్నది వాడి ధైర్యం-సంవత్సరానికి ఒకసారి వచ్చి మాకు రెండు నెలలు వసంతఋతువు చవి చూపించి దేశాలమీదకు పోతూవుంటాడు. యిలాంటి బ్రతుకులు మా రాజపుత్రులకు అలవాటే లెండి నా కొడుకు సైన్యంలో చచ్చిపోతాడని లేదా వాడు యింటిపట్టున లేకపోతే మాకు ఏదో నష్టం అని కాను నేను విచారించేది. నా బాధంతా నా కోడలిపిల్లకోసం. భర్త సాన్నిధ్యంలో వలపులు పండించుకునే వయసులో ఏకాంతవాసం చేస్తూ కుమిలి పోతూవున్న మొహిణాని చూస్తూవుంటే ఎక్కడలేని కోపం వస్తూవుంటుంది మా వాడిమీద. యౌవ్వనం, ప్రేమలు దేశంకోసం ధారబోస్తూ ఒకోసారి ప్రాణాలే దేశంకోసం నీరాజనంగా సమర్పించుకోవడం మా రాజ

పుత్రులకు ఉగ్గుపాలతో నేర్పిన విద్య. ఉప్పొంగే కోరికల్ని తమలో దాచుకుని, బాధకు, విరహవేదనకి సమిధులై పోతూ వుంటారు మా స్త్రీలు" అంటూ చెప్తున్న వాడల్లా తక్కున ఆగిపోయి,

"క్షమించండి. యింటికి తీసుకు వచ్చిన మీకు అతిథి మర్యాదలు చేయడం బదులు మీకు నా సోదితో విసుగు కలిగించేను. మరోలా అనుకోవద్దు" అని వడివడిగా యింటి లోపలికి వెళ్ళిపోయాడు కొంతసేపటికి ఒక స్టూలు తీసుకువచ్చి నా ముందు వుంచి, భోజనం తీసుకురమ్మని కోడలిని పిలిచేడు రుధిర్ సింగు.

మేఘంలోనుండి బయటపడ్డ పూర్ణ చంద్రబింబంలా వుంది మొహిణా. ఈ సారి ముసుగు లేకుండానే వచ్చింది. గుండ్రని ముఖానికి అందాన్నిచ్చే కుదురైన ముక్కు, మిలమిలా మెరిసే కళ్లు- ఆ కళ్ళలోని చిలిపితనం నాకు ఆమె స్వాగతం చెప్తూ వున్నట్లనిపించింది ఎత్తైన ఆమె విగ్రహం, దాచుకున్నా దాగని శరీరం వంపులు నన్ను కవ్వించ సాగేయి. నునుపైన ఆమె మెడమీద సోయగాల్ని చూస్తూ వుంటే ఒళ్ళు పులకరించి ఎవరో గిలిగింతలు పెట్టినట్లయింది. దగ్గరలో నన్ను మరి నాలుగు కళ్ళు కూడా చూస్తూవున్నాయనేది కూడా మర్చిపోయి ఆమెనే తదేకంగా చూస్తూ వున్న నన్ను తప్పించుకోవాలని కాబోలు థాళీ స్టూలుమీదపెట్టి లోపలికి వెళ్ళిపోయింది ఆ స్వప్నసుందరి.

నా ప్రవర్త చూసిన రుధిర్ సింగు ఏమనుకున్నాడో అనే భయం, సిగ్గువల్ల నామీద నాకే చికాకు, కోపం వచ్చేయి. మొక్కజొన్నపిండితో చేసిన రెండు చపాతీలు పెంకుల్లా గట్టిగా వున్నాయి. వాటితో కూర బదులు ఎండుమిరపకాయల ఆవకాయ. ఆ థాళీని అక్కడే పారబోసి నీళ్ళుతాగి సరిపెట్టుకోవాలనుకున్నాను. కాని నా ప్రవర్తనవల్ల రుధిర్ సింగు, మొహిణా బాధపడ్తారని పెంకుల్లాంటి ఆ చపాతీలు అతి కష్టం మీద తిన్నాను. జీపులోవున్న ఆపిల్సు తీసుకువచ్చేడు డ్రయివర్. వాటిలో ఒకటి నేను తీసుకుని తక్కినవి లోపల మొహిణాకి అందజేయమన్నాను.

నేను అన్యమనస్కంగా తిండిలో లీనమైనప్పుడు కాబోలు రుధిర్ సింగు, దీనానాథ్ భోజనం ముగించేరు.

నన్ను లోపలకు పోయి విశ్రాంతి తీసుకోమని చెప్పి టైరు బాగుచేయించి గాలి నింపడానికి డ్రయివర్ తోబాటు రుధిర్ సింగు కూడా వెళ్ళిపోయాడు పోకరన్.

ఒంటరిగా కూర్చున్నాను. బయట చీకటి చీరకప్పుకుంది రాత్రి. ఎదురింటిలో వెలుగుతున్న దీపంతప్ప అంతా నిశీథి. ఆమడ దూరంలోవున్న జీపు ప్రక్కన పరున్నదో కుక్క.




"చీకటిపడింది యిక లోపలికి వచ్చేయండి" అంటూ మందస్వరంలో మొహిణా పిలవగా గదిలోకి వెళ్ళేను. గదిలో నులకమంచంమీద నా పక్క పరచబడి వుంది ఒకమూల మట్టితో చేసిన గాదెలాంటిది- బహుశా జొన్నలు అవి వుంచుకోడానికి కాబోలు, యింకో వేపు వ్రేలాడుతూవున్న తొలుగుమీద తీరుగా పెట్టిన బట్టలు, గోడకి కొట్టిన పెద్ద మేకుకి సిల్లింగుతో తగిలించిన తుపాకీ. నా కోసం ఆ గది అప్పటికప్పుడు ఖాళీ చేసినట్లు వుంది గ్లాసుతో నీళ్ళు. స్టూలు మీద పెట్టి "ఏది కావాలన్నా నన్ను పిలవండి, నేను పక్కగదిలో వుంటాను" అని వెళ్ళిపోయింది మొహిణా.

గుడ్డిదీపం వెలుగులో పుస్తకపఠనం చేతకాక నిద్రాదేవి ఒడిలో నన్ను నే మర్చిపోవాలని ప్రయత్నించేను కాని ఒకంతకూ నిద్ర రావడంలేదు.

ఎడారి గర్భంలోవున్న ఆ యింటిలో అప్సరసలాంటి అందాలరాశితో ఒంటరి వాడ్ని. ఏదో భయం. యుగయుగాల సంఘర్షణకి కూడా చెక్కుచెదరని కోనార్కు రాతిబొమ్మలదర్పం వుంది మొహిణాలో. బలమైన అవయవాలు, గర్వంగా నిలుచున్న ఆ రొమ్ముల పొంగు అద్వితీయం. రెండు కొండలమధ్య లోయ లాంటి నడుం. నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నాయి. నాలో ఏదో రభస. ఏదో జరగబోతూవుంది. దానికి సిద్ధంగా వున్నానా? రక్తం, నరాలు వేడెక్కి శరీరం తలబష్టతోబిగిసిపోతూవుంది. శరీరాన్ని విరిచి మంచానికి కట్టితే బాగుండేదేమో అన్నట్లు సలుపుతో బాధ. మొహిణా సౌందర్యంలో పురుషుడ్ని లాలించి, సేద తీర్చే లాలత్వం లేదు. కళ్ళు మినుమిట్లు గొలిపి, కోరికల్ని రెచ్చగొట్టి, అందాల పిడిలో పురుషత్వాన్ని సవాలుచేస్తూ,

భూ సభోంతరాల్లో పిచ్చిగా తనతోపరిభ్ర మించుకునే ప్రబంధ సుందరుల రూప లావణ్యం ఆమెది. ఏ తపోనిధులో, ఏ యుగపురుషులో తప్ప నాలాంటి సామా న్యుడు అందుకుని ఆస్వాదించి, స్వర్గాలు చూస్తూ, చూపించగలిగే స్త్రీ స్వరూపి ణిలా లేదామె.

ఒకంతకూ నిద్రపట్టడంలేదు. మంచం మీద దొర్లేను. తాళ్ళ రాపిడికి కిర్రుకిర్రు మంది మంచం. శరీరంలో బిగువు కొంత తగ్గింది. కాని చెవులు వేడెక్కి కుంప టిలా వున్నాయి. నీళ్ళగ్లాసుకోసం చెయ్యి చాచేను చెయ్యి తగిలి గ్లాసు పెద్ద శబ్దం చేస్తూ పడిపోయింది.

"ఏమైంది సాహబ్" అంటూ పక్క గదినుండి వచ్చింది మొహినా,

ఆమె కళ్లల్లో చిలిపితనం కావాలనే నవ్వే అర్థంలేని ఆమె చిరునవ్వు మిల మిలా మెరిసిపోతూ వున్న నయనాలు. లేచి కూర్చున్నాను మంచంమీద. నేల మీదపడ్డ నీరు చూసి అర్థంచేసుకుంది కాబోలు క్రిందపడిన గ్లాసుతీసి స్టూలు మీద పెట్టింది. గ్లాసుమీద పెట్టిన మూత కోసం వెతుకుతూ చిన్నపిల్లలా మంచం క్రిందకు పాకుతూవుండగా ఆమె పిరు దులు నా పిక్కలను స్పృశించేయి. క్షణ కాలం నా కళ్ళముందు అంధకారం. శరీరం ఆధీనం తప్పిగాలిలో తేలిపోతూ వున్నట్లనిపించింది. ఆమె నన్ను తాకా లనేతాకింది. దానిలో ఏమాత్రంసంశయం లేదు. నన్ను వుద్రిక్తపరచి, రెచ్చగొట్ట టానికి కాకపోతే యింకోవేపునుండి మంచంక్రిందికి దూరేది. అసలు అంత రాత్రివేళ, ఎవరూ లేని యింటిలో పర పురుషుని సామీప్యానికి రావడంలో అర్థం?

ఒకవేపు సంస్కారం, సభ్యతపు; యింకోవేపు శరీరవాంఛల రాపిడిలో పరిసరాల్ని మర్చిపోయిన నేను ఆమె గదినుండి ఎప్పుడు వెళ్ళిపోయిందో చూడ లేదు. మరి కొద్దిక్షణాల్లో గదిలోకి కాలు పెడ్తూ,

"ఈ పాలు తాగండి. కడుపునిండితే నన్నా మీకు నిద్రపట్టవచ్చు" అంటూ గ్లాసు అందించబోయింది.

"అలాగే, అక్కడ పెట్టండి" అని ఆమెను చూడకూడదని ముఖం పక్కకు తిప్పుకున్నాను.

"ఉఁహుఁ అలాకాదు. యిప్పుడే తాగాలి. పాలు తాగి గ్లాసు ఖాళీచేస్తేనీళ్లు తీసుకువస్తాను. మీకు రాత్రి దాహంవేస్తే మళ్ళా నేను రావాలి పిలుస్తే" అంటూ దగ్గరగా వచ్చేసింది. గ్లాసు అందుకో డానికి నిలుచుండబోతూ వుండగా, ఆమె నాకు మరికొంత దగ్గరగా జరి గిందేమో, నా ఎడమభుజం ఆమె భుజా నికి రాసుకుంది. మెరుపు మెరసి ఆరి పోగా వ్యాపించే చీకటి తలగిర్రున తిరిగి పోయింది. అందుబాటులో వున్న ఆ




నిండు శరీరాన్ని కావలించుకుని కళ్ళు మూసుకోవాలనిపించింది. నోట మాట రావడంలేదు. శరీరం అధీనం తప్పిపోతూ వుంది. పాలగ్లాసు అందుకోవడానికి చెయ్యి కదపలేకపోయాను. దేన్నో వెదికే ఆమె కళ్ళలోకి చూస్తూవున్న నాకు ఆమె వేడి శ్వాస తగుల్తూ వుండగా పాలగ్లాసు అందుకోడంలో నా చేతిలోకి ఆమె వేళ్ళు యిమిడిపోవడంవల్ల నేను గ్లాసులాగడంతో గ్లాసుతోబాటు ఆమె నాకు చేరువైంది. రెండు శరీరాలూ ఒక దాన్ని ఒకటి వొత్తుకున్నాయి. మెత్తని స్పర్శ, అనూహ్యమైన అశక్తత, మైకంలో గుండెలు ఉధృతంగా కొట్టుకుంటూ వున్నాయి. ఎదురుగా గోడకు వ్రేలాడుతూవున్న తుపాకీ, నా గమ్యం, నా కర్తవ్యం నా ముందు నిలుచుని నవ్వుతూ వున్నట్లు ఎక్కడనుండో గలగలనవ్వులు. అక్కడ మరోక్షణం ఆలస్యంచేస్తే నేనూ నాతోపాటు ఎక్కడో దేశ సరిహద్దుల్లో గస్తీ చేస్తూవున్న ఒక సైనికుని గౌరవం రసాతలంకి జారిపోతాయి. పారిపోవాలి. నిశీథి ఒడిలో దాక్కోవాలి.

"మోహినా, ఒక్కనిమిషంలో వస్తా" అంటూ బయటపడి గదితలుపు పైనుండి గొళ్ళెంపెట్టి వెళ్ళి దగ్గరలోవున్న జీపులో కూర్చున్నాను.

నాలో భయం-ఏదో దోపిడీచేసి పారిపోతూవున్నట్లు. నల్లచీర ముసుగులో నున్న నిశాదేవి ఆశ్రయంలో ఒంటరివాడ్ని. ఆకాశాన మిల్కివే దేవతలంకోసం వేసిన బాటలా వుంది. ఈ తారకల పందిరిలో నాకు దూరంగా పిల్లల్ని యిద్దర్ని చెరొకప్రక్క వేసుకుని ఏ కలతలూలేకుండా హాయిగా నిద్రపోతూ వుంటుంది నా ప్రియసఖి-సరళ. నాకే

మంత్రసిద్ధులు వుండేక్షణకాలంలో ఆమె సమక్షంలో ప్రత్యక్షమై ఆమె ఒడిలో వాలిపోయి సేద తీర్చుకునేవాడిని. ఏ పూర్వజన్మ పాపాలకో పరిహారం చెల్లించుకుంటూ వున్నాను యిక్కడ. గంగా స్నానాలు. పుష్కరిణి పూజలు ఎన్నో చేసేను. కాని లాభం? ఏవేవో తర్కానికి; నిజానికి యోజనాల దూరంలో వున్న ఆలోచనలతో జీపులో ఎప్పుడు నిద్రపోయానో తెలియదు.

"సాహబ్ మీరు ఒంటరిగా జీపులో ఎందుకున్నారు?" అంటూ ప్రశ్నిస్తూవున్న రుధిర్‌సింగు మాటలకు కళ్ళుతెరిచేను. చేతి వాచీ రెండు గంటలు చూపించింది.

"లోపల ఉక్కగా వుంది. నాకు నిద్ర పట్టక యిలా బయటకు వచ్చేశాను. మంచం బయటవేయిస్తే మిగిలిన రెండు మూడు గంటలు నిద్రపోయి రేపు సూర్యోదయం కాకముందే వెళ్ళిపోతాం" అని నేను అనగా, రుధిర్‌సింగు, ధీనానాథ్ కలిసి మంచం బయటకు తీసుకొచ్చేరు.

ఏదో కొత్తశక్తి, బలం పుంజుకుంది శరీరం. "జైసల్‌మేర్ చేరుకుని సర్క్యూట్ హౌస్‌లో కాలకృత్యాలు తీర్చుకోవచ్చు" అని నాకు నేను చెప్పుకుని నిశ్చింతగా నిద్రపోయేను.

తెలతెలవారుతూ వుండగా మా ప్రయాణం

"సాహబ్, మొహిణా మీ కోసం ఈ మూట యిచ్చింది. దీనిలో జొన్నరొట్టెలు, వెన్నముద్ద, ఆవకాయ వున్నాయి. 'మీ నాస్తా అట" అంటూ చిన్న గుడ్డసంచి జీపు వెనకసీట్లో వుంచేరు రుధిర్‌సింగు.

ద్వారం ముందర నిలబడి నావేపు చూస్తూ నవ్వుతూ నమస్కరించింది మొహిణా.

"ఈ యుద్ధంలో నేను బ్రతికిబయట పడితే నా భార్యాపిల్లలతో మరొక్కసారి నీ జొన్నరొట్టెలు తినడానికి తప్పక వస్తాను మొహిణా" అని ప్రతి నమస్కారంగా సెల్యూటుచేసి జీపుని పరుగెత్తించేను దూళి రేపుకుంటూ.





# చక్రపాణి

కావిలిపాటి విజయలక్ష్మి

(గత సంచిక తరువాయి)

అదేదో చిన్న విషయం విన్నట్లు తేలిగ్గా నవ్వేస్తూ, "మిగతా ఏభై చిల్లర కూడా తీసుకోండి" అన్నాడు పాణి.

"నేను మీలాటివాళ్ళని మోసగించను పాణిగారూ? మోసగాళ్ళనే మోసగించి తరిమెయ్యాలి ఎందుకూ శశీ, మీ బావ గారూ రానివ్వండి, మీ జీవితమే మారి పోతుంది."

"అయితే ఒక గొప్ప పాత్ర స్వీక రించారన్నమాట."

"నేను అనుకునేదంతాచెయ్యగలిగితే, మీ దగ్గరఉన్న ఉద్యోగుల్లో గొప్పపాత్రే నాది."

"పద్మావతీ, నేను కొన్ని కానుకలుమీ కివ్వాలనుకుంటున్నాను. స్వీకరిస్తారా? తిరస్కరిస్తారా?"

"ఏమిటండోయ్, ఆ కానుకలు స్వీక రించదగినవో. కాదో ! తెలుసుకోందే ఏం చెప్పను ?"

మౌనంగా ఆలోచిస్తూ ఉండిపోయాడు పాణి.

"ఏం మౌనంగాఉండిపోయారు? మళ్ళీ ఆ కానుకలేవో ఎందుకివ్వడంలే? అను కుంటున్నారా ?" అడిగింది పద్మావతి కొంటెగా !

"హాస్యం కాదు. నిజంగా ఇవ్వాలను కుంటున్నాను పద్మావతీ !"

"అదే ! చెబితేకదా ! నా సమ్మతి తెలియజెయ్యడం ?"

"మీకు చెవులకు కమ్మలూ, బంగారు గాజులూ, మెడలోకి చెయినూ ఇవి కొను క్కోవడానికి మీకు డబ్బు ఇవ్వాలను కుంటున్నాను. మరేమీ అపార్థంచేసుకో కూడదు నన్ను-మా శశినిలానేమిమ్మల్నీ అభిమానిస్తున్నాను."

"నేను తినే అన్నం, కట్టే బట్టలూ, అన్నీ మీ డబ్బుతోనే కదా ! మీరు ఎప్పు డైనా బొమ్మకథ విన్నారా ? బొమ్మ చేసినవాడు తండ్రీ, బట్టలిచ్చినవాడు తోబుట్టువూ అన్నారు. నగలు చేయించా ల్సిన వ్యక్తి, స్త్రీకి ఒకే ఒక్కరు. లేదా, తన స్వశక్తిమీద డబ్బు సంపాదించు కొని కొనుక్కోవాలి, అంతే. క్షమిం చండి పాణిగారూ ! మీరు డబ్బుఇస్తే నేను నగలు చేయించుకోలేను. ఇదిగో పర్సు. జేబులో పెట్టుకోండి."

అతను ఆమె చేతిలో పర్సు తీసుకొని జేబులో పెట్టుకుంటూ, నాకు "ఏ బొమ్మ కథలూ తెలియవు పద్మావతీ ! అత్తయ్య చెప్పింది మీకు కనీసం చెవులకు కమ్మ లన్నా లేవని. పోనీ నా దగ్గర డబ్బు అప్పుగా తీసుకోరాదూ ! మీ జీవితంలోకి వచ్చే ఎవరో ఆ ఒకేఒక వ్యక్తే నా అప్పు తీరుస్తారు."

"ఇప్పుడునాకుఅలంకరణమీదమోజు లేదు. మరాసంగతి వదిలేసి మరేమన్నా మాట్లాడండి."

"సరే నన్ను అపార్థం చేసుకోకండి. స్త్రీకి తండ్రీ, అన్నా కూడా అలంకరణ వస్తువులు కొంటారు. సంతోషంగా స్వీక రిస్తారుకూడా!"

"మరి వెళ్దామా ! సంధ్య చీకట్లు అలు ముకుపోయాయి " అంటూ లేచినిల్చుంది పద్మావతి.

"రాజూ! డ్రయివరునిగట్టిగాపిల్చాడు పాణి. లేచినిల్చుని బట్టలుదులుపుకుంటూ.

వాళ్ళు ఊర్లోకి వచ్చేసరికి రేడియోలో తెలుగు వార్తలు అయిపోయాయి. ముందుగా కారు రంగారావింటికే పోనియ్యమన్నాడు పాణి కాని మిమ్మల్ని ఇంట్లోవదిలి నేను ఇంటికి వెళ్తానని పద్మా వతి అనడంతోముందు చక్రపాణి ఇంటికే తీసుకుపోయేడు కారు డ్రయివరు.

పాణిని ఇంట్లోకి నడిపించి, 'పిన్ని గారూ ! ఇదిగో మీ మేనల్లుడు. భద్రంగా

తీసుకువచ్చాను' అంది పద్మావతి అన్న పూర్ణమ్మను పిలిచి నవ్వుతూ.

"నువ్వు వాడిదగ్గర ఉంటే నాకు కొండంతధైర్యం తల్లీ. నిజంగా నీ రుణం ఎలా తీర్చుకుంటామోకాని వాణ్ణి మనిషిని చేశావ్. ఉంటున్నావా? వెళ్ళిపోతున్నావా? భోజనంచేసివెళ్ళరాదూ!" అంది అన్నపూర్ణమ్మ హడావుడిగా అక్కడికి వస్తూ.

"వద్దు, ఇప్పుడునాకు ఆకలిగాలేదు" అంటూనే అవతలి కెళ్లిపోయింది. కారు తీసుకుని వెళ్ళమన్నా ఆమె వినిపించుకోలేదు. కాలినడకనే వెళ్ళిపోయింది.

* * *

సాయంత్రం నాలుగున్నర అయ్యేసరికి కారు వీధిగుమ్మంలో ఆగింది. ఈయనకి మతిపోయిందిలా ఉంది. నలుగురూ నవ్వరూ! నడవలేనా ఏం! నలుగురూ ఏమనుకుంటారు? గొణుక్కుంది పద్మావతి.

అయ్యగారు రమ్మన్నారండి, అంటూ డ్రయివరు లోపలికి వచ్చాడు. పదినిమిషాల్లో తయారయివచ్చి, కారు బేక్‌సీట్లో కూర్చుంది పద్మావతి.

''నడిచి రాలేనా ఏం? కారెందుకు పంపారు?" వస్తూనేపాణిని ప్రశ్నించింది పద్మావతి.

"కారుకొని ఇన్ని నెలలు గడిచినా నాకీ ఆలోచన తట్టనందుకు విచారిస్తున్నాను పద్మావతీ! మీరు నడిచి వస్తూంటే కారెందుకు? షెడ్‌లో పెట్టి లాక్‌చెయ్యడానికా" నవ్వాడు పాణి.

"ఎవరన్నా చూస్తే ఏమనుకుంటారు? మీరు నా కింత ప్రత్యేకతఇవ్వడం నాకే ఇబ్బందిగా ఉంది."

"ఎవరో ఏమో అనుకుంటారు, అనే సందేహంలో మనిషి ఒక్క అడుగు కూడా ముందుకు వెయ్యలేడు పద్మావతీ! మనం చేసేపని మనకి న్యాయం ధర్మం అనిపించినపుడు, ఎవరో ఏమో అనుకుంటారని పిరికితనం ఉండకూడదు పద్మావతీ! ఈ మాట ఇదివరకెప్పుడో మీ నోటిమీదుగానే విన్నట్టు గుర్తు. ఇంకా ఎండగా ఉన్నట్టుంది. ఇంకాస్సేపు పోయాక ఇవ్వాళ అలా తోటలవైపు వెళ్దాం" అన్నాడు గబగబా పాణి. పద్మావతి రాగానే అతనిలో కొత్తగా ఉత్సాహం ఉరకలువేస్తూం దీమధ్య, అస్సలామెను అతను క్షణం కూడా మరవటంలేదు.

ఆమెకూడా అతనిగురించే ఆలోచిస్తూంది ప్రతిక్షణం. అతన్ని చూస్తూంటే ఆమెకు జాలి, సానుభూతి. అతనికి తాను ఎటువంటి సహకారం చెయ్యగలదు? అతన్ని మోసగాళ్ళ వలలోంచి ఎలా తప్పించాలి? అని ఆలోచిస్తూంది.

"మాట్లాడరేం,పద్మావతీ!తోటలవైపు తీసుకువెళ్ళరూ?'' మళ్ళీఅడిగాడు పాణి

"అలాగే వెళ్దాం ఎండతగ్గాక, అని మీరే అన్నారుగా!"

' ప్చ్, ఫర్వాలేదు. కార్లో ఎండవుండదు. చెట్లనీడన ఎండవుండదు, అంటూ లేచి నిల్చుని డ్రయివరుని పిలిచి టిఫినుబాక్సూ ఫ్లాస్కూ కారులో పెట్టమన్నాడు పాణి.

*    *    *

పాణి కారు కొన్నదగ్గరనుంచీ వర్కర్సూ, రంగారావూ, మేనేజరూ అందరూ గుసగుస లాడుకుంటున్నారు. ఓ వారంరోజులై మరీఒకేరీతిగా ఆలోచిస్తున్నారు, రంగారావూ, మేనేజరూ, మరికొంతమంది సహచరులూను. అందరిదీ ఒకటే విచారం. తమకు వచ్చే ఆదాయం క్రమంగా తగ్గిపోతూందని. దీనికంతకూ కారణం పద్మావతి. ఆమెను ఎలా అన్నా ఆ ఉద్యోగంనుంచి తప్పించెయ్యాలి, అని ఏకగ్రీవంగా తీర్మానించుకున్నారు చివరికి. తానొకటితలిస్తే దైవమొకటి తలచిందని వాపోయాడు భార్యదగ్గర రంగారావు. తన ప్లాను పాడయిపోయిందన్నాడు. తను తప్పు అంచనా వేశాననుకొని తనను తానే తిట్టుకున్నాడు. తర్వాత 'సుశీలా ఈపద్మావతి నాకు హృదయశల్యమైపోయింది. దీనిని వీలైనంత దూరంగా పంపించెయ్యాలి, లేదా ఏమన్నా చెయ్యాలి' అన్నాడు రంగారావు.

ఆ మాట విని అదిరిపడ్డ సుశీలమ్మ ఆయన్ని తీవ్రంగా మందలించింది. పిల్లలు గలవాళ్ళం అలాటి ఆలోచనలు చెయ్యకూడదు అంటూ.

నిజంగా రంగారావుకి పద్మావతి హృదయశల్యంలానే అనిపిస్తూంది. ఈపాటికి ఆమెను అంతంచేయించేవాడే కాని పాపభీతి కొంచెం వెనక్కుపట్టిలాగుతూంది. నిస్సహాయురాలైన అబల తనను నమ్మి తనను తండ్రిగా భావించే ఆడపిల్ల, తన ఇంట్లో తలదాచుకొని, తను చెప్పిన ప్రతిమాటా శిరసావహిస్తూన్న అమాయకురాలు. పద్మావతిదేంకాదు, ఇదంతా ఆ గుడ్డివాడే, పాణే అని ఆలోచించేవాడు ఒక్కోసారి రంగారావు. ఎలా అయినా అతను మన స్థిమితం కోల్పోయాడనేచెప్పాలి. కారణం తామంతా పాణిని వంచించి నెల నెలా మిగిల్చి పంచుకునే డబ్బు చాలా తగ్గిపోయింది. గూఢచారు లెవరున్నారో కాని ఏరోజు విషయం ఆ రోజు సేకరిస్తున్నాడు పాణి. ఇంక రెండుమూడు నెలలలో శశీ, ఆమె భర్తా వస్తున్నారు. అదొకటి అప్రియమైన వార్త. ఈ లోపల పాణిని అంతంచేయిస్తే ! అంతంచేయిస్తే. అతని తదనంతరం ఆస్తి ఎవరికో వ్రాసి ఉంటుంది. వ్యాసమూర్తి తనకెలాటి స్నేహితుడు ? వ్యాసమూర్తికి తానేమని మాట ఇచ్చాడు? పాణి ఆస్తివ్యవహారాల్లో నష్టపోకుండా చూసి అతన్నో ఇంటివాణ్ణి చేస్తానని. కాని వ్యాసమూర్తి తననెప్పుడన్నా ఆదుకొన్నాడా ? చదువుకునే రోజుల్లో తనకి ఫీజుడబ్బులు లేకపోయినప్పుడు, తాను ఎన్నిసార్లు అతన్ని

డబ్బుకోసం యాచించాడు? ఎవరెవరో స్నేహితులకి డబ్బులిచ్చే వ్యాసమూర్తి. తనకెప్పుడైనా కానీ విదలించేడా ? పైగా నేను నక్కలాటివాణ్ణని తిట్టేవాడు. ఓసారి... ఓసారి, తనకిప్పటికీ గుర్తు. బట్టలన్నీ చిరిగిపోయాయి. ఒరేయ్ వాసూ, నీవేవన్నా పాతబట్టలుంటే ఇవ్వరా, అని అడిగాడు. బాగా చిరిగి పోయినవి. తొడుక్కోవడానికి పనికి రానివి ఇచ్చాడు. ఇవెలా తొడుక్కో నురా? అని తాను అమాయకంగా అడి గితే, నీ ముఖానికి అవి చాల్లేరా బాయ్. గుడ్డలు విప్పుకు తిరిగేకన్నా నయంకదూ! అన్నాడు హేళనగా. అప్పుడు కాలేజీలో హీరోగా చెలామణీ అయ్యేవాడు వాస్య మూర్తి.ధనికుడూ,అందగాడూ, అయినా వ్యాసమూర్తంటే అమ్మాయిల దగ్గర నుంచీ అందరికీ మోజే. అతనికి పూర్తిగా అపోజిట్ తను. తనంటే అందరికీ చిన్న చూపు. అందుకే వ్యాసమూర్తంటే తనకు కసిగా ఉండేది.

తాను తాలుకాఫీసులో గుమస్తాగా పని చేస్తూన్నప్పుడు, తాను ఫైళ్ళు పట్టుకొని నడిచిపోతూంటే ఒరే రంగా గుమస్తా ఉద్యోగం సంపాదించావే అని నవ్వుతూ పలకరించాడు వ్యాసమూర్తి. అప్పుడు తన భార్య ప్రసవించి బిడ్డపోయి చావు బ్రతుకులమధ్య ఊగిసలాడుతూంది. ఆమెను విశాఖపట్నం తీసుకువెళ్ళమని సలహా ఇచ్చారు డాక్టర్లు. విశాఖపట్నం తీసుకువెళ్ళి ఆమె ఆరోగ్యం బాగు చేయించాలంటే కనీసం వెయ్యిరూపాయ లన్నా ఉండాలి. ఎలా? ఎక్కడ తేవడం అని ఆలోచనలో ఉన్నప్పుడు కను పించాడు వ్యాసమూర్తి. దేవుడే ఇతన్ని పంపించి ఉంటాడు తనను ఆదుకోవ డానికి అనుకున్నాడతను. విషయం వివ రించి ఇటువంటి ఆపదలో చిక్కుకు పోయాను వాసూ! వెయ్యిరూపాయలు అప్పుగా ఇయ్యి. నీ ఋణం నా చర్మం చెప్పులుకుట్టి అమ్మైనా తీర్చుకుంటాను అని దీనంగా అడిగాడు కళ్ళనీరు చిమ్ము తూంటే. తన కష్టాన్నీ కన్నీళ్ళనీ అతి తేలిగ్గా తీసుకుని. నవ్వేస్తూ, నాదగ్గ రెక్కడిదిరా అంతడబ్బు! అని నిర్ల క్ష్యంగా ఒక సానుభూతి వాక్యమైనా పలకకుండా వెళ్ళిపోయాడు. ఇవన్నీ తాను మరచిపోగలడా? తర్వాత తాను తాశీల్దారై అతని ఊరు వచ్చాక, తన హోదా పలుకుబడీ ఆధారంగా స్నేహి తుడైపోయాడు అతనూ జీవితంలోఏవో కష్టాలూ, నష్టాలూ చవిచూచినందువలన తనకు దగ్గరై తనతో స్నేహంపెంచు కున్నాడు. పాతసంగతులు అతను విస్మ రించాడు. మరచిపోయాడు. కాని తాను మరచిపోలేదు. అవి హృదయంలో ములుకుల్లా నాటిఉండనే ఉన్నాయి. అయితే ఒకటిమాత్రం నిజం. వ్యాస మూర్తి పోయినతర్వాతే తను నాలుగు డబ్బులు సంపాయించి వెనకేశాడు. తన

తాశీల్దారీ ఉద్యోగంలో సంపాదించినది, పిల్లల చదువులూ, పెళ్ళిళ్ళూ, పురుళ్ళూ, రోగాలకూ,అయిపోయింది.సాధారణంగా ఎప్పుడూ డబ్బుకి కటకటలాడటమే. వ్యాసమూర్తి పోతూ, తన వ్యాపారాన్నీ, వ్యవహారాన్నీ, పాణినీ వప్పగించాక మేనేజరుతో చెయ్యికలిపి తెలివితేటలు ఉపయోగించి నాలుగు డబ్బులు వెనకేసు కున్నాడు తాను. పాణిని అన్యాయమేమీ చెయ్యడంలేదు. పెద్ద లాభాలు పొందక పోయినా అతనేమీ నష్టపోవడంలేదు. ఇలా తనను తాను సమర్థించుకునేవాడు ఒక్కోసారిఎలాఅయినాపద్మావతివచ్చిన ఈ రెండు సంవత్సరాల్లో కొన్ని మార్పులు వచ్చాయనక తప్పదు. ఆమె తమతో కూడా చెయ్యికలిపి కొంచెం డబ్బు సేకరిస్తూన్నా, పాణిగారికి ఏమాత్రం లాభం చూపిస్తున్నాం, పాపం అతను మాత్రం టాక్సులు కట్టాలి. ఇంటి ఖర్చులు గడుపుకోవాలి, అని నిలదీసి ప్రశ్నిస్తూంది.అదిన్యాయమనిప్రత్యక్షంగా ప్రతివాడూఒప్పుకోకతప్పడంలేదు.వాచ్ మెన్ పోలయ్యనీ, తనదగ్గర పద్మావతి పనిచేసేసింహాచలాన్నీ డబ్బులంచంపెట్టి మంచిచేసుకొని తాను ఎవరెవరితో ఎంత సేపు ఎక్కడెక్కడ మంతనాలు జరుపుతున్నాడో. ఎవరెవరు ఏమిటి చేస్తు న్నారో, విషయసేకరణ చేస్తూందని తెలియదు రంగారావుకి. చనువుగా అభి మానంగా తనభార్య వెనకాల ఇంటి పనులు చేస్తూ, తన పక్కన భోజ నానికి కూర్చుని, బాబయ్యగారూ అంటూ అమాయకంగా మాట్లాడే పద్మావతినే తెలుసు కాని, సి.ఐ.డి. లా తననూ తన అనుచరులనూ, కనిపెట్టే పద్మావతిని మాత్రం తెలియదు. ఒక్కోసారి ఆమెను అనుమానించినా కనీసం చెవులకు కమ్మ లన్నా కొనుక్కోకుండా, నిస్వార్థంగా డబ్బులు తనింట్లో సరుకులకే ఖర్చుచే స్తూన్న పద్మావతిని చూస్తూంటే అనవస రంగా అనుమానించానే అని పశ్చాత్తాపం కలిగేది అతనికి. అతన్ని కనిపెట్టిన పద్మావతి ఒక్కోసారి ఇంట్లోకి కావా ల్సిన సరుకులన్నీ కొని రంగారావు చూస్తూండగా తెచ్చేది. అతను డబ్బు ఇవ్వబోయేవాడు. ఆమె తీసుకునేదికాదు. ఎన్ని ఆలోచనలుచేసినా, పద్మావతిమీద ఎంత మంచి అభిప్రాయమున్నా ఆమెను పాణిదగ్గరనుంచి తప్పించెయ్యడమే అందరికీ శ్రేయస్కరమని తోచింది. అదే నిర్ణయానికి వచ్చాడు రంగారావు కూడా.

* * *

ఆకాశంలో అక్కడక్కడ నల్లని మబ్బులు చేరాయి. చల్లని గాలి వీచ సాగింది. మొదట ఆ గాలి శరీరానికి తగిలి హాయనిపించినా క్రమంగా "చలి వెయ్యసాగింది. పాణికి దగ్గరలో మామిడి చెట్టుక్రింద కూర్చున్న పద్మావతి, చలి గాలి వీస్తూంది. ఇవాళ వర్షం వచ్చేట్టుంది.

కొన్ని గంటల్కితం ఇదేశరీరం తాపంతో చల్లగాలికోసం వేగిపోయింది. ఇప్పుడు కొన్ని క్షణాల్లో పూర్తిగా చల్లబడిపోయి రగ్గు కప్పుకోవాలనిపిస్తూంది. వెళ్ళి పోదామా?" అడిగింది పాణిని.

''అప్పుడే! మనం వచ్చి ఎంతసేప యింది కనుక? వర్షం వస్తే తోటమాలి పాక ఉందికదా! కాస్సేపు తలదాచు కుందాం. వర్షాకాలం వచ్చేస్తూందిలా ఉంది. ఇహ మన షికార్లకి స్వస్తిచెప్పాలి కాబోలు."

"షికారుమాటదేవుడెరుగుకాని,పదండి బాబూ పోదాం. మీ అత్తయ్య నిన్ననే అన్నారు. మీఆరోగ్యం అంతగా బాగుండ లేదని." ఆకాశంలో గుమిగూడుతూన్న నల్లని మబ్బులూ,చల్లనిగాలీ చూసి కంగా రుగా లేచి నిల్చుంది పద్మావతి.

"వర్వాలేదు, మీరు మాఇంటికి రాక పోతే, మీరు నాతో మాట్లాడకపోతే నా ఆరోగ్యం పాడయిపోతుందేమోకాని. చలిగాలి, వర్షం ఇవి నా ఆరోగ్యాన్ని పాడుచెయ్యలేవు, కంగారుపడక కూర్చుని వాతావరణం ఎలాఉందో చెప్పండి.''

ఒక్కొక్కసారి ఇతను ఏమిటిలా మాట్లా డుతూ ఉంటాడు! తనను ప్రేమించి కోరుకోవడం లేదుకదా! అనిపించే సరికి పెనుగాలికి లతలా వణికిపోయింది ఆమె హృదయం. కేవలం ఉద్యోగినిలా కాకుండా అతని ఆంతరంగిక విష యాల్లో జోక్యంపెట్టుకోవడం, చనువుగా మాట్లాడటం తనదే పొరపాటేమో!

"మాట్లాడరేంపద్మావతీ! వాతావరణం ఎలాఉంది? పాణి ప్రశ్న ఆమె ఆలో చనల్ని మౌనాన్నీ చెదరగొట్టింది.

వాతావరణమా! చూడండి. క్షణాల్లో మీ షికారు సరదాతీర్చేస్తానంటోంది.'' అంది పెదవులు బిగపెట్టి అతని ముఖం వైపు పరిశీలనగా చూస్తూ.

గలగలా హాయిగా నవ్వాడు పాణి.

ఏమిటీ మొండిమనిషి? చలిగాలి విసిరికొడుతూంటే లేవడు సరికదా, నవ్వుతున్నాడు. అనుకొని కనుబొమలు చిట్లించి అతనివైపు ఒక్కసారి చూసి డ్రయివరు కూర్చున్నవైపు నడిచింది పద్మావతి.

ఆమె ఎటో వెళ్తూన్నట్లు ఆకులు కది లిన శబ్దాన్నిబట్టి గ్రహించిన పాణి, "తొందరగారండిపద్మావతీ!" అన్నాడు.

వెనుదిరిగి అతనివైపు ఒక్కసారి చూసి మళ్ళీ ముందుకి నడిచింది పద్మా వతి.

నాలుగుక్షణాల తర్వాత, ''ఇదిగో మఫ్లరు, తలకుచుట్టుకోండి,"అన్న పద్మా వతి గొంతు విని, మఫ్లరు ఇంటిదగ్గర నుంచి నేను తేలేదే!" అన్నాడు పాణి.

"అవును. కాని ప్రస్తుతం ఇదితలకు చుట్టుకోక తప్పదు. ప్లీజ్ పాణిగారూ! మీ ఆరోగ్యం అంతగా బాగుండటంలేదీ

మధ్య. దగ్గుతున్నారు. జలుబుకూడా ఉంది."

"ఎవరిదీ మఫ్లరు?" అతని గొంతు విసుగ్గా రవ్వంత కోపంగా ధ్వనించింది.

"డ్రయివరుది. అతనూ మనిషే. మన కులంవాడే. పైగా చాలా నీట్‌గా ఉంటాడు."

"ఓ...థాంక్స్. వద్దు. తీసుకువెళ్ళి అతని కిచ్చెయ్యండి."

"ధనికులకుండే అహంభావమే అది లెండి.సరె నేను ఇంటికి వెళ్ళిపోతున్నాను. మీరు వస్తున్నారా ?"

"నేను రానిప్పుడే మీరు వెళ్తే కారు మాత్రం వెంటనే పంపిం చెయ్యండి "

గబగబా పద్మావతి వెళ్ళిపోయినట్లు అడుగుల సవ్వడి. విన్న పాణి పెదవుల చాటున ముసిపెంగా నవ్వుకున్నాడు. కావాలని ఆమెను కవ్వించి, ఆమెతో వాదించి ఆమెకు కోపం తెప్పించి కోపంలో ఆమె అనే మాటలు విని అదొకరకమైన ఆనందాన్నీ, అనుభూతినీ అనుభవిస్తున్నాడీ మధ్య పాణి. ఆమె కొండలవైపు షికారు వెళ్దాం అండే తను తోటలవైపనీ ఆమె ఇంటికి వెళ్ళిపోవాలని చెప్పినప్పుడు నే నివ్వాళ సినిమాకు వెళ్దాం అనుకుంటు న్నాను, మీరు వెళ్ళడానికి వీల్లేదనీ, ఒక్కోరోజు ఉదయం మధ్యాహ్నం రాత్రీ ఏ వేళలోనన్నాసరే, రంగారావు గారింటికి ఫోనుచేసి పద్మావతిని రమ్మని పిలిచి, తీరా వచ్చాక మీతో మాట్లాడా లనే పిల్చాను.కాస్సేపుకూర్చుని ఏవన్నా కబుర్లుచెప్పండి, అనే పాణి, పాణి మన స్తత్వం అర్థంకాని పద్మావతికి, ఒక్కో సారి ఈ ఉద్యోగం మానేసి ఎటన్నా వెళ్ళిపోదామా! అనిపించేది. కానీ తానీ ఆశ్రయం వదులుకుంటే ఎలా బ్రతక గలదు.

అలా అలా తోటంతా తిరిగిన పద్మా వతి, తోటలో కాటిమట్టలూ కంపలూ ఏరుతూన్న, ఆ తోటయజమాని పాలే రుతో కాస్సేపు మాట్లాడి. రెండు జామ కాయలు కోసుకోనా ! అని అడిగింది. అతను కోసుకోండని చెప్పి తనదారిన తను పోయాడు.

మబ్బులు చెదిరి గాలికూడా తగ్గి పోయింది. మళ్ళీ సాయం సూర్యుని కిరణాలు అంతటా పరుచుకున్నాయి. క్షణంలో మారిపోయిన వాతావరణానికి నవ్వుకుంది పద్మావతి. చెట్టుకింద యోగిలా కూర్చున్న పాణివైపు అప్పు డప్పుడు చూస్తూంది.

చీర కుచ్చెళ్ళు మీదికి కట్టి పలవలుగా ఉన్న జామిచెట్టెక్కి పరువుకాయలు మూడు కోసుకుని మళ్ళీ పాణి కూర్చున్న దగ్గరకు నెమ్మదిగా వచ్చింది పద్మావతి.

కాళ్ళుజాపి ఎడమకాలిమీద కుడికాలు వేసుకుని చేతులు వెనక్కి ఆన్చి కూర్చున్న పాణికి దగ్గరలో గొంతుగా కూర్చుని మోకాళ్ళకు ఎడమచెయ్యి

చట్టి కుడిచేత్తో జామికాయ కొరుక్కు తింటూ కూర్చుంది మౌనంగా.

అతను గ్రహించాడు ఆమె వచ్చి తన ఎదుట కూర్చుని ఏదో తింటూం దని... "పద్మావతీ!" పిల్చాడు. ఆ గొంతులో అంతులేని ఆప్యాయత.

ఆమెలో కొంచెతనం. పలకలేదు. మరికాస్త గట్టిగా జామికాయ కొరికి నమలసాగింది.

"పద్మావతీ! పద్మావతీ! పద్మావతీ!" ఉండుండి రెండేసినిముషాల కొక్కోసారి పిల్చాడు పాణి, మూడుసార్లు.

"నేనుకాదు." చప్పున జవాబిచ్చింది పద్మావతి.

ఫకాల్న నవ్వి, "మరెవరు ?" అన్నాడు కొంటెగా పాణి.

"మీ పద్మావతినేం కాదు" అందామె. అతని ఆ నవ్వూ, ఆ ప్రశ్నలోని కొంటె తనం కవ్వించాయామెను.

"నా పద్మావతా ?" అని హాయిగా పరవశంగా కదిలి నవ్వుకున్నాడు పాణి. తొందరలో దొర్లిన తన జవాబులకు నవ్వుకుని బిడియపడింది తర్వాత పద్మావతి.




అమృతాంజన్ లిమిటెడ్‌వారి గ్రైప్ మిక్స్చర్ జీర్ణ శక్తిని సరిచేస్తుంది. దానికి తోడ్పడుతుంది. బిడ్డని ఆరోగ్యంగా సంతోషంగా ఉంచుతుంది. అమృతాంజన్ లిమిటెడ్ వారి గ్రైప్ మిక్స్చర్ నులినొప్పి, వాయువు, అజీర్ణం, పళ్లు వచ్చే కాలంలో ఇబ్బందులు వాటికి మంచి గుణం ఇస్తుంది.




అమృతాంజన్ లిమిటెడ్

బిడ్డ సంతోషంగా ఉంటే
# అమృతాంజన్ గ్రైప్ మిక్స్చర్
వాడినట్లే

OBM:2642 TG

''ఏమిటి తింటున్నారు? నాకివ్వరా?" అడిగాడు పాణి.

''పద్మావతి వెళ్ళిపోయిందిగా!"

''నన్ను ఒంటరిగా వదిలి పద్మావతి వెళ్ళిపోలేదు. ఆ సంగతి నాకు తెలుసు. కళ్ళు లేవుగాని నేను అఖండమైన తెలివి తేటలు గలవాణ్ణని నన్ను ఎరుగున్న వారంతా ఒప్పుకుంటారు పద్మావతీ! ఏమిటి తింటున్నారు?"

"జామకాయ.ఒక్కటే మీకు లేలేదు.''

"ఎలా కోశారు?"

"తాటిచెట్టు ఎక్కగాలేంది. జామి చెట్టు ఎక్కలేనూ! నేనే చెట్టెక్కి రెండు కాయలు కోశాను. డ్రయివరుకొకటి ఉంచాను. దోరకాయ, ఐతే బాగుంది తియ్యగా."

"మరి నాకో..."

"మీకు లేదని చెప్పానుగా!"

"పెద్ద కాయలా! ఏ మాత్రం సైజు! పోనీ మీరు తినే కాయ ఇలా ఇవ్వండి. మళ్ళీ ఇచ్చేస్తాను.'' చెయ్యి ముందుకి చాపాడు.

సగం తిన్న కాయ అతని చేతిలో ఉంచింది పద్మావతి.

అతను చప్పున ఆ కాయ పళ్ళ మధ్యన పెట్టుకొని కొరికి తినసాగాడు.

"ఏమండీ! తినొద్దు." కంగారుగా అంది పద్మావతి.

''మీరు తిన్నారుగా! నేనెందుకు తినగూడదు?'' కావాలని గబగబా కాయంతా తినేశాడు పాణి.

అతనలా తినేస్తూంటే "ఛి, ఛి. ఎంగిలికాయది. పారెయ్యండి. మరొక కాయ ఉంది. మీకోసం తెచ్చాను,"అంది పద్మావతి.

అతనామాట వినిపించనట్టు పూర్తిగా తినేసి "చాలా బాగుంది సుమండీ! జామకాయ. తియ్యగా మధురంగా ఉంది. కొని ఇలా తోటకివచ్చి. కోతిలా చెట్లకెగబడితే మనకి స్వస్తి చెబుతారు తోటయజమానులు. కావాలంటే ఆ కాయలూపళ్ళూకొని తెచ్చుకుందాం," అన్నాడు పాణి.

అతని ఆ చేష్ట ఇష్టంకాలేదామెకు. అతను కావాలని ఆమె సగంతిన్న జామి కాయ తిన్నాడని ఆమెకు తెలియదు. క్షణంతర్వాత ఏదో గుర్తువచ్చినట్టు, "పాణిగారూ ఈ తోట అమ్మేస్తారట'' అంది.

''ఏం మనం కొనేద్దామంటారా?" నవ్వుతూ అడిగాడతను.

"కొంటే అప్పుడు మనని చెట్టు కాయలు కొయ్యొద్దని ఎవరూ అన లేరుగా!"

''రంగారావుగారిని సంప్రదిద్దామా?''

"అన్నిటికీ ఆయనొకరు. బ్యాంక్ ఎకౌంటు పాతికవేలుందిగా. తోట పది వేలు చెబుతున్నారట."

నవ్వి, "ఓ! వివరాలు ఎప్పుడు సేకరించారు పద్మావతీదేవిగారూ!" అన్నాడు పాణి.

"నిజం. ఇప్పుడే పాలేరు చెప్పాడు."

"తోటయజమాని అడ్రసు ?"

"కనుక్కున్నాను."

మళ్ళీ నవ్వాడు పాణి.

"ఎందుకు నవ్వుతున్నారు?" అడిగింది పద్మావతి.

"మీరూ మీ మనస్సు అర్థంకాక. ఒకసారి పదహారు సంవత్సరాల అమ్మాయిలా చిలిపిగా పెంకెగా ప్రవర్తించి మాట్లాడతారు. ఇంకొంచెంసేపట్లో పెద్ద వ్యవహారకర్తలై పోతారు. మరోసారి డెబ్బయ్యేళ్ళ ముసలమ్మలా మాట్లాడతారు. ఈపద్మావతిని నమ్మాలా! వద్దా! అని నవ్వొచ్చి..."

"వద్దు. నమ్మకండి. మోసపోతారు. ఆఖట్టతల రంగారావునీ కళ్ళద్దాల మేనేజరునీ నమ్మండి," అంది పద్మావతి.

మళ్ళీ నవ్వి, "నమ్మక నేను ఏం చెయ్యగలను పద్మావతీ !" అన్నాడు పాణి.

"ప్చ్. పాపం. నిజమే, ఏం చెయ్య


## ది ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

### కల్పతరువు డిపాజిటు

మీరు పొదుపుచేసిన మొత్తాన్ని 20 రెట్లు పెంచుకోవడానికి
ఒక అపూర్వమైన పథకము

* కుమార్తెల వివాహం
* గృహనిర్మాణం
* పిల్లల ఉన్నత విద్యాభ్యాసం
* ఇతర శుభకార్యాలు

ఈలాంటి నిర్దుష్ట అవసరాలకై పొదుపుచేయడానికి ఒక ఆదర్శ పథకము.
మా స్కీములో చేరండి. కాలక్రమముతో డబ్బు ఎలా పెరుగుతుందో చూడండి.

| పెట్టుబడి మొత్తం | తిరిగి పొందే మొత్తం | కాలపరిమితి నెలల్లో |
|---|---|---|
| 4,999 39 | 1,00,000 | 361 |
| 8,294.07 | 1,00,000 | 300 |
| 13,646.27 | 1,00,000 | 240 |
| 36,941 00 | 1,00,000 | 120 |

*రండి. ఆలోచించండి.*

# ది ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

కేంద్ర కార్యాలయము—హైదరాబాద్.

కె. కె. నారాయణ్
చైర్మన్.

గలరు లెండి. శశీ, ఆమె భర్తా తొందరగా వచ్చేస్తే..."

"వస్తున్నానని ఉత్తరాలే కాని అది రావడం కనుపించదు."

"పొద్దుపోయింది. మరి వెళ్దామా? ఇదిగో జామకాయ తింటారా?" అడిగింది పద్మావతి.

అతను పసివాడిలా చెయ్యిచాపాడు.

అతనిచేతిలో ఆ కాయఉంచి, "పాణి గారూ ఈ తోట కొనేద్దాం. కొనేసి తోట మధ్యన నలుచదరంగా కాళీస్థలముంది. అక్కడ చిన్న ఇల్లు కట్టించి, దాని చుట్టూ పూలమొక్కలు నాటిస్తే చాలా బాగుంటుంది. ఏమంటారు?"

అతనులేచి నిల్చుని. ''ఆలాగేచేద్దాం. మీ ఇష్టం. అత్తయ్యకు కూడా చెప్పండి. మరి వెళ్దామా?'' అన్నాడు.

అతనలా అనగానే, అతని చెయ్యందుకుని ముందుకినడుస్తూ "చెబుతాను. ఆమె నా మాట కాదనరు." అంది పద్మావతి.

''పాపం. ఆ జామచెట్టుకి ఇంక పళ్లు పండే అదృష్టముండదు.

"ఏం? ఎందుకని?" నవ్వుతూ ప్రశ్నించింది పద్మావతి.

"పిందెలుకొరికి ఉమ్మేస్తూంటారు మీరు."

"తో ట య జ మా ను లు ఊరుకుంటారా?''

"సగంతిని ఆ కాయ అతని మొహాన్న పడేస్తే ఊరుకోక ఏంచేస్తాడూ?''

''క్షమించండి పాణిగారూ! మీరు తింటారనుకుంటే ఆ కాయ ఇచ్చేదానను కాను. అయినా అది ఎంగిలికాయని చెప్పానుగా?"

"నేను ఒకముక్క కొరికి తిన్న తరువాత... పోన్లెండి. ఇంతలో మునిగిపోయిందేముంది?"

కారుదగ్గరకు వచ్చేయడంతో ఇద్దరూ మౌనంగా ఉండిపోయారు.

అప్పటికే వీరి గురించి గుసగుసలు బయలుదేరాయి ఊళ్ళో, పాణికీ పద్మావతికీ ఏదో అక్రమసంబంధ ముందని.

వీరికారు ఊర్లోంచి వెళుతూంటే కుఱ్ఱకారు, 'ధృతరాష్ట్రులుంగారు, గాంధారీదేవితో షికారు బయలుదేరారు,' అని నవ్వుతూ ఉషలువెయ్యడం విన్నారు పాణీ పద్మావతీ చాలాసార్లు. ఓ సారి పాణి అడిగాడు నొచ్చుకుంటూ పద్మావతిని, 'వారి మాటలు మిమ్మల్ని నొప్పిస్తున్నాయా పద్మావతీ! అలా అయితే షికారు వెళ్ళడం మానేద్దాం' అని.

"ప్చ్. నా కేంబాధ లేదు. కొత్తమనిషిని చూసి కుక్కలు మొరుగుతాయ్. తర్వాత అతనే పాత అయిపోయి ఊరుకుంటాయ్. అంతే వీళ్ళూనూ," అని నవ్వేసింది.

అలాగే కొన్నాళ్ళు గోలచేసి తర్వాత వాళ్ళే ఊరుకున్నారు. కొత్తలో వింతగా చెప్పుకున్నవారందరికీ, పాణీ, పద్మావతీ షికారుకి వెళ్ళటం, సినిమాలు చూడటం,

ఆమె అతని చెయ్యిపట్టుకుని నడిపించటం పాతసంగతే అయిపోయింది. ఇప్పుడు వారివైపు ఎవరూ ఆశ్చర్యంగా చూడటం లేదు. డబ్బూ దిక్కూలేని పేదపిల్ల అతనికి ఆసరాగా తిరుగుతూందని కొందరనుకుంటే, కళ్ళులేనంత మాత్రాన్న వయస్సు ఊరుకుంటుందా ! అందమైన పిల్లనే చేరదీశాడు. డబ్బుంది. దాని అదనూ, ఇతని అవసరం రెండూ తీరిపోతున్నాయి, అనుకునేవారు కొందరు. కాని పద్మావతితో పరిచయమున్నవారూ పాణిని తెలిసినవారూ, అతనిదగ్గర పని చేసే ఉద్యోగులూ ఇలా అనుకోవడానికీ అనడానికీ కూడా సాహసించలేదు.

వారం తిరిగేసరికి తోట బేరం కుదరడం, రిజిస్ట్రేషను కావడంకూడా జరిగిపోయింది. తోట ఎవ్వరిదో కాదు. తోటా తోటలో పిచేగాలీ నాది. అనే తృప్తి పాణికి, ఎన్ని జామికాయలూ రేగుకాయలూ కోసినా ఇంకెవర్నీ అడగక్కర్లేదు. హాయిగా కోసుకోవచ్చు. తోటంతా ఇష్టంవచ్చినట్టూ తిరగవచ్చు. చక్కని ఎఱ్ఱని మామిడిచిగుళ్ళంటే తనకెంతో ఇష్టం. అవి కోసుకోవచ్చు. అనే సంతోషం పద్మావతిది. మొదటిలో అన్నపూర్ణమ్మ, మనకి మామిడితోటెందుకురా అన్నా మామిడిచెట్లేకాక, సపోటా, జామీ, నారింజా, కొబ్బరీ, ఉసిరికా, జీడీ లాటి పళ్ళజాతుల చెట్లన్నీ ఉన్న తోటని ఆమె కూడా సమ్మతించింది. కొందే

ఐటెక్స్
సౌందర్య సాధనములు
EYETEX BINDI
EYETEX BINDI
EYETEX BINDI DELUXE
EYETEX REGD.
EYETEX 4 IN 1 BINDI
EYETEX KUMKUM PASTE
EYETEX - DELUXE BINDI PENCIL
ARAVIND LABORATORIES MADRAS-600 033

ఇప్పుడు మనం, తర్వాత శశిపిల్లలూ ఫలసాయం అనుభవిస్తారు అంటూ.

ఒక్కోరోజు ఉదయంవెళ్ళి సాయంత్రంవరకూ తోటలోనేగడిపి వస్తున్నారు, అన్నపూర్ణమ్మా, పాణీ పద్మావతీకూడా. అప్పుడప్పుడు రంగారావూ, భార్యా కూడా తోటకి వస్తున్నారు. రంగారావు పద్మావతికి ఉద్యోగప్రయత్నాలు పట్టుదలగా చేస్తున్నాడన్నసంగతి ఎవరికీ తెలియదు.

* * *

"ఇదిగో పద్మావతీ! నాకు డియరెస్టు ఫ్రెండు. బికాం. పాసై మాంచిఉద్యోగం సంపాయించాడని చెప్పాను గుర్తుందా! ఇతనిపేరు జానకిరాం." పరిచయం చేశాడు పాణి.

"నమస్కారం." అంది పద్మావతి, చేతులుజోడించి.

పాణివలన ఆమె వివరాలు విని ఉన్నాడు కనుక అతనేమీ ప్రశ్నించలేదు. చిరునవ్వుతో, ప్రతినమస్కారం చేసి ఆమెవైపు చకితుడై చూడసాగేడు.

అతనిచూపుల చురుకుదనానికి ఇబ్బందిగా కదిలి "వస్తాను, పాణిగారూ, మీరు మాట్లాడుతూ ఉండండి." అని లోపలికి వెళ్ళిపోయింది పద్మావతి. ఇప్పుడు పద్మావతికి ఆ ఇంట్లో అరమరికలులేవు. తనకేవస్తువు కావాలన్నా చనువుగా తీసుకుంటూంది. "పిన్నిగారూ కాఫీ తీసుకుంటున్నాను. ఈ పూట ఇక్కడే భోజనం చేస్తాను. నాకు ఆకలిగాఉంది, టిఫినేంచేశారు?" అని అడగటానికి ఆమె బిడియపడటంలేదు. అలాగే పాణికి టవలందించటానికీ, టిఫినూ, కాఫీ అతని చేతికివ్వడానికీ, అతనిచేతిమీద నీళ్ళు పొయ్యడానికీ కూడా ఆమె జంకి ఎవరేమనుకుంటారో అని భయపడటంలేదు. అతన్నినవ్వించి కవ్వించడానికీ పోట్లాడటానికీ కూడా ఆమె వెనుకాడదు. ఇంతెందుకు. ఆమె ఆ ఇంట్లో ఓ వ్యక్తిగా కలసిపోయింది. రంగారావింట్లో ఆమె మకాం నామమాత్రమే, అక్కడ ఉన్న కొద్దిసేపూ సుశీలమ్మకు ఇంటిపనులు సాయం చేస్తుంది. రంగారావుతో ఆప్యాయంగా వినయంగా మాట్లాడుతుంది. తనకు ఎవ్వరూలేరన్న దిగులూ, డబ్బులేదన్న బెంగా పోయాయి పద్మావతికి.

అప్పటికి తప్పించుకున్నా సాయంత్రం జానకిరాంతో కూడా షికారుకి బయలుదేరకతప్పలేదు పద్మావతికి. తన స్నేహితుణ్ణి కలసిన సంతోషంలో చాలా హుషారుగా ఉన్నాడు పాణి. జానకిరాం చూపులు తనను తాగెయ్యాలన్నంత కాంక్షతో ఉన్నట్టనిపించడంతో ఇబ్బందిగా ఉంది పద్మావతికి.

"పద్మావతీ తోట చూపించండి మా జానకిరాంకి." అన్నాడు పాణి తోటలో కారుదిగుతూనే. పాణిని జానికిరాం నడిపించాడు కొంచెందూరం. తర్వాత ఓ చెట్టుకిందకూచుని కాస్సేపు కబుర్లు చెప్పుకున్నారు. మౌనంగా కారులో తాము

తెచ్చుకున్న టిఫినూ కాఫీ వారి ఇద్దరికీ ఇచ్చింది పద్మావతి.

"పద్మావతీ, నేనిక్కడ కూర్చుంటాను. జానకిరాంకి తోటంతా చూపించండి" మళ్ళీ అన్నాడు పాణి.

తానేఎందుకుచూపించాలి? డ్రయివరును తప్పితే అప్పారావుని, చూపించమనకూడదూ! అయినా ఈయనకేమీ తెలియదు. అనుకుని అయిష్టతతో మౌనంగా ఉండిపోయిన పద్మావతివైపు చూసినవ్వుతూ.

"నాకు తోట చూపించడానికి మీకు అభ్యంతరమైతే వద్దులెండి. పద్మావతి గారూ," అన్నాడు జానకిరాం.

రోషంలాంటిది వచ్చిన పద్మావతి. చివాలున లేచి నిల్చుని. "పదండి తలమ్ముకున్నాక యజమానిమాట త్రోసి పుచ్చే అధికారం నాకెక్కడిది?" అంటూ పాణి పిలచి ఏమో అనబోతూన్నా ఆగకుండా, వినిపించుకోకుండా ముందుకి నడిచింది పద్మావతి. ఆమెను అనుసరించాడు జానకిరాం. తోటంతా తిప్పి చూపించి, అతను నవ్వుతూవేసే ప్రశ్నలకు ముఖావంగా పొడిగా జవాబులు చెప్పింది పద్మావతి. "మీకు తలితండ్రులున్నారా? మీకు పెళ్ళయిందా! ఏం చదివారు?" అవి అతనిప్రశ్నల్లో ముఖ్యమైనవి.

తిరిగి వచ్చిన పద్మావతితో, "నేను మిమ్మల్ని ఆజ్ఞాపించలేదు పద్మావతీ! జానకిరాం మన అతిధి. అతన్ని గౌరవించాల్సిన బాధ్యత మనకుంటుంది కదా!" అన్నాడు నవ్వబోతూ పాణి.

అతనితో అప్పుడు వాదించడం ఇష్టం కాని పద్మావతి "నిజమే. నేనుమాత్రం కాదంటానా!" అని "జానకిరాంగారూ, ఎలా ఉంది చక్రపాణిగారి తోట?" నవ్వుతూ జానకిరాంవైపు తిరిగి ప్రశ్నించింది పద్మావతి.

"చాలా బాగుంది. మా పాణికే కళ్ళుంటె, ఈ తోటచూసి ఎంత ఆనందించేవాడో!" అని విచారం. వ్యక్తం చేశాడతను.

మరికొంచెంసేపు కూర్చుని ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ నవ్వుకున్నారు. పాణీ, జానకిరాం. పద్మావతి పూల మొక్కలవైపు వెళ్ళిపోయి వాటికి గొప్పులు తవ్వుతూ గడిపింది.

తర్వాత తన స్నేహితుడు నాలుగు రోజులు ఉండాలని వచ్చాడు కనుక అతనికి మర్యాదలు సరిగ్గా జరగడం కోసం. "పద్మావతీ! ఈ నాలుగు రోజులూ మీరు మా ఇంట్లోఉండి అత్తయ్యతో సహకరించరా?" అని అర్ధించిన పాణిమాట త్రోసిపుచ్చలేని పద్మావతి అంగీకరించింది.

ఆ ఇంట్లో అటూ ఇటూ తిరుగుతూ, మాట్లాడుతూన్న పద్మావతి, జానకిరాంని 'ఆమెను తనదాన్ని చేసుకోవాలి' అనుకునేంతగా ఆకర్షించింది. అతను త్వరలోనే ఆ నిశ్చయానికి వచ్చేశాడు. పాణితో సంప్రదించాలని కూడా నిర్ణయించుకున్నాడు. (సశేషం)

Printed and Published by A. Chandrasekhar Rao, at 5-9-88, Public Garden Road, Hyderabad, for YUVA Publications and Printed at Dolton Press, Hyderabad-500 001. Controlling Editor : "CHAKRAPANI"

